# పురాణకల్పకము

## ప్రథమపుష్పము.

ఆంధ్ర స్కాందవ హాపురాణము
వచన ము.

ప్రథమదళము. సంపాద లు, **500** పుటలు.

శ్రీమాన్ కోగంటి లక్ష్మీ రసింహాచార్యులుగారు.

నలసంవత్సర చైత్ర ద్ధ పాడ్యమినుండి రా యల్ ఆక్టోవో సైజున మంచి కాగితముల పై ముద్రింపించి సంపుటములుగ ప్రకటింపఁబడును. చక్కని క్యాలికో ఫ్రెంపెన్ బౌండు. ఆంధ్రీకరణము, శైలి పోతనామాత్యు భాగవతమును స్ఫురణకుఁ దెచ్చుచుండును.

చందాదారులకు *100* పుటలకు *8* అణాలు. ఇదితరుల కీపవిత్రగ్రంథ జములు లభింపనేరవు.

ప్రకటనకర్త,

గరికి టి సేతుమాధవరావు.

 త గుంటూరు.

# విజ్ఞాపనము.

---

ఆంధ్రసోదరులారా !

ఈగ్రంథమాలాచతుర్థప్రచురణ మగునరవింద నాకేభాగము గఁ బంపుచున్నానని మున్ను నాచేఁ జేయఁబడినప్రకటనలకు భిన్నముగఁ గారణాంతరములచే నడవవలసివచ్చినందులకెంతయు వగచుచున్నాను. ఈ నావిచారము గుణగ్రహణ పారీణులగు చదువరుల "స్వర్ణ మెన్నితునుకలుగ నొసంగినను గ్రాహకులు క్లేశపడ" రను ప్రోత్సాహజనకవాక్యములచేఁ బోఁగొట్టఁబడుఁగాక. ఇందనుక చేయఁబడిన ప్రకటనములఁబట్టి రాఁబోవు (సెప్టెంబరు—అక్టోబరు) గ్రంథము రవీంద్రనాథటాగూరునిజీవనచారిత్రమై యుండవలెను గాని యానియమము ననుసరించితినేని యరవింద రెండవభాగము 1916వ సంవత్సరమునఁ బ్రకటింపఁబడవలెను. 1916 వ వత్సరమున నవలలతోఁ బాటొకనాటకము, నొకపూర్వకవిప్రబంధము, నొకప్రకృతిశాస్త్రము నొకమహాపురుషునిజీవితముఁ బ్రకటించుటకు స్థిరపఱుపఁబడెను. ఆకారణమున రవీంద్రనాథటాగూరుని జీవితమునకు బదు లరవింద రెండవభాగముఁ బ్రకటించి, రవీంద్రనాథటాగూరు జీవితచారిత్రము వచ్చెడుసంవత్సరమునఁ బ్రకటించెదను. కిట్టుబడియుండుఁగాని, గ్రంథ ప్రాశస్త్యమునందుఁగాని యేలోపముఁ గన్పింపనిచో గ్రంథవిభజనముంగూర్చి పాటింపఁబడకుండుట యుత్తమలక్షణము గాన నుత్తమోత్తములగు మా గ్రంథమాలా రాజపోషకులు, పోషకులు, సహాయులు, చందాదారులు నాయీసాహసమును మన్నింప శతధా ప్రార్థితులు.

ఇట్లు విధేయుఁడు,
గరికిపాటి సేతుమాధవరావు,
గ్రంథమాలాధికారి.



# అరవింద.



## మొదటి ప్రకరణము.



### ఎద్దుల బండి.

శ్రీభూలలనామణికి నమూల్యాలంకారమై యొప్పు హిందూదేశమునందు గోదావరీమండలము సకలసస్యఫలవృక్షభరితమై, మందాకినీసదృశనదీశోభితమై, యనేకపావనరాజవంశసంయుతమై యలరుచుండును. గోదావరీమండలమునందలి పుణ్యక్షేత్రములలోఁ బీఠికాపురము మిన్నయై యున్నది. అది త్రిగయలలో నొకటియై, పంచమాధవములలో నొకటియై, యష్టాదశ పీఠస్థానములలో నొకటియై, పద్మనాయకకులస్థులచేఁ బాలింపఁబడుచున్నది. దానిసమీపమున రెండుక్రోశముల దూరమునఁ జంద్రమపాలెమను గ్రామము కలదు. క్రీస్తుశకము 1780 వ సంవత్సరమున వసంతర్తువునందుఁ జంద్రమపాలెములో మనకథ ప్రారంభమగుచున్నది.

ఒకనాఁడు సాయంకాలమైనది. పవలెల్ల నెండ మెండుగఁ గాయుటచేఁ బరితాపమొందిన జంతుసంతానముల పరితాపముల హరియింపఁజాలు చల్లని మెల్లదెమ్మెరలు వీఁచుచుండెను. రసాల పల్లవముల మెక్కి మందపవమానసంచలితములగు లతాడోలికలయం దూఁగుచుఁ గోయిలలు సగర్వముగఁ గూయుచుండెను. పాంథజనులు స్వగ్రామములు పెఁదలకడఁ జేరుటకై త్వరితముగ నడచుచుండిరి. పక్షులు కిలకిలా

లాపములుసేయుచుఁ దమతమ యిరవులకుఁ జేరుచుండెను. గోపబాలురు 'తందాన' పదములు పాడుచుఁ బశువులనుదోలుకొని యిండ్లకేగుచుండిరి. పగలెల్లను దినినమేఁతను నెమరువేయుచు నిటునటు నూఁగుచుఁ బసరములు మందగతినిఁ బోవుచుండెను. అట్టి సమయమునఁ జంద్రమపాలెమున కఱక్రోసుదూరమున నొకయెద్దులబండి నడచుచున్నది. ఎడ్లు మంచిమేఁతనుమేసి చక్కఁగా బలిసియున్నవి. చోదకుఁ డదలించునే తడవుగ నవి రయఁగతినిఁ బోవుచున్నవి. ఆబండిని బందొమ్మిదేండ్ల ప్రాయముగల బాలుఁడొకఁడు తోలుచుండెను. వాఁడు పసుతములపాను వంటి దేహచ్ఛాయగలవాఁడు. విశాలఫాలలోచనములు గలవాఁడు. సమగ్రమైన నాసికగలవాఁడు. నూనూఁగు మీసములుగలవాఁడు. వయసునకుఁదగినపుష్టియుఁ బుష్టికిఁదగినపొడవును గలవాఁడు. అతఁడు కట్టిన పుట్టములఁజూడ నతఁ డొకపేదవాఁడని తోఁచును. వాని ముఖవిలాసమునఁజూడ నెంతో యదృష్టవంతుఁడని తట్టును. మొగమునుండి క్షాత్రతేజము సౌమ్యముగాఁ బ్రసరించుచుండును. వాని లావణ్యాతిశయముం జూచియేకాఁబోలు వానికిఁ బ్రభాకరుఁడని సార్థకనామధేయమును బెట్టిరి. వాని సుగుణసౌందర్యాతిశయమునుజూచి యేదోయొక విధముగ నానందముం బొందని స్త్రీపురుషు లాగ్రామమున లేరు.

ప్రభాకరునిచే నడుపఁబడు శకటములో నొకయువతి పదునాలుగేండ్ల వయస్సుగలది కూర్చుండి యుండెను. ఆమెమేను పదారువన్నె బంగారుచాయఁగలిగి, యించుక పలుచనై యణుమాత్రము వయసునకు మించిన పొడవుగలదై యుండెను. ఇప్పుడామె కలువపూవంచు పలుచని తెల్ల యుప్పాడచీరఁగట్టి, గుంటూరులోనేయఁబడిన సరగపట్టెలుగల తెల్లరవికఁ దొడిగెను. తొలక్కారుమబ్బువలె నల్లనై, దీర్ఘమై యున్న కురులు వదులుగా జడక్రిందనల్లఁబడి యామెవీఁపున వ్రేలాడుచుండెను. నీటుజాతిపై స్వర్ణరేఖవలెఁ బాపడి తిన్ననై యొప్పులు గులుకు

చుండెను. కాళ్ళకు వెండికడియములు, చేతులకు మేలిమి బంగారు మురుగులు, చెవులకు రవలపువ్వులు, కంఠమున రెండు మంచిముత్తెములహారములును దప్ప నామె కితరమైనయాభరణములు లేవు. ఆమెమోము సదా మందహాసశోభితమై కలకలలాడుచుండును. నేత్రములు కాటుకరేకలచే నొప్పుచు లక్ష్మీనివాసయోగ్యములై యున్నవి. గిల్లినఁ బాలుగాఱునట్టి నవకముతోఁ జెక్కిళులుండెను. సాయంసమయ సమీర ప్రసారముచేఁ జలించుచు, వికచారవిందమునుబోలు నామె నెమ్మోముపై కెగయుచున్న ముంగురులు, అప్పుడే వికసించిన పద్మమునుండి బొదులుగట్టి మీఁదికెగయు నల్లతేఁటిగములవలె నొప్పారుచుండెను. ఆమె జనకుఁడు పల్లెటూరిలోనివసించుచు నాగరికత యంతగా లేనివాఁడైనను, ఆకాలపువారివలెఁ దగినను దగకపోయినను బిడ్డలకుఁ దమపూర్వకులపేరులే పెట్టవలెనను నియతిబుద్ధిగలవాఁడుకాఁడు. పిల్లలకు రూపరేఖావిలాసములను బట్టికాని, గుణోన్నతినిఁ బట్టికాని నామకరణములు చేయవలెననియు, నటుల సరిపడనిచో దేశమునకు భూషణములై పురాణములయందుఁ బ్రసిద్ధిఁగాంచిన మానవశ్రేష్ఠుల పేరులను సమయానుకూలముగఁ బెట్టవలెననియు నభిప్రాయముగలవాఁడు. అందుచే తన కూఁతునకు ముఖవిలాసమునుబట్టి యరవిందయని పేరుఁబెట్టెను.

నాఁడు గురువారము. పీఠికాపురములో సంతజరగుదినము. ప్రభాకరుఁడు తనయజమానునికొఱకుఁ గొన్నివస్తువులను సంతలోఁ గొనుటకుఁ బీఠపురికిరాఁగా, నరవిందయుఁ బిఠాపురపు రాజుగారియొద్ద ముఖ్యోద్యోగస్థుఁడైన రామరాజుభార్యయుఁ దనకుఁ బినతల్లికొమార్తెయు నగు కాంతమ్మను జూచుటకు వానిని వెంబడించివచ్చెను. ప్రభాకరుఁ డరవిందను సోదరి యింటదిగవిడచి తాను సంతకుఁబోయి వలయు వస్తువులను సేకరించుకొని మరల నామెను దీసికొని యింటికి వచ్చుచుండెను. అరవింద కాఱేండ్లు నిండకమునుపే తల్లి పరలోకమున కేగెను.

తల్లి గతించినవెనుక నామెను వితంతువైన పినతల్లి, శాంతమ్మతల్లి, సీ
తాభాయియును నామె పెంచుచుండెడిది. సీతాభాయి గొప్పయింటఁ గా
పురముచేసి మిగుల విద్యాభ్యాసంగముంజేసిన వనితారత్నము. ఆమె
శిక్షలోనుండుటంబట్టియే యరవింద కుదారగుణములును సద్విద్యయు
వచ్చినవి. కాని యాగుణములు పూర్ణత్వమును వహింపక పూర్వమే
సీతాభాయి హఠంబున మారిచే మృతినొందెను. ఇప్పు డరవిందయే
గృహకృత్యనిర్వాహమును జేయుచుండెను. ఆమె వయసునఁ బిన్నది
యయ్యు బుద్ధిచేఁ బెద్దయై బంధువుల నాదరించుటయుండును, సేవకాదు
లను బ్రీతితోఁ జూచుటయుండును గొప్పకీర్తి నివహించెను. వితరణ
బుద్ధియుం దామె కామెయేసాటి. ఒకరికొక యుపకృతి కొనర్చి యది త
ప్పుపనివలె రహస్యముగ నుంచునుగాని బయలుపెట్టదు. పరులదుఃఖ
మునుజూచి యేమియుసహింపలేదు. అట్టినవనీతహృదయకు ముందె
ట్టియదృష్టముపట్టునో! అరవిందాప్రభాకరు లాకీలి వచ్చుచుండఁగా
జంద్రమపాలెమునకు సమీపముననున్న చెరువుగట్టున నొకముసలివాఁడు
పండుకొనిరొజుచుఁ బ్రాణములు గోల్పోవువానివలె బాధపడుచుండెను.
ఆర్తనినాదము వినఁబడినతోడనే యరవింద బండినాపుమని ప్రభాకరున
కాజ్ఞయిచ్చి, బండిదిగి వానిని సమీపించెను. వృద్ధుఁడు వడఁగొట్టి
పడినట్టుభావించి, యామె వడివడిబండికడకుఁబోయి, యొక కంచుచెంబు
నుదెచ్చి, తటాకోదకమునుబట్టి, వానిమొగముఁగడిగి, కొంచెమునీరు
నోటిలోఁబోసెను. వాఁ డించుకసేదఁదీఱి కన్నులుతెఱచెను. కాని మిగు
ల నీరసస్థితిలోనుండుటచే లేవలేకుండెను. అరవింద చేయూఁతయిచ్చి
వానిని గూర్చుండఁబెట్టి "అయ్యా! నీకు బాధనివారణమైనదా? మా
గ్రామమిచ్చటికి సమీపముననేయున్నది. నీవు మాకతిథివై కొంతకాల
ముందుము. నీకు సమస్తోపచారములును జేసి రుగ్ణతమాన్పింపెదను. నా
జనకుఁడు దయాశీలుఁడు. నీవంటివృద్ధు నాదరింపకపోఁడు." అని మృదు

మధురస్వరముతోఁ బల్కెను. ఆముసలి సహజముగాఁ గురూపి. అస్థ
లుమాత్రమేయుండి మాంసవిహీనమై ముడుతలువడియున్న దేహము
గలవాఁడు. వానినడుమింతక వంగినది. రూపునకుఁ బాటవముతప్ప
లేదుగాని కండ్లు గూళ్లలోఁబెట్టినట్లు దిగచుకొనిపోయియుండెను. గొం
గళిపురుగులవలెనున్న కనుబొమలు మరింతవికారరూపమును దెచ్చినవి.
అరవింద యెంతటిదయాస్వభావ కాకపోయిన నింతటివికారరూపు,
విదేశీయు, వృద్ధు, వ్యాధిపీడితుఁ దనగృహమున కేలకొంపోవయ
త్నించును.

ఆమాటలువిని ముసలివాఁడు బాలికవంకఁ దేఱిపాఱఁజూచి
« అమ్మా! నీవు వందనీయురాలవు. నాకుఁ జాలనస్వస్థతగానున్నది కృ
తజ్ఞతను దెలుపఁజాలను. మీయింటనతిథినై యుండుటకు నాకుసమ్మ
తమేకాని వ్యర్థముగా భారముఁగలుగఁజేయుచాయని—" అనిచెప్పఁబోవు
చుండఁగా నరవిందచేయు నుపచారములను శ్రద్ధతోగమనించుచుఁ గా
వలసినయెడలఁ దనచేతనైనంత సాయముచేయుటకు సిద్ధముగానుండి
యామెప్రక్కనే నిలువఁబడియున్న ప్రభాకరుఁడు మాటకడ్డమువచ్చి
« అయ్యా! నీవా? భారమా? నరసింహరాజుగారికి నీవంటివారు మ
త్రి పదిమందివచ్చినను భారములేదు." అనెను. అరవిందయు «తాత
గారూ! నిజమే. మాకేమియు భారముకలుగదు. మీరు స్వేచ్ఛగా
మీయిచ్చవచ్చినన్నిదినములు మాయింటనుండవచ్చును." అనివచిం
చెను. ముసలిమాతఁడును వారియాహ్వానము నంగీకరించెను. ప్ర
భాకరుఁడు బండిలోనున్న సరకులన్నియు నొకప్రక్కకుసర్ది, తక్కినభా
గమంతయు మెత్తగాగడ్డితోనింపి, పైనఁజాపఁబఱచి రోగికనుకూలముగ
నుండునట్లు సర్వమునాయిత్తముచేసెను. అంత నరవింద యొకచేయి
యుఁ బ్రభాకరుఁడొకచేయియుఁ బట్టుకొని వానినిమెల్లఁగ నడిపించుచు
బండిలోనెక్కించిరి. అతనిమూటయు నందుఁబెట్టిరి. అరవింద కొంగు

తో విసరుచు రుగ్ణుని చెంతనే కూర్చుండెను. ప్రభాకరుఁడు రోగికా యాసము కలుగకుండ మెల్లగా బండినిఁబోనిచ్చుచు గ్రామముంబ్రవేశించి నరసింహరాజుగారి లోగిటముందర నాపెను. అరవింద చప్పునదిగి లోనికరిగి తండ్రి చెవిలో నేదో చెప్పెను. అతఁడును సంతుష్టహృదయుఁడై బండిదగ్గఱకువచ్చి రోగికిస్వాగతమొసంగెను. ఇంతలో నరవింద వీధివైపుననున్న గదియొకటి సవరించియుంచెను. ముసలియాతఁడాగదిలోనికి సురక్షితముగాఁ గొంపోఁబడెను.

నరసింహరాజంతస్ఫురద్రూపికాఁడు. ఆతనికిప్పుడేఁబదియేండ్లవయస్సుండును. కౌమారావస్థ ననుభవించుచు దేహ మించుకస్థూలముగానుండెను. సదా వ్యవసాయమునందే కాలముఁబుచ్చువాఁడగుటచే వానికాయము కొంచెము మోటుగానుండెను. అతనికిఁజంద్రమపాలెములో భూవసతిమెండుగఁగలదు. గ్రామములోసగము భూమి యాతనిదే. అదంతయు వానిస్వంతవ్యవసాయముక్రిందనే యుండెను. దానికిమంచినీటివసతియుండుటచేఁ బండకపోవుటెన్నఁడును లేదు. నరసింహరాజు గొప్పయౌదార్యము కలవాఁడగుటచేతఁ బండినపంటలోఁ గొంతభాగము బీదలైన సర్వజాతులవారికి నన్నప్రదానముక్రింద వినియోగించుచుండును.

వృద్ధుఁడు సుఖాసీనుఁడై కొంతసేపుండి, తరువాత మిక్కిలియలసటఁజెందినవానివలె నిద్రపోయెను. వానివివశస్థితిఁజూచి యరవిందయు నరసింహరాజును భయమంది, ప్రభాకరుని నుచ్చిగురులింగమను వైద్యునికొఱకుఁ బీఠికాపురమునకుఁ బంపిరి. జాముగాత్రియైనపిమ్మట గురులింగమువచ్చి, రోగినాడిఁ బరీక్షించి, కొంచెము వాతముగా నున్నదనియు ముసలిప్రాణమగుటచే నించుకజాగ్రత్తగానుండుట మేలనియుఁ జెప్పి, మూఁడుమాత్రలిచ్చి వెడలిపోయెను. రాత్రివై దినగడియకు వానికిఁ దెలివివచ్చెను. అరవింద " తాతగారూ ! మెలఁకువవచ్చిన

దా ? మీస్నేహితులుగాని బంధుగులుగాని సమీపమందుండిరా ? ఉన్న వో బిలిపించెదము. మీకును వారిని జూచిన మనస్సుతృప్తిగా నుండును. " అని మెల్లగా ననెను. అతఁ డామెకుఁ బ్రత్యుత్తరము సయితమీయఁజాలనంత బలహీనముగా నుండెను. కొంతవడియూరకుండి యతఁడు “అమ్మా ! నాకు సన్నిహితులగు చుట్టములుగాని నెయ్యురుగాని యెవ్వరును లేరు. నామూటనువిప్పి యందులో నొక తాటియాకుల పొత్తమున్నది తీసియిమ్ము. " అనియడిగెను. అరవింద యట్లొనర్చెను. వాఁడాపుస్తకమునువిప్పి యరవిందవైపు తిరిగి “అమ్మా ! నేను బంధుమిత్రాదులు లేని కడుబీదవాఁడనైనను, నా జీవనము గౌరవముగాఁ జేయఁగలుగునాధారము లేనివాఁడనుగాను. నాకున్న యాస్తి యెంతో వివరముగా నిందువ్రాసికొనియుంటిని. కావునఁ దల్లీ ! నాకుఁ గొంచెము జవసత్వము లువచ్చునంతకు నన్ను గాపాడితివేని నీమేలుమఱవను. నాకైన వ్యయమంతయు నిచ్చివైతును. " అనిచెప్పగావిని యరవింద యించుక విసుగుగొని, విసుగుదనమును జూపుటకిదిసమయముకాదనియెంచి “ అయ్యా ! మేముడబ్బుపుచ్చుకొని యన్నముంబెట్టువారముకాము. నీ చేవిఁయుఁ జెల్లింపనక్కఱలేదు. నీవు సుఖవగుటయేమాకోరిక. " అనిపలికెను. ఆపలుకులకుముసలివాఁడు సంతసించి కొలఁదిమాటలతోఁ గృతజ్ఞతను వెలిఁబుచ్చి తాళపత్రగ్రంథమును భద్రముగాఁ దలకిందఁబెట్టిదాఁచికొని కన్నులుమూసికొనెను. ముందు వానిగతి యేమగునో ?



# రెండవప్రకరణము.

## రుగ్ణుఁడు.

తెనుఁగు మండలములోనున్న క్షత్రియ కుటుంబములలో వత్సవాయవారి కుటుంబము మిగులఁ బ్రసిద్ధివహించినవానిలో నొకటి. వత్సవాయవారిలో నొక కుటుంబమువారు చిరకాలమునుండి చంద్రమపాలెములోఁ గాపురము చేయుచుండిరి. వారందఱకు వ్యవసాయమే వృత్తిగా నుండెను. వారిలోఁ జాలమంది చక్కని సాహిత్యముగలవారు. మధ్యాహ్నము సోమరులై నిద్రఁబోక స్త్రీలును బురుషులు నొకచోఁ గూడి పురాణకాలక్షేపము సేయుచుందురు. ఆడంబరవ్యయములు చేయక కొంత ధనమును గూడఁబెట్టుచుఁ గొంత ధనమును బీదసాదులకు దానము చేయుచుందురు. ఆవంగడములోనివాఁడే మన నరసింహరాజు. అతని తండ్రి వెంకటపతిరాజు తన సామర్థ్యముచేఁ బూర్వార్జితముగు భూమి నినుమడింతలుచేసి వెక్కసమైన రొక్కమునుగూడ నిలువఁ జేసెను. వెంకటపతిరాజున కిరువురు పుత్రులును, మువ్వురు పుత్రికలును జనించిరి. ప్రథమ పుత్త్రునిపేరు భూపతిరాజు. అతఁడు చిన్ననాఁటినుండియు విదేశములకేగి వాణిజ్యమును జేయవలెనని కుతూహలము గల్గియుండెను. ఒకనాఁ డతఁడు తండ్రియనుమతినిఁ బొంది విస్తారధన సంచయంబులు సమకూర్చుకొని యోడనెక్కి సింహళద్వీపమునకుఁ బ్రయాణమైపోయెను. అతఁడు బయలుదేఱిన కొలఁది దినములకు జలధియుప్పొంగి గొప్ప తుపాను పట్టెను. భూపతిరాజును వాని యనుచరులును సంద్రములో మునిఁగిపోయిరని వదంతిపుట్టెను. దానికిఁ దార్కాణముగా భూపతిరాజుగాని వాని సహచరులుగాని యేనాఁటికిని రారైరి.

ఒక్క కుశలవార్తయైనను బంపరైరి. వారిలోఁ గొందఱి శవములు రామేశ్వరప్రాంతమునఁ గాన్పించినవఁట. భూపతిరాజు కళేబరముమాత్రము కనఁబడలేదు గాని, యతనిజాడ యేమియునుదెలియమి నతఁడుగూడ మృతినొందియే యుండునని యందఱును భావించిరి. వెంకటపతిరాజుయొక్క ద్వితీయ పుత్త్రుఁడు నరసింహారాజు. అతఁడే పితృ మరణాంతరమున నాస్తికిఁ గర్తయయ్యెను. వెంకటపతిరాజు తన కొమార్తెలలో నిద్దఱను, లక్ష్మీభాయి పార్వతీభాయి యను వారలను, విజయనగరపురాధీశుఁడగు విజయరామగజపతికి సమీపజ్ఞాతులును జిన్న జమీందారులును నగు కృష్ణమరాజు నారాయణరాజులకుఁ గ్రమముగా నిచ్చి వివాహములు చేసెను. మూఁడవ తనయయగు సరస్వతీభాయి యను నామెను బెద్దాపురాధిపతియైన తిమ్మజగపతిమహారాజుగారి యాశ్రితులలో ముఖ్యుఁడై, మహాధనవంతుఁడై, రాజసమ్మానముంగాంచుచు ఘనముగ బ్రతుకుచున్న విజయసేనవర్మకిచ్చి యుద్వాహమొనర్చెను. మూఁడు సంబంధములును గొప్పవగుటచే వెంకటపతిరాజు తనయొద్ద నిల్వయున్న ధనమంతయుఁ గట్నములకుఁ గానుకలకు వ్యయపఱచెను. తన రెండవసుతునకు మేనత్తకముండఁగా గుణవతియు రూపవతియు నగు తత్సంబంధకన్యను జానకినిచ్చి పెండ్లిఁ జేసి యరవింద జానకి గర్భమందుండఁగా లోకాంతరగతుఁడయ్యెను. లక్ష్మీభాయికిఁ బార్వతీభాయికి నిరువురేసి పుత్రికలు గల్గిరి. వారు చరించుచున్న సంఘము గొప్పదగుటచేతను, భర్తలు జమీందారులగుటచేతను, అప్పసెల్లెండ్రిద్దఱును గర్వితురాండ్రై సాధారణస్థితిమంతుఁడైన సోదరునిమాట యెన్నఁడును దలపెట్టరైరి. ఏకోదరులగువారికిసైతము భాగ్యదేవత కన్నులు గప్పునుగదా! పాపము వారుభయులు నకాలమరణమొందిరి. సరస్వతీభాయి మాత్రము సమీపమందుండుటచేతను ధనవంతుఁడైన నను భర్త గర్వితుఁడు కాకపోవుటచేతను దఱచుగా న

హోదరుని గలిసికొనుచుండెను. ఆమె యొకకుమారునిఁగని యాఱవ నాఁడు కాలధర్మమొందెను. ఆబిడ్డకు మాతామహుని పేరే పెట్టిరి. ఆమె మరణానంతరమున విజయసేనవర్మ సతీరత్నముకొఱకు బెంగఁగొని, లౌకికవ్యాపారములం దంతగా జోక్యముఁ గలుగఁజేసికొనక, రాజర్షివలెఁ గాలముఁ గడపుచుఁ బుత్రునికై యెటులో ప్రాణములు నిలిపికొని, మనకథ యారంభించుటకు రెండు వత్సరములు పూర్వము దేహమునుజాలించి భార్యనుగూడి స్వర్గమున నెడతెగనియానంద మొందఁబోయెను. చిన్నవెంకటపతిరాజున కిప్పుడు పదునెనిమిదేండ్లుండెను. పిత్రుసమార్జితమగు మితిలేని ధనము వానియింట మూలుగుచుండెను. పురిటిలోఁ దల్లినిఁ గోల్పోయి, చిన్నతనమునుండియు నతిగారాబముతోఁ దండ్రిచేఁ బెంపఁబడి, క్రమశిక్షనొందక, యెట్టి జ్ఞానులకైన యుక్తాయుక్త విచక్షత్వమును నశింపఁజేయు యౌవనమందున్న యీబాలుఁ డాసొమ్ము నెమ్మెయి వినియోగించునో ముందు చూతము.

చదువరులారా ! మీకీ వంశవర్ణనముతోఁ జాల విసుగుగలిగించితిని. కాని ముందు కథాభాగము చక్కఁగా బోధపడుట కీయుపోద్ఘాతమవశ్యముగాఁ జెప్పవలసివచ్చెను. మనము మరల దేహస్మారకము లేకపడియున్న రోగి కడకుఁ బోదమురండు.

వృద్ధునకు సంభవించిన వ్యాధి మిక్కుటమైనదే. కాని గురులింగమిచ్చిన యౌషధ మహిమచేతను, సంతకంటెను నరవింద చేయు సంరక్షణముచేతను, అది క్రమముగా మరలుమొగమును బెట్టినది. అతఁడు చంద్రముపాలెము వచ్చి నెలదినము లయ్యెను. మొదటి దివసమునఁ దన్నాదరించినందుసకు నరవిందతోను నరసింహరాజుతోను గొన్ని కృతజ్ఞతాసూచకవాక్యము లాడినను, వాఁడు తర్వాతఁ దన కేలోపము వచ్చిన గొణఁగుకొనుటయుఁ గసరుటయు మొదలుపెట్టెను. అరవిందయెంత శ్రద్ధతో వానిక్షేమ మరసినను వానికిఁ దుష్టికలుగలేదు.

అతఁ డెంతబెట్టుసరిగానున్న నన్యథాభావింపక యామె కన్నతల్లివలె వా
నికి సర్వోపచారములను జేయుచుండెను. ఆపె గుణములచేతను రూప
ముచేతను దేవతాసన్నిభురాలనిన నతిశయోక్తి కాదు. ఒకనాఁ డరవిం
ద వాని కులగోత్రాదులను గూర్చి ప్రశ్నింపఁగా నతఁడు తాను క్షత్రి
యవంశ సంభూతుఁడనియు, నెల్లూరు మండలమందు నివసించువాఁడని
యుఁ బెద్దాపురపురాజుగారి ప్రాపును సంపాదించి శేషకాలము వెడలఁ
బుచ్చు నుద్దేశముతో బయలుదేఱితినని యు, దారితెలియక రాజమార్గ
మును విడిచి పుంతవెంబడి నడచి వృద్ధాప్యముకతంబున మార్గశ్రమా
తిశయంబుచే నాచెరువుగట్టున మూర్ఛపోయితిననియుఁ, దనపేరు శో
భనాద్రిరాజనియుఁ జెప్పెను. చంద్రమపాలెము చేరిన వారమున దినము
ల కొకనాఁ డతనికి జ్వర మతితీవ్రముగానుండి పరాకుమాటలు పుట్టె
ను. తాను ద్రోహిననియుఁ బశ్చాత్తప్తహృదయుఁడ ననియుఁ బలుమా
ఱు పరాకులో వచించెను. అతఁ డెట్టిద్రోహియగునో గ్రహింపనేరక
యరవిందయు నరసింహరాజును గలవలపడుచుండిరి. వానికి మెలఁకువ
వచ్చినప్పుడెల్లఁ దన తలయంపిదెస నుంచుకొనిన తాటియాకుల పుస్త
కముకొఱకు వెదకికొనుచుండెను. ఒకపర్యాయ మది కానఁబడమిఁ గ
లఁతనొంది యరవిందను బిలిచి " అమ్మాయీ! నాపుస్తకము నేలతీ
సితివి? అందులో నే నెన్నియో రహస్యములు వ్రాసికొంటినే! ఇది త
గునా? నాది నాకిమ్ము." అని యడిగెను. ఇదివఱకే నిర్వేదముతో
నుండి విధిలేక యోర్పువహించియున్న యామె యీమాటలు విని స
హింపలేక " తాతా! నీకేమి మతిపోయినదా? నీవంత జాగరూకత
తో దాఁచుకొన్న పుస్తకము నే నేలతీయుదును. నాగుణ మామాత్ర
ము గ్రహింపలేకపోయితివా? కష్టదశలో నుంటివని నిన్నుఁ జేరదీసినం
దులకుఁ దగినమాట లాడుచుంటివి. అట్టి నిరాపనింద నాపయి మోప
కుము. చక్కఁగా వెదకికొనుము. నీ తలక్రిందనే యది యుండును."

అని గట్టిగాఁ జెప్పెను. అతఁడు మరల వెదకి చూచికొనఁగాఁ దా నె
చ్చోట నుంచెనో యచ్చోటనే యది యుండెను. వానికి లజ్జ కలిగి త
న్ను మన్నింప నామెను వేఁడెను. ఆమెయుఁ గినుక మరలించుకొని య
నునయవాక్యములతో వాని నూరడించెను.

శోభనాద్రిరాజు పెలుసుమాటలు నరసింహరాజునకుఁ గిట్టకుం
డెను. సంధిదోషము తగిలినవాఁ డాడినమాటలనుబట్టి యతఁడేదో దో
షకృత్య మొనర్చె ననియే నరసింహరాజు నమ్మెను. వానిని సాధ్యమై
నంత త్వరలో వదల్చుకొనఁ దలఁచెను. వాఁడిప్పుడు మెల్లఁగాఁ గఱ్ఱ
చేతఁబట్టుకొని యింటిలో నడయాడుచుండెను అతఁడు బ్రతికి బయ
లుపడినాఁడు గనుక త్వరలో వెడలిపోవునని నరసింహరాజనుకొనెను.
ఇట్లుండ నొకనాఁడు శోభనాద్రి భోజనముచేసి గృహమేధికడకుఁ జని
యిట్లనెను. "అయ్యా! మీరు నన్నుఁ గనుఁబ్రేమతో నాదరించిరి. ఇఁ
క నెలదినములు మాత్రము మీ యింటనుండి పూర్ణస్వాస్థ్యము కలి
గినవెనుకఁ బెద్దాపురము పోయెదను. అంత దనుక నన్నాదరింపఁ గోరె
దను." ఈ పలుకులువిని యేమిమాట్లాడవలెనో యెఱుఁగక నర
సింహరాజు మిన్నకుండెను. ఇంతకాలమునుండి వాఁ డెంత యడ్డదిడ్డము
గా మాటలాడుచున్నను, దోషియని వాని నోటినుండియే వినియున్న
ను, దయార్ద్రహృదయుఁ డగుటచే నతఁడూరకుండెను. ఏదోమహాపాప
కార్య మొనర్చినవానిఁ దన సదనమున నుంచికొనిన నేమిచేటువాటిల్లు
నో యని యతఁ డూహించుచుండెను. మాటలచేత నొరుల కెంతక
ష్టముఁ గల్గించువాఁడైనను నరసింహరాజు సహించి యూరకొనును;
కాని ద్రోహబుద్ధితోఁ బాపకృత్యము లొనర్చినట్లు తెలిసిన పిమ్మట
నోర్వలేకయుండెను. అతఁ డిట్లు శోభనాద్రినిఁగూర్చి యోచనాసము
ద్రమందు మునిఁగియుండ నరవింద చూచి "తండ్రీ! వాఁడెంత పా
పియైనను బశ్చాత్తాపమునొంది యున్నాఁడు. అట్టివానికిఁ గిల్బిషముం

డదు. కావున నీవు సందేహింపక వాని కాశ్రయమీయవచ్చును." అని మెల్లగఁ జెవిలోఁ బలికెను. శోభనాద్రి వారిరువురివైఖరియుంగని వారి భావముల నెఱింగి యిట్లనెను. "మీయభిప్రాయములు నాకుఁ దెలిసినవి. నే నేవో మహాపాపకార్యము లొనర్చితినని మీ యూహ కాఁబోలు. నేను దప్పుచేసిన మాట నిక్కువమే. కాని యది మీరు తలఁచునట్టి రీతిది కాదు. నే నెవ్వరి ప్రాణములఁ దీయలేదు. ఒరుల సొత్తు దొంగిలలేదు. స్త్రీ ద్రోహము చేయలేదు. ఇరుగు పొరుగు వారికి ఘాతలు సలుపలేదు. సురాపాన మొనర్పలేదు. నేను జేసిన తప్పు నాకే హానిఁదెచ్చును గాని యితరులకుఁ గాదు. అది నాకును భగవంతునకును దెలియునుగాని యన్యులకుఁ దెలియఁ జాలదు. మీకును దాని సత్యము క్రమముగా నెఱుకపడును. ఇప్పుడైన నన్ను నమ్మి నాకాశ్రయ మొసంగెదరా ?" అరవింద వాని వాక్కులు విని సంతసించెను. ఇప్పుడు తండ్రి యేమి ప్రత్యుత్తర మిచ్చునో యని యాత్రముతో నాతనివంకఁ జూచుచుండెను. నరసింహరాజును వాని మాటల కలరి యతఁడు వచించిన వాక్కులవలన నతఁడు దుష్టుఁడు కాఁడని నిశ్చయించి "శోభనాద్రిరాజుగారూ ! మీరొక నెలమాత్రమే కాదు. మీకుఁ దోఁచినన్ని నెలలు మా గృహమున నుండవచ్చును. ఈ యిల్లు మీ సొంత యిల్లనియే భావింపవచ్చు" నని చెప్పెను. జనకుని దీన పరిపాలనాశీలతకు నరవింద మహానందముం బొందెను. శోభనాద్రి నాలుగయిదుమాటలు పలికి తనగదిలోనికిఁ బోయెను.

అంత నరసింహరాజు సుతతోఁ బెరటితోఁటలోనికిఁ బోవుచు "అమ్మాయీ ! ఈతని హృదయమును గ్రహించుట కష్టముసుమీ. ఈతఁడు మనుష్యుఁడొనరించు పాపకృత్యము లన్నిఁటినిఁ బేర్కొని వానిలో నెద్దానిని జేయలేదని చెప్పెను. ఇఁక నెట్టి దుష్కార్య మాచరించుటచే వాని మనస్సు బాధపడుచుండెనో తెలియకున్నది. దానికే

మి? మనము పూలతోఁటలోనికిఁ బోయి చల్లగాలి ననుభవించి వస్త ము రమ్ము." అని యామెతో నారామమునకుఁ బోయెను.

చంద్రమపాలెములో నరసింహరాజుగారి లోగిలి మిగులఁ బెద్దది. అది నాలుగిండ్ల బవంతి. ఇంటికి వెనుక విశాలమైన పెరడు గలదు. అందన్నివిధములైన ఫలవృక్షములును, పూలమొక్కలును గలవు. అక్కడక్కడ విశ్రమవేదికలు పాలగచ్చు చేయఁబడినవి కలవు. వానిపై వెదురుపేళ్ళతోఁ గట్టఁబడిన యాచ్ఛాదనము లుండెను. వానిపై మొల్ల, విరజాజి, కాశీరత్నము మున్నగు లతలు ప్రాకింపఁబడెను. ప్రతి ఋతువునందును సుగంధకుసుమములు నతిరుచ్యఫలములు నా తోఁపునందు దొరకును. ఒక విరజాజి తీఁగక్రింది వేదికపై మన యరవిందయు నరసింహరాజును నాసీనులైయుండి యిట్లుసంభాషించుచుండిరి.

నర — తల్లీ! అరవిందా! మన ప్రభాకరుఁడు మంచి కుఱ్ఱవాఁడుగాఁ గనఁబడుచున్నాఁడు. మన యింటికిఁ బదునాఱేండ్లయి వచ్చినాఁడు. ఎన్నఁడు మన కప్రియము నొనరించి యెఱుఁగఁడు. నాయానతి జవదాఁటి యెఱుఁగఁడు. పసిఁడికిఁ దావియబ్బినట్లు వానిగుణోన్నతికిఁ దోడు సౌందర్యమును వానికడ నున్నది. వాని విషయములో నీయభిప్రాయ మేమి?

అర — నాన్నగారూ! నన్నట్టి ప్రశ్న మడిగిన నేనేమి 'జవాబు' చెప్పఁగలను? అతఁడుమంచివాఁడు కాఁడనితోఁచిన నెట్లువానినాదరింతును? వానిని స్వజనములో నొక్కనిగనే లెక్కించుచున్నానుగదా!

అరవింద పరిపూర్ణ యౌవనవతి. ప్రభాకరుఁడును నిండు జవ్వనముందొప్పారు వాఁడే. అట్టివానినిగూర్చి యీమెను బృచ్ఛచేసిన నేమిపల్కును? ఈమె ముగ్ధగదా!

నర — నిజమమ్మా. అతఁడు మంచివాఁడు కావుననే నీవు వాని నాదరించుచున్నావు. నీకు వానియందు సదభిప్రాయ మున్నందు

కు నాకు సంతోషముగా నున్నది. అమ్మా ! నా కిప్పు డేఁబది
యేండ్లు దాటినవి. 'కలౌ వష్టి' యని పెద్దలు చెప్పుదురు.
ఇంక నెంతకాలము బ్రతుకఁబోను. నాకుఁ గూఁతుర వైనఁ గొ
డుక వైన నీవే. భగవంతుని యాహ్వానము నాకుఁ గాకమును
పే నీకు సుఖజీవనమార్గమును జూపి పోవలెనని యున్నది.

అర——ఇదేమిటి నాన్నగారూ? తీరి కూరుచుండి నిండింట నీయశుభవా
క్యములాడెదరేమి? ఇట్టిమాటలాడిన నేను మీ యెదుటనుండను.
అని ఖిన్నవదనయై లేవఁబోయెను. నరసింహారాజామెను వారించి
"తల్లీ! నీమనస్సు నొంపవలెనని నాయభిప్రాయముకాదు. ఉన్న
మాటాడితిని. నీపరిణయముంగూర్చి యొకయేర్పాటు నాచిత్త
మందుఁ జేసికొంటిని. అది నీకు సమ్మతమగునో కాదో నేనెఱుఁ
గను. చెప్పెదనువిను. ఈప్రాంతపు సాధారణపుసంసారులైన క్ష
త్రియకుటుంబములలో మనకంటె నెక్కువయనుకూలస్థితి యె
వ్వరికిని లేదు. ఇట్టియాస్తితో నిన్నుఁ బెండ్లియాడుట కేదేశాధిపతి
యైననియ్యకొనును. నాబిడ్డవని నేను బొగడుకొనుటకాదు. నీ
వంటి యందగత్తె మనప్రాంతపురాచకన్నెలలో లేదు. నీ
లావణ్యమునుజూచియే యువకులగు భూపాలురలోఁ బ్రతివారు
ను నిన్ను ద్వాహమాడఁగోరుదురు. కాని నీకట్టిగొప్పసంబంధ
మును నీసౌఖ్యస్వాతంత్ర్యములఁ బోగొట్టవలెనని నాకులేదు.
మాతోడబుట్టువడుచుల నెంతగొప్పవారికిచ్చితిమి ? వారేమైన
సుఖమనుభవించిరా ? ఇప్పుడు వారందఱుఁ జచ్చిస్వర్గమున ను
న్నారు. బ్రతికినన్నాళ్లుదినములును వారికి డంబములకే చాలి
నవి కావు. లోకములోని యువిదలందఱు సమస్తసంపదలతోఁ
దులఁదూఁగునట్టివానినే పెండ్లియాడ నిచ్ఛగింతురు. నీకు నటులే
యుండవ[illegible]ముగాని నా 'సలహా' యేమన స్త్రీ వరుని వెద[illegible]ను

నపుడు ధనమే ముఖ్యవిషయముగాఁజూడక రూపగుణములే ప్రధానముగాఁ జూచుచుఁ బేదవానినైన వివాహమాడుట మంచిదని. మా బావ కృష్ణమరాజు చూడిప్పుడేరీతి నుత్తమర్ణులచేఁ బీడింపఁబడుచున్నాఁడో. రెండవబావ నారాయణరాజున కాదాయమునుమించినవ్యయమేకదా? వారలెప్పుడు సుఖించుదురు? మృతినొందినపిమ్మటనైన వారియాత్మలు శాంతినొందవని నాయుద్దేశము. నామేనల్లునిఁగూర్చి నీవును వినియేయున్నావుగదా? వాఁడిప్పుడు తోఁచినట్లు ధనమును బాడుసేయుచున్నాఁడఁట. నామేన గోడండ్రికతి యేమగునో? వారు దాదాపు నీయీడువారేను మీ? ఇవన్నియుఁజూడఁజూడ నాకెంతమాత్రమును నీకు గొప్ప సంబంధమును గట్టిపెట్టవలెనని లేదు. అది నీకు సమ్మతమేనా?

అర—తండ్రీ? నాకేమి తెలియును? లోకవృత్తి నెఱిఁగినవాఁడవుగదా? నీకెట్లుబాగుగనుండిన నట్లే చేయుము. అని తన చేతియందున్న గులాబిపూరేకల నొక్కొకటియే యూడఁబెఱుకుచు నేదోయాలోచించుచు మిన్నకుండెను.

నర—కన్నతల్లీ? ఇన్నిమాటలేల? నిన్ను మనప్రభాకరునకిచ్చి పెండ్లి సేయవలెననియున్నది. రూపముచేత, గుణములచేత, యౌవన సంపదచేతనన్నిఁట నీకుఁ దగినవాఁడితఁడనియే నాకుఁ దోఁచుచున్నది. అతఁడు రాచకులములోనివాఁడగునో కాఁడోయని యనేకు లనుమానించుచుండిరి. వానితలిదండ్రులెవ్వరో యెవ్వరికిం దెలియమి నట్టిసందేహమునకుఁ గారణమయ్యెను. కాని వాని ముఖవిలాసమును జూచినను, ధైర్యసాహసములఁ జూచినను వాఁడొకగొప్పయింటిబిడ్డఁడని నాకు నమ్మికగలదు. అతఁడెవ్వఁడైననేమి? సమస్తవిధముల నీకుఁదగినవరుఁడు. లోకులేమియనిననుసరే; నీవు సమ్మతింతువేని నిన్ను వానికిచ్చి పెండ్లిచేయ

వలెనని నాకోరిక. అదియే నెరవేరుట తటస్థించునేని నీవు ప్రభాకరునితో నీయూరనే సుఖముగాఁ గాపురముసేతువు. అతఁడు తననిరంతరకృషిచే నాయాస్తినిఁ బదంతలుచేసి గొప్పరాజు కావచ్చును. వాని యదృష్టమెటులున్నదో యేరికిఁ దెలియును? నందోరాజాభవిష్యతి. నీవు వానిచిన్నసంస్థానమునకు దేవేరివి కాఁగూడదా? భవిష్యచ్చింతయిప్పుడేల? నీకది యంగీకారమేనా?

అరవింద పుష్పదళముల నూడఁ బెఱుకుటసగమయ్యెను. ఆమె హృదయములో నుద్దేశములు దొంతరదొంతరలుగాఁ, బరంపరలుగా బయలువెడలుచున్నవి. ఇదివఱకామెయావిషయమై యెన్నఁడాలోచించియుండలేదు. తల్లినెఱుఁగకపోయినను బినతల్లిచే నన్నిముద్దుముచ్చటలును బొందినది. సంసారగోష్ఠి యంతగానామెకులేదు. ఇప్పుడు తనభావిచరిత్ర మెటులుండవలెనో తెలిసికొనుట కవకాశములేదు. సడివిమీఁదఁగాని యది యామెకుబోధపడదు. తండ్రికిఁ బ్రత్యుత్తరమీయవలసిన యంశము మిగులనుత్కృష్టమైనది. నిముసములో 'జవాబీ' యవలనుపడదు. ఆమెయొకపర్యాయము 'లోకములో నందఱైశ్వర్యకాములై ధనవంతులఁ బెండ్లియాడవలెననికోరుదురు. నేను నట్లుల కోరరాదు;' అనియు, మఱియొకతడవ 'సంపదతోనేమిపని? అది చంచలమైనదని పెద్దలందురు. గుణవంతునే పెండ్లియాడి సుఖింతును. ప్రభాకరుఁడు గుణవంతుఁడుగనే కాన్పించుచున్నాఁడు. అతనియందు నాకుఁ బ్రేమకలదుగాని మోహమనునది యింతవఱకుంచియెఱుఁగ. వానిధోరణిఁజూడ నాయందు వలపునిలిపినట్లుతోఁచుచున్నది.' వేఱొకతఱి 'ఈవితర్కమేల? ముక్కుపచ్చలారనిదానను నాకేమిలోకానుభవముగలదు? నాబాధ్యతయంతయు వహించిననాతండ్రికే సర్వమునువిడచిపెట్టి యతనియాజ్ఞానువర్తినినై యుండెద' ననియు, నింకొకపరి 'అ

యో! నాహృదయమందైతే సమ్మతించితినిగాని యెట్లు నాజనకునకుదా
నిని దెల్పుదును? ఇప్పు డేదోయుత్తర మొసంగవలయునే? ఎట్లు? ప్రభా
కరునిబరిణయమగుటకు నాకుఁ బరమసమ్మతమే యని నిర్భయముగా న
నఁగలనా? అనలేను. పోనీ 'సరే' యను రెండక్షరములు పలికియూర
కుందునా?' అనియుఁ బలుతెఱంగుల నాలోచించికొని తుదకు మోము
నందు లజ్జావినయభయములొప్పఁ దండ్రితో నిట్లనెను. "నాన్నగా
రూ! మీకుసమ్మతమైనది నాకును బరమసమ్మతమైనదియే. మీరు
నామేలుగోరువారగుటచే మీయానతిని శిరసావహింతును." తనమన
మునకు వచ్చినరీతినిఁ దనూజయిచ్చిన ప్రత్యుత్తరమునకు నరసింహరా
జు మిక్కిలిమోదమొంద కూమెను జేరజీరి యొక్కముద్దుపెట్టుకొని 'అ
మ్మా! నీగుణములకుఁ దగిన యదృష్టమునుబొందు' మని దీవించెను. అ
త్తఱి శోభనాద్రిరాజు దగ్గుచు నుమియుచు నొకదుప్పటమును గప్పికొని
యచ్చటకేతెంచెను. తమసంభాషణ మాతఁడు వినెనేమోయని నరసిం
హరాజునకు సందియముపుట్టెను. అరవింద తెల్లఁబోయెను. శోభ
నాద్రియు వారియవస్థ గనిపెట్టి వారిసందేహనివృత్తిఁ జేయఁదలఁచి
'అమ్మాయి! అరవిందా! నీవును మీనాన్నగారును నిచ్చటనుండిరని
యింతకుముందే తెలిసియున్న నేనును మీతోఁగలసి సుఖముగాఁ జల్లగా
లి ననుభవించుచుందునుజుమీ! మీరిక్కడ కెంతసేపై వచ్చితిరి?' అ
నియడిగెను. అరవిందయు మదకుదురుపఱచుకొని "తాతా! మేము
ఆగడియక్రింద వచ్చితిమి. నీవుకూడ నీవేదికపైఁ గూర్చుండు" మని
వానికిఁ జేయూఁతనిచ్చి యరుఁగుమీఁదఁ గూర్చుండఁబెట్టెను. అతఁడు
కోపము, విసుగు మన్నగునవి చూపక నెమ్మదిగా మృదువుగా వేడుకతో
భాషించుచుండెను.

---

# మూఁడవ ప్రకరణము.

## మణులు, మాలికలు.

శోభనాద్రిరాజున కిప్పుడు దేహస్థితి చక్కఁబడినది. రోగమాంత్యము మాసిపోయినది. వైశాఖశుద్ధపూర్ణిమనాఁడు పీఠికాపురమున శ్రీకుక్కుటేశ్వరస్వామికి 'తెప్పతెరలు' అను నుత్సవము జరగును. నరసింహరాజు ప్రతిపర్వదినమందును బంధుమిత్రాదులతోఁ బీఠికాపురమునకేగి పాదగయాక్షేత్రమునందుఁ గ్రుంకులిడి స్వామిదర్శనముంజేసి వచ్చుట వాడుక. అరవిందయు జనకునితోఁ దఱచు పోవుచుండెడిది. కాని రెండునెలలనుండి శోభనాద్రికిఁ బరిచర్యచేయుటయందే యామె కాలము వెడలఁబుచ్చుచున్నది. కుక్కుటేశ్వరసందర్శనము చేయుట కామె కవకాశము కలుగలేదు. ఇప్పుడు వానికి నెమ్మదిగానున్నది గావున నామె తండ్రితోఁ బిఠాపురము ప్రయాణమైనది. శోభనాద్రియు వారిని వెంబడించెను. పౌర్ణమినాఁడు పెందలకడలేచి నరసింహరాజు ప్రభాకరాదులతోఁ దనసొంతబండినెక్కి పయనమైపోయెను. అతని మిత్రులును దమతమ శకటములనారోహించి బయలుదేఱిరి. సూర్యోదయమగుసరికందఱుఁ బిఠాపురముచేరిరి. శ్రీరాజరాజేశ్వరీసత్రములో బసచేసిరి. అందఱును స్నానమునకుచితమగుబట్టలను గట్టి పాదగయయొద్దకుఁజని తానమాడి, గుడిలో మూఁడుప్రదక్షిణంబులును జేసి, యెక్కడెక్కడనున్న చిన్నదేవరలకు మ్రొక్కులిడి, చండీశ్వరునకుఁ దప్పట్లుగొట్టుటయుఁ దమ గోత్రనామముల నెఱిఁగించుటయు జరగించి నమస్కరించి, నందిని స్పృశించి యాతని చెవులమధ్యనుండి శివలింగముంజూచి, తలుపులకుఁ గట్టఁబడిన చిఱుగంటలను మ్రోయించుచు నోంకారధ్వనులతో

గర్భాలయముంజొచ్చి 'వందేశంభుముమాపతిమ్' మున్నగు శివస్తోత్ర శ్లోకములను బఠించుచుఁ గుక్కుటేశ్వరునకు సాష్టాంగదండప్రణామ మాచరించి, రాజరాజేశ్వరీసందర్శనముఁ జేసి 'ఓంకారపంజరసుఖీమ్' మున్నగు సంబాస్తోత్రములనుజదివి, వైష్ణవసాంప్రదాయకులైనను శివ నిరసనముంజేయక త్రిపుండ్రములు తేటతెల్లముగాఁ గాన్పింప నొసళ్ళ ను విభూతిరేఖలనుదీర్చి, తలకొకరూకయు దేవునకర్పించి, యర్చకులవల న రుద్రపాదముల శిరములందొంది, ప్రసాదచిహ్నముగా నీయఁబడిన మాతేడుదళముల నచ్చటనే దిగవిడిచి, యీవలకువచ్చి కూర్చుండిరి. అరవిందయుఁ దోఁచినది దేవునకొసంగి పార్వతీదేవికి నొకపళ్ళెరమందుఁ గుంకుమము, పసపు, పూలదండలు, చీరయునుంచి సమర్పించి, కుంకుమ ము నొసటఁబెట్టుకొని వినిర్మలబుద్ధితో దండముంబెట్టి తల్లియొద్దకువచ్చి నిలిచెను. వంటలక్క యందఱకు సత్రములోనేవండినది. పదిగంటలకు భోజనములుచేసి నగవారూరుఁజూడఁబోయిరి. అరవిందయు నొకసారి తనపినతల్లికూఁతును జూచుటకు వెడలినది. అందఱును సాయంకాలము న కిలుసేరిరి. అరవింద నేఁడు తనకున్నయాభరణములన్నియు ధరించు కొనెను. సహజలావణ్యవతియగునామె కీభూషణములు ద్విగుణమైన యందముందెచ్చినవి. ఆమె సౌందర్యమునుజూచియు భక్తినిఁ దిలకిం చియు శోభనాద్రి కడుముదమొందెను. రాత్రి భోజనములైనపిమ్మటఁ బాదగయనాఁబడు పుష్కరిణి సోపానములమీఁద నరసింహరాజు తన పరివారముతోఁ గూరుచుండెను. వారు స్వామి యెప్పుడుతెప్పనెక్కి తె రలునోయని కనిపెట్టి చూచుచుండిరి. ఆదినమున వెన్నెల పిండియారఁ బోసినట్లెంతయు మనోహరముగానుండెను. మందపవమాన సంచలిత ములగు పుష్కరిణీ నీరములయందుఁ జంద్రుఁడు తూఁగుటుయ్యెలయం దువలెఁ దోఁగాడుచుండెను. వెడకొండయందు సదా సంచరించు నా తఁడు నేఁడు నీరములోఁ దిరుగఁబోవుచున్నవాఁడోయని తెలిసికొని 'ప్ర

మథగణము లాసలిలములను రజితమయములుగాఁజేసి యుంచిరేమో యనునట్లు కోనేటినీరు తెల్లగానుండెను. నరసింహరాజు ప్రభాకరాదులతో నాక్షేత్రమాహాత్మ్యముంగూర్చి చెప్పుచుండెను. అరవిందమాత్ర మామాటలను వినక నీటిలోఁ దనకుఁ గనుపట్టిన మెఱయు చందమామను జూచుచు నేదో యాలోచించుచుండెను. ఆమె కాలోచించుట కేమి చింతలుగలవు? అలనాఁడు తండ్రికిఁ దనకును జరగిన సంభాషణమునే స్మరణకుఁ దెచ్చుకొని దీర్ఘాలోచనలో మునిఁగియుండెను. అంత వెదుళ్ళతోఁ జేయఁబడిన తెప్పమీఁదఁ బూజారులు స్వామివారిని శంఖాదినిస్వనములతో నధిష్ఠింపఁజేసిరి. కొందఱు దేవస్థానోద్యోగస్థులును, కొందఱు గాయకులును నందుఁ గూరుచుండిరి. కుక్కుటేశ్వరస్తుతిని గానముచేయుచు గాయకులు కర్ణపర్వమును జేయుచుండిరి. ప్రాకారపు గోడలకుఁ జుట్టునున్న గూళ్ళలో దీపములు వెల్గింపఁబడెను. జనములు తండోపతండములుగవచ్చి కోనేటిమెట్లపై నిలిచి కలకలధ్వనులు చేయుచుండిరి. రెండుయామముల కుత్సవము ముగిసెను. నరసింహరాజు మొదలగువారు ప్రసాదములఁ దీసికొని యచ్చోటనే తిని వెంటనే బండిని గట్టించుకొని చంద్రమపాలెము వచ్చిరి.

మఱునాఁడు ప్రభాతమున నరసింహరాజు ప్రభాకరునితోఁ బొలములోనికిఁ బోయెను. అరవింద యొక్కర్తెయుఁ జావడిమీఁది తివాసిపైఁ గూర్చుండెను. అప్పుడు శోభనాద్రిరా జొకపంతపెట్టెను జేతఁబట్టుకొని యక్కడకువచ్చెను. అరవింద నిన్నధరించిన విలువబట్టలను నగలును దీసివైచి సాధారణముగా నింటనున్నప్పు డేవస్త్రములఁగట్టుకొనునో యేభూషలుంచుకొనునో వానినే తాల్చెను. తండ్రితోఁ దన వివాహముంగూర్చి సంభాషించినది మొద లెప్పుడును యోజించుచునే యుండెను. ఇప్పుడటులే యుండెను. ఆసమయమున శోభనాద్రిరా జామె యాలోచనాప్రవాహమున కడ్డమువచ్చి యిట్లనెను.

శోభ—అరవిందా! నిన్నటిదినగలు తీసివైచితివేమి యమ్మా? నిన్న నీవు భూమిక వతరించినరతీదేవివలె నుంటివిసుమీ. నీవీపల్లెటూరికంసాలులుచేసిన భూషణములను బెట్టుకొన్నప్పుడే యింత యందముగా నుంటివి. మా నెల్లూరిస్వర్ణకారులచేఁ 'నయాగ' చేయఁబడి నయాభరణముల ధరించిన నెట్లుందువో ?

అర—తాతా! నీపొగడ్తకేమిగాని, నీవు నానగలు మంచివి కావందువా? మాయమ్మనగ లెన్నో కలవు. మాయమ్మ వానిని ధరింపనీయదు. వానినిబెట్టుకొని నే నెదుటనిలిచిన నాయనకు మాయమ్మ జ్ఞప్తికివచ్చునఁట. అవియన్నియుఁ బీఠికాపురములోను బెద్దాపురములోను బేరుఁజెందిన కంసాలులచేఁ జేయఁబడిన విసుమా.

శోభ—వానిమాటకేమిగాని, నీవు నాకెంతో శ్రమపడి యుపచారములు చేసితివి. నీఋణమును నేఁ దీర్చుకొనలేను. నీకాభరణములయం దాసక్తిగనుక కొన్ని మంచి మణిసరములు నీకిచ్చి నీకానందము గూర్చవలయునని యున్నది. ఇవె యాసరములు—

అని తనచేతియందలి పెట్టె కున్నమీటను నొక్కి తలుపు పైకెత్తెను. అరవింద యంతసొగసైన పేటికనే యెన్నఁడును జూచియెఱుఁగదు. ఆసుందనము మిగుల నున్నితమైన కఱ్ఱతోఁ జేయఁబడినది. దాని నల్లనిరంగు నిగనిగలాడుచుఁ బ్రతిబింబమును జూపుచుండెను. దానిలోనున్న మణిహారములు, రవలపుష్పములును గన్నులమిఱుమిట్లు గొలుపుచుండెను. అరవింద యాశ్చర్యముతోను, సంతోషముతోను, సంభ్రమముతోను జందుగుపెట్టె నందికొని ,, తాతా! నీవెంత వందనీయుఁడవు! నీమే లెట్లుమఱవఁగలను?" అని పలికి యాసొమ్ముల వంకఁ జూచుచుఁ దాను వానిచే నలంకృతయైనట్టులే భావించెను. ఇప్పుడామె మోమునందు సంతోషచిహ్నములు మాయమయ్యెను. పదపడి

యోచనాదృష్టి యుదయించెను. ముసలివానిపై పుతిరిగి "తాతా! నీకిన్నాళ్ళను మేమన్నముంబెట్టి కాపాడినందులకుఁ బ్రతిఫలముగా వీని నిచ్చితివా? యేమి? ఇవినాకా? మాతండ్రికా?" యని యడిగెను. "నీకే. మీరునాకుఁజేసిన యుపకృతికి నేనేమిచ్చినను నా ఋణముతీఱునా? ఇవినీవు ముద్దుగాఁబెట్టుకొందువని యిచ్చితినిగాని, మీరు నాకుఁ జేసిన దానికి బదులు చెల్లించుటకీయలేదు. నీ వట్లనఁగూడదు. నన్నవమానించినదానవగుదువు." అని శోభనాద్రి మారుపల్కెను.

అరవింద తిరిగి వస్తువులకేసిచూచుచు యోచనచేయుచుండెను. ఆమె హృదయసాగరమందు యోచనాతరంగము లొకదానివెంబడి నొకటిగావచ్చుచుండెను. ఆమె నిద్దఱుదేవతలు పిలుచుచుండిరి. ఒకతె చాపల్యదేవత. ఆదేవత 'ఇవి చక్కనినగలు. వీనినిధరించి వీనికిఁ దగినమగనివరించి సుఖముండు' మని చెప్పుచున్నది. రెండవయామె యంతరాత్మదేవత. ఆబిడ 'నీకీయవి ప్రస్తుతము తగవు. వీనిని ధరించుటతోనే నీకొకవిధమైనగర్వము వచ్చును. ప్రకృతి జనితములగు పుష్పములే నీకుఁ దగిన యలంకారములు. వీనిని నిరాకరింపుము.' అని బోధించుచుండెను. కుదురైనమనసుతో రెంటిబోధనలును విని యంతరాత్మ బోధనే యనుసరింపనిశ్చయించి "తాతా! ఇవేనీనగలు. ఇవినాకుఁ బనికిరావు. నీకు నాయందున్న వాత్సల్యమునకుఁ గడుసంతసమయ్యె. మఱియొకలాగునఁ దలఁపకుము." అని వానినిచ్చివేచెను. వృద్ధుఁడు "అమ్మాయీ! ఆవల నివి నీకుఁగావలెనననివ దొరకవుసుమీ" యనెను. ఆమె నిశ్చయబుద్ధితో 'నేనెన్నఁడుఁ గావలెననికోర' ననిచెప్పెను. శోభనాద్రి గిరుక్కున వెనుకకు మఱలిపోయెను. అతనికిఁ గోపమువచ్చెనేమోయని యరవింద భయపడెను. కాని యనల్పకాలములోనే యతఁ డామెప్రక్కనే పోవుచు సంతోషముతోనే యథాపూర్వముగా మాటలాడి యామెవెఱపును [illegible]ను.

ఒకపక్షము గడచెను. గ్రీష్మఋతువు తనప్రతాపమంతయుఁ దీవ్రముగాఁ జూపుచుండెను. మృగసందోహము మహాతాపసంతప్యామానమగుచుండెను. ఎండవేడిమిచేఁ జెట్లయాకులు వాడి వన్నెఁదక్కి యుండెను. జనులటుకులపై దాఁచియుంచికొన్న విసనికఱ్ఱలను మరలఁ బైకిఁదీసి యుపయోగించుచుండిరి. బీదలు తాటిముంజెలలోని నీరును, నించుక కలవారు కొబ్బెరనీరును, ధనికులు తీయని వడియఁగట్టఁబడిన రసాయనములును ద్రావి దప్పికను దీర్చుకొనుచుండిరి. మన నరసింహరాజువంటి ధనవంతుల యిండ్లకడఁ బ్రతిగవాక్షమునకును బ్రతిద్వారమునకును వట్టివేళ్ళతడకలు కట్టఁబడెను. స్థూలశరీరులు వెట్టకుఁ దాళఁజాలక మేనులఁ జందనము లలందికొనియుఁ బన్నీరుచల్లుకొనియుఁ బరితాప మడంచుకొనుచుండిరి. అహఃప్రమాణము ముప్పదిరెండుగడియలకుఁ బైననుండెను. ఎప్పుడు సూర్యాస్తమయమగు, నెప్పుడూరిబయటకిఁబోదు, మెప్పుడుహాయిఁజెందుదుమని యెల్లరును జండకరుని క్రుంకున కెదురుచూచుచుండిరి. జనులనోములు ఫలోన్ముఖమునకు వచ్చెను. భానుఁడ స్తమింపనై యున్నాఁడు. ప్రాణులనిట్లేఁచినయాసహస్రకరుఁడు పరశురామునిచే ఖండింపఁబడిన హస్తములతో సహజప్రతాపమునువీడి రక్తరేఖలచేనొప్పుచున్న కార్తవీర్యునివలె నుండెను. జీవులనంతగాఁగాసించినవాఁడు చిరకాలముండునా ?

భావనామయూఖములచేతను, భానుమయూఖములచేతను, బవలెల్లఁ జాల బాధింపఁబడిన మన యరవింద యా సమయమున వాహ్యాళికై పోవ యత్నించి తనగదిని విడచి పూఁదోఁటలోని కరిగి యొక పారిజాతవృక్షపు నీడను గూరుచుండెను. తండ్రితో నాఁడు మాట్లాడినది మొదలామె యిట్లు నిరంతర వితర్కాధీనచేతస్కురాలై యుండెనని పాఠకులకు విశదమే కదా. ఇప్పుడామె ప్రభాకరుని చెట్టఁబట్టనా, మాననా యని పూర్వోత్తర సందర్భముల నరయుచుఁ బూర్వప

క్షు సిద్ధాంతములచేఁ దనలోఁ దానే వాదించుకొనుచుండెను. ఆమె దా రిలో నపరిమితముగ నొక తెల్లగులాబిపువ్వును గోసి తెచ్చినది. కొంతవఱకామె తనచేతిలోఁ బూవుండుటయే యెఱుంగకుండెను. కు సుమకాండమునుబట్టుకొని త్రిప్పుచుఁ బరధ్యానముగ నుండెను. అంతఁ జూడ్కు లలరుపైఁ బడెను. తన హస్తములోనిది గులాబి పువ్వని తెలి సెను. తుదకుఁ దనలోఁదా నిట్లనుకొనుచుండెను. " అవును ప్రకృతి జనితమగు మృదుపుష్పమే నాకురు లలంకరించుటకుఁ దగును. దుర్నిరీ క్ష్య కాంతుల వెదఁజల్లు మానవకృతమణినికాయములు నా కెంత మా త్రమును దగవు—" అయ్యెడ నెవ్వరో మధురగంభీర వాక్కులతో "అరవిందా! నాకా పూవిమ్ము," అని యడిగిరి. కంఠధ్వనిఁబట్టి యామె కాని నానవాలుపట్టెను గాని యాతఁడు ప్రత్యక్షముగా నెదుటఁబడువ ఱకు నమ్మకుండెను. ఒక నిముసమున కాపురుషోత్తముఁడును బ్రత్య క్ష మయ్యెను. అతఁడు మనకును మన యరవిందకును బ్రభాకరుఁడే. అతఁ డరవిందకుఁ గనుపట్టకుండ మెల్లఁగా నచ్చటికి వచ్చి యామె ము ఖమునుండి వెలువడిన మృదుభాషణములు వినియే యట్లడిగెను. తన స్వాగతవాక్కు లతఁడు విని యుండునని యామె నిశ్చయించుకొనెను. ఆ మె కలవరపాటుఁ జెందెను. మొగమున సంభ్రమజనితరాగము చూ పట్టుచుండెను. ప్రభాకరుఁడు మరల " అరవిందా ! నాకా పూవిమ్ము. నీ నోటినుండి వెలువడిన మాటలను వినకుండినను, ఆకుసుమ మిమ్మని నిన్నడిగియే యుందును. విని, నీ హృదయ నైర్మల్యమును గని, యిం కను నూరకుందునా ? నాకా కుసుమ మిప్పుడు మునుపటికంటె వేయిమ డుఁగు లభ్యర్థనీయము. నే నీపుష్పాలంకారములతోనే తృప్తి నొందె దనని నీ బంగారునోటినుండి వచ్చిన పలుకులు విన్నతరువాత నే నిన్నా ళ్ళనుండియు వహించుచున్న యాశల నిప్పుడు దృఢపఱచుకొనుచున్నా ను. నీవాముసలివాఁ డిచ్చినరత్నాభరణములఁ బుచ్చుకొంటివేని, నే

ను సాహసించి నీకడ నింత ధైర్యముగా మాటలాడలేకుందును. " అని పలికెను—అరవింద వంచినమొగమెత్తి " ప్రభాకరా ! నాకు ముసలి వాఁడు రత్నాభరణము లీయఁబోయినట్లును నేను వాని నిరాకరించిన ట్లును నీ కెవరు చెప్పిరి ? " అని యడిగెను. ప్రభాకరుఁడు " నీజన కుఁడు. నా రక్షకుఁడు. అతఁడే చెప్పెను. ఆమహాపురుషుఁడే పుష్ప మార్దవముచేఁ, బుష్పసౌరభవముచేఁ, బుష్పరాగముచేఁ, బుష్పసంయు తమై యొప్పు నీకేలు నేనుబట్టు భాగ్యము నుందు గలుగవచ్చునని యు సూచనగా వాగ్దిచ్చె " నని మృదుమధుర వాక్కులతోఁ బల్కెను. ఇట్లు పలికి యతఁ డామెచేతిలోనున్న సుమమును బుచ్చికొనుటకు వంగి చేయి చాచెను. అరవింద వాని కరమును ద్రోచివైచి దిగ్గనలేచి కొం చెముదూరముగాఁబోయి నిలిచెను. ఆమె యటులఁద్రోయుట కోపము చేతఁగాదు. లజ్జాధిక్యముచేత. పాపము ప్రభాకరుఁ డదినిజమై నకోపమనియే భావించి దీనదృష్టిఁ గాదిరిగి " అరవిందా ! ఇయ్యావా ? అయ్యో ! వ్యర్థముగా నీమనమునకు నొప్పిగలిగించితినే ! నీతండ్రి నీచి త్తమును జక్కఁగాఁ గనిపెట్టకపోవుటచేతఁగాఁబోలు నన్నసంభవమైన యాశతోనుండుమని పలికె " ననియనెను.

అరవిందకప్పుడే పశ్చాత్తాపముదయించెను. పరిశుద్ధహృదయుఁ డగు ప్రభాకరు నకారణంబ నొవ్వనాడినందులకు ఖేదనపడఁజొచ్చెను. అన్నిఁటవిధేయతఁ జూపనిశ్చయించుకొనిన తనతండ్రి కోరికలకు విరుద్ధ ముగాఁజరించుచున్నట్లు స్పష్టముగాఁగనఁబడితినని పరితాపమొందెను. ఆమెమొగము చిన్నఁబోయెను. అంతప్రీతితో వాంఛించిన కుసుమ మును వానికర్పించి వానికనుకూలవాక్యములతోఁ బ్రత్యుత్తరమీయ సి ద్ధముగానుండెను. అత్తఱి నొకపొడుగైన యౌవనపురుషుఁ డామెలోచ న గోచరుఁడయ్యెను. అతఁడు 'చవిక్కా' వేయఁబడిన నల్ల 'ముఖుమా ల్ వరాయి ' యు నంగీయును ధరించి ధవళ ' తుర్రాయి ' గల శిరో

వేష్టమును బెట్టుకొనెను. పెద్దాపురపుగోడారివాండ్రచేఁ గుట్టఁబడిన
‘ జల్తారు ’ ముచ్చెలజోడును దొడిగెను. వానిమేను రక్తమిశ్రితమగు
పీతవర్ణముగలది. ముఖమున సన్నని నూనూఁగుమీస మొప్పలుగులుకు
చుండెను. చంద్రబింబమువలె వానిమోము సొరుమీఱియుండెను. అ
తఁ డొకవిధమైనవింతహొయలుతో నడచుచుండెను. అరవిందను
సమీపించినకొలఁది నతనికానంద మెక్కుడగుచుండెను. ఆపె సౌంద
ర్యాతిరేకముంజూచి యచ్చెరువొందెను. ఈనూత్నపురుషుఁ డెవ్వఁడై
యుండునాయని యరవింద నివ్వెఱపాటుతోఁ జూచుచు నిలిచియుండె
ను. పురుషుఁ డామెకుఁ గడుదాపుననిలిచి ‘ అరవిందా! నన్నెఱుఁగు
దువా? మఱచిపోయితివికాఁబోలు ఇం దాశ్చర్యమేమున్నది? నేను
నిన్నుఁజూచునప్పటి కాఱేండ్లదానవు. మనమిద్దఱ మాడుకొనునప్పుడు
నీవుచేయుకొంటెపను లిప్పటికిని నేను మఱచిపోలేదు. ’ అనిచెప్పి ‘ మా
మ యింటియొద్దనున్నాఁడా? ’ యని యడిగెను. ఈకడపటివాక్యమును
బట్టి యతఁడు తనమేనత్తకొడుకని గ్రహించి పరమానందముతో
‘బావా! నీవా? ఎప్పుడువచ్చితివి? ఎన్నాళ్ళకు నిన్నుఁజూడఁగల్గితిని?
ఇంతకాలమునకు మేము కనఁబడితిమా? చిరకాలమై కలసికొనిన మన
ము దేవాలయములోఁ దగిన గ్రహశాంతులు జరగించి మఱికలసికొన
వలెనేమో’ యని పలుకరించెను. అతఁడును దనకేవియో తొందరపను
లుండుటచేతను, జనకుడు గతించినవెనుక సంసారబాధ్యతయంతయుఁ
దనమీఁదనే పడుటచేతను రా ననువుపడినదికాదని చెప్పి మరల ‘ మా
మయెక్కడ ’ నని యడిగెను ఎన్నఁడోచూచిన సమీపబాంధవునిఁ జూ
చినవేడ్కచే నరవింద ప్రభాకరునిమాటయే మఱచిపోయెను. గులాబి
పు వ్వొదంత యదియే యామెహస్తమునుండి నేలవ్రాలెను. ఆమె చిన్న
వెంకటపతిరాజును దొడ్కొని లోనికరిగెను. సోదరీపుత్రుఁడు వచ్చెనని
విని యప్పుడే పొలమునుండివచ్చిన నరసింహరాజు వానిని సాదరముగా.

గాఁగిలించుకొనెను. తనసోదరిమగఁడుచనిపోయినతరువాత మేనల్లునిదే ప్రిథమపర్యాయము చూచుటచేత నరసింహరాజునకు దుఃఖమాగక యుంచుక కంటఁదడిపెట్టి వానిని కుశలవార్తయడిగి, యిష్టగోష్టినిఁ గొంతతడవు మాటలాడెను. అచ్చటఁ బ్రిభాకరుఁడు నిరాశతో వెనుక కుమరలెను. మార్గమునం దరవింద జాఱవిడిచిన లతాంతమును దీసి పదిలపఱిచికొనెను. అట్టియాశాభంగముగల వాఁ డెట్టిసాహసకార్యమున కొడిగట్టునోకదా!



## నాల్గవప్రికరణము.

### వెంకటపతిరాజు.

వెంకటపతిరాజు చంద్రిమపాలెమును విడిచిపెట్టి యెనిమిదేండ్లయినది. అతఁడప్పుడిప్పటికంటె సుందరముగను సౌమ్యముగనునుండెడివాఁడు. ఎప్పుడు నల్లరిచేసియెఱుఁగఁడు. చదువులోఁగూడ మిక్కిలిచురుకుగానుండెడివాఁడు. ముందెంతో నెమ్మదియైనవాఁడగుననియు, విశేషనీతిమంతుఁడగుననియు నరసింహరాజుమొదలగువారు వానినిజూచి సంతోషించుచుండెడివారు. కాని యీయెనిమిదేండ్లలో వాని వైఖరియంతయు మారిపోయినది. యుక్తవయస్సు రాకమునుపే తండ్రి గతించుటచేతను, విస్తారధనసంచయము చేతఁబడుటచేతను, వాఁడు తప్పుదారినిఁబడి చరించుట లటస్థించెను. బాల్యము వెదురువంటిది. దానిని సకాలములోనె యొంపవలెను. అప్పుడది మహారాజులు సయితము శిరసావహింపఁదగినదగును. లేనిచో దొమ్మరివాండ్రిపాదహాతి కర్హమైనదగును. అంతసౌమ్యస్వభావుఁడగు చిన్నవెంకటపతిరాజు చిన్నతనములోనే తగినశిక్షను బొందియుండెనేనియెట్టిపూజనకైన నర్హుఁడగునుగదా. వాఁడు తండ్రిపోయినది

మొదలు దుస్సహవాసములుచేసి తండ్రితాతలనుండియుఁ గాపురస్థలమై
న పెద్దాపురమును విడిచిపెట్టి విశాఖపట్టణములో నివసింపమొదలిడెను. అ
ది గొప్పపట్టణమగుటచేతను, నాగరకతబలిసినఘను లనేకు లందుండుట
చేతను, వానికి సర్వవిధముల నివాసయోగ్యముగానుండెను. అతఁ డం
దలి ఘనులసంఘములో ఘనుఁడుగను, తుంటరిజట్టులోఁ దుంటరిగను నుం
డెను. నగరవాస్తవ్యుఁడగుటచే వానిబట్టకట్టు జుట్టు బొట్టు మఱియొకవిధ
ముగానుండెను. మాటపొంకమియును వేఱుగనుండెను. పల్లెటూరివాం
డ్రవలె మర్మము విడిచి కఱ్ఱపెట్టుగమాట్లాడఁడు. వాఁడు సమయానుకూ
లముగ, నెదిరికింపగునట్లుగ భాషించుచుండును. తనవచోచమత్కృతిచే
నెట్టివారినైన లోపఱచుకొనఁగలఁడు. పైకిఁబుణ్యకార్యములవలెఁ గా
న్పించు నాగరకులదుష్కృత్యములన్నియు వానికిఁ గరతలామలకములు.
జనకునివలనఁ బడసినయాస్తి యెంతవఱకింకను వానియొద్ద మిగిలియుం
డెనో మనకుఁదెలియదు. వానిదుష్ప్రవర్తనము కొంతవఱకునరసింహరా
జునకును దెలిసి రెండుమూఁడుసారులు వానిపేర బుద్ధిగలిగియుండుమని
యుఁ దండ్రిపేరు నిలువఁబెట్టుమనియు బతిమాలుచు జాబువ్రాసెను.
ఒకదానికిమాత్రము 'టూకి' గ రెండువాక్యములతోఁ బ్రత్యుత్తర
మిచ్చెను. కాని నరసింహరాజునకు వానినిజమైననడత యింకను బూర్ణ
ముగఁ దెలియలేదు.

నరసింహరాజమాయకుఁడు. నాగరకతయంతగా లేనివాఁడు.
తన మేనల్లునిరాక విని మహానందమగ్నుఁడై వానిని వెంటనే చూచు
వేడ్కతోఁ బొలమునుండి తత్క్షణ మింటికివచ్చెను. అతఁడు వానినెంత
ప్రేమతో నాలింగనముం జేసికొనెనో మనమెఱుఁగియేయున్నాము. వెం
కటపతిరాజు విశాఖపురమునుండి సవారిమీఁదవచ్చెను. అతఁడు చిరకా
లమిచ్చటనుండు నుద్దేశముతో వచ్చియుండినట్లు కాన్పింపదు. అతఁడు
తెచ్చికొనిన దొక [illegible] బట్టలపెట్టెమాత్రమే. నరసింహరాజు జరపింప

తో మంచికూరలు వడ్డింపుమనియుఁ గొట్లలోఁ బండవేయఁబడిన మా మిడిపండ్లలో మేలిజాతిపండ్లను మేనల్లునికొఱకుఁ దీయింపుమనియు నా జ్ఞాపించెను. తానును వానితో “నాయనా! నీకుఁ బెందలకడ భుజించు నలవాటుకలదు కాఁబోలు. భోజనమునకు లె”మ్మని చెప్పెను. అతఁడు తన కు మేనమామలతోను మఱఁదలితోను భాషించుటకంటె భోజన మెక్కు డు ప్రీతియైనది కాదనియుఁ బొద్దుపోయిన నిబ్బంది లేదనియుఁ జెప్పెను. వానియిష్టమును నెఱవేర్పనిచ్చగించి నరసింహరాజు సేవకుని బిలిచి దక్షిణపువసారా దగ్గఱనున్న మల్లెపందిరికడఁ గుర్చీలు వేయుమని యానతిచ్చెను. వాఁడట్లు చేసెను. అందఱును వానియం దాసీనులై యుండిరి. అప్పుడు వారిట్లు సంభాషించుకొనిరి.

నర—నాయనా! నిన్నెన్నాళ్ళకుఁ జూచితినిరా! నాకళ్ళు కాయలుకాచినవిరా! అయితే బాబూ! నీపరివర్తనముంగూర్చి యనేకదుర్వార్తలుపుట్టెను. అవెంతవఱకు సత్యము? లోకులు కాకులు. నీయుచ్ఛస్థితినిఁజూచి కిట్టక యట్టివార్తలు పుట్టించియుందురనుకొందును.

వెంక—మామా! నిజము. నిజము. ఆవార్తలన్నియుఁ గల్పనలే. విశాఖపుర మట్టిమాటలకుఁ బుట్టినిల్లు.

నర—నే నట్లే యనుకొంటిని. ఈమధ్య విజయనగరము వెళ్ళినావా? నీపెద్దతల్లుల కూఁతుల క్షేమమునుగుఱించి యేమైనఁ దెలిసెనా?

వెంక—వారినిఁ దఱుచుగాఁ గలిసికొనుచుందును. వారందఱు సుఖులే. కాని కృష్ణమరాజు నారాయణరాజుగారు లీపురును రాబడిని మించిన వ్యయము చేయుచుందురు. వారెల్లవేళల నప్పుచేయుటకొఱకే తిరుగుచుందురు. వానిని మరలఁ దీర్పయత్నింపరుగద్దా. అందుచేత నాకు వారినిఁజూచినఁ గిట్టదు. నేను గొన్నాళ్ళు చిన్నతనముచేఁ గొన్నియనవసరవ్యయము లేమిచేసితినో కాని

యిప్పు డెంతక్లుప్తముగా వాదుకొనుచున్నాననుకొన్నావు? నా కుం బూర్ణమైనమార్పు గల్గినది. సంసారము నెత్తిమీందంబడిన పిమ్మట నన్నియు నాంటును.

నర—నాయనా! ఆయిల్లాలుకడుపునం గాచినకాయవని నలుగురు చెప్పుకొనునట్లుగా వర్తింపుము. నీవు వివాహమాడి యొకయింటివాండవైన నాకుం గనుసంతసముగా నుండును. నీవు సద్భార్యను బెండ్లియాడితివేని నీప్రవర్తనము మఱియు బాగుపడును. అజ్ఞానమనియెడు గాఢాంధకారమువాప సద్భార్యయేసుమీ చంద్రబింబము. అతిమోహమను నటవినింగాల్ప సత్కళత్రమేసుమీ దావవహ్ని. పాపములను పర్వతములను జెక్కు జాయామణియేసుమీ వజ్రాయుధంబు. సంసారదుఃఖమనుకరి నొంప సత్సతియేసుమీ యంకుశంబు. కావున సుగుణవతంసయగు నొకకన్యారత్నమును బరిణయంబై దేశసేవ కుపకరించుసత్పుత్రులంగని పితృదేవతలం దరింపంజేయుముతండ్రీ.

వెంక—మామా! నీయాజ్ఞను శిరసావహించి యటులే చేసెదను.

నర—ఓరీ! అబ్బాయి! పదునెన్మిదిమాసములక్రింద నీ వొకసంసారిదానిని లేవనెత్తుకొని పోయితివని యొకవదంతి పుట్టంగా నందలిసత్య మెఱుంగంగోరి నీకేరం గమ్మ వ్రాసితినిగదా. అప్పుడు నీవువ్రాసిన—

వెంక—అవన్నియుం గిట్టనివారలు పుట్టించినమాటలని నీకేర వ్రాసియేయుంటినే— అని యరవిందవంకకుం జూచుచు నీమాటలు విని యామె తన్నుంగూర్చి యేమియనుకొనునో యని కలంతనొందుచుండెను. ఆమెయు నామాటలు తాను వినంబడగినవికావని పెడమొగము పెట్టి కూర్చుండెను.

నర—సరే. సరే. అవన్నియు నబద్ధములని తెలిసి మిగుల నానందము

బొందితి. వానిని మఱచిపొమ్ము. (అని సంభాషణము మార్పఁ
దలంచి) మాయరవింద నిన్నుఁ జూచినతోడనే యానవాలు
పట్టినదా? నీవామెనుగుర్తుపట్టితివా? నీవుచూచునప్పటికి నిప్పటికి
నామెయందు దేహభేదమున్నదిసుమా.

వెంక — నేను మిమ్ముఁదలను దూరమునుండిచూచి యెవర్తో యనుకొంటి
ని. కాని యాపెతప్ప నింక స్త్రీలెవ్వరు మీయింటనుండరని
యెఱింగి యామెయే యరవిందయని నిశ్చయించితిని. ఆమెమా
త్రము సన్నానవాలుపట్టలేదు. మనయరవిందయంతటిసుంద
రాంగి మనరాచకోలములో లేదుసుమీ మామా!

నర — ఏమో! వెఱ్ఱిపిల్ల. బ్రతికి బట్టఁగట్టవలెనుగదా! మీతో నాడు
కొనుచుండెడు ప్రభాకరుఁడును రూపమందు మార్పొందినాఁ
డుసుమా.

అరవింద చుట్టమునుఁజూచిన వేడుకచేఁ బ్రభాకరుని విస్మరించె
ను. నరసింహారా జతనిపేరుఁ దలపెట్టుటచేఁ బదపడి యరవింద వానిని
జ్ఞప్తికిఁదెచ్చికొని "అయ్యో! ప్రభాకరా!" యని మెల్లగాఁ దన
లోఁ దాననుకొని యాచెట్టునీడ వానినొంటిగానుంచి యూరక వానికా
శాభంగముఁ గావించితినని విచారించెను.

వెంక — అరవిందా! ఆవృక్షచ్ఛాయ నీతోభాషించుచున్నయాతఁ
డెవఁడు?

అర — అతఁడే ప్రభాకరుఁడు — అని చెప్పి మరలవివర్ణవదనయయ్యెను.
తాను లజ్జాయుత్తయై పువ్వునుకూర్చి ప్రభాకరునితో నాడిననుడు లీతఁడు
వినెనేమోయని యనుమానించెను.

నర — ఇదుగో శోభనాద్రిరాజు వచ్చుచున్నవాఁడు.

వెంక — ఆశోభనాద్రిరా జెవ్వఁడు? — అని యడిగెను. అప్పుడు నల్లని
యున్నిదుప్పటమును గప్పికొని తెల్లనిగడ్డము పొడిదగ్గువచ్చినప్పుడెల్ల

నల్లలనాడఁ గుడికేలఁ దాల్చినకఱ్ఱ నూనికొని మెల్లఁగా వసారామె ట్లను దిగుచున్న మనముసలియాతఁడు వానికిఁగన్పట్టెను.

నర — అతఁ డొకయతిథి. రెండునెలలక్రింద మనయరవిందకుఁ బిఠాపుర మునుండి వచ్చుదారిలో వ్యాధిపీడితుఁడై యితఁడు కాన్పించె ను. అది యాలెని మనయింటికిఁ గొనితెచ్చి యాదరించెను. అ ప్పటినుండియు నతఁడు మనగృహమందేయున్నాఁడు. ఇతనిప్రవ ర్తనము, బహువిచిత్రముగానుండును. ఒకప్పుడు ధుమధుమ లాడుచుండును. మఱియొకసమయమున వికసించినమొగముతోఁ జక్కగా మాటలాడుచుండును. అతఁడెట్లున్నను నాకాతని యందుఁ బ్రేమమునిలిచినది. అందునకు నేను గారణముఁ జెప్ప లేను. నేనును మాయమ్మాయియు నానినడత కలవడితిమి. అ తఁడు మ కేమియు భారముగాఁ దోఁచుటలేదు.

ఈభాషణములు ముగియునప్పటికి శోభనాద్రిరాజు మెట్లుదిగి వారిసమీపమునకువచ్చెను. వచ్చి నుదుటికిఁ జేయడ్డముగా నుంచుకొని మనవాగరకాగ్రేసరునివంకఁ దేఱిపాఱఁ జూచి “నరసింహరాజుగారూ! ఈయాగామపురుషుఁ డెవ్వఁడు ?” అని ప్రశ్నించెను. ‘నామేనల్లుఁ’డ ని యతఁడు మార్వలికెను. వెంకటపతిరాజు చంద్రముపాలెము వచ్చుట మేనమామను జూచుటకుఁ గాదు. అరవింద సౌందర్యముంగూర్చి కర్ణా కర్ణి విని యామెహృదయమును దన వాక్చాతుర్యముచే నాకర్షించుకొన వలెనని వచ్చెను. తనమేనమామ తఱచు పొలమునకే పోవుచుండునని యుఁ, బ్రభాకరుఁడు లోకువవాఁ డగుటచే నెట్లుచెప్పిన నట్లు వినునని యు, నింట నామె యొంటిగానున్నప్పుడు నాలుగు డంబములు గొట్టి యామెను దనవలలో వేసికొనవచ్చుననియు నతఁ డూహించెను. కాని యీ వృద్ధపిశాచమును వదల్చుకొను టెట్లని తలపోయుచుండెను. వాఁ లలోడు తంత్రము నారితేఱినవాఁ డగుటచే మనోవికారఁ మేమియు

పైకిఁ గానరానీయక నరసింహరాజునకును నరవిందకును గఠినముగాఁ దోఁపనీక. “తాతగారూ! నమస్కృతులు. నేను మీకుఁ గ్రొత్తవాఁడను. ఐనను మీరు విద్యావయోవృద్ధు లగుటచే నిదే యభివాద మొనరించుచున్నవాఁడ. నా ప్రక్కనున్న పడకకురిచీమీఁదఁ గూర్చుండుఁడు.” అని సరసముగాఁ బలుకరించెను. ముసలివాఁడును మొదట వాని ముఖమండలి వికృతియుఁ దర్వాత నందలి మార్పును గనిపెట్టి పైకి ‘ఈప్సితార్థసిద్ధిరస్తు’ ని దీవించెను. అరవింద భావవినయసంపత్తికిఁ గడుసంతస మందెను. రెండుగడియల రాత్రియైన పిమ్మట నందఱును భోజనములకు లేచిరి. అప్పుడే ప్రభాకరుఁడును వారికిఁ జావడిలో నెదురుపడెను. వానికిఁ దిండిమీఁద దృష్టియే లేదు. ఒక పొదచాటునో, యొక గదిలోనో యొంటిగాఁ గూరుచుండి తనహృదయ గతాభిప్రాయములను దలపోసికొనవలెనని వాని కాసక్తి గలదు. కాని యొకబందుగుఁడు తన యజమానునియింటికి వచ్చినప్పుడు తటస్థుఁడై యుంట మంచిదికాదని యెంచి తనకుఁ గలదుస్తులలో మంచివానిని ధరించి వెంకటపతిరాజును సమీపించెను. తనముఖమం దింతవఱకుఁ బొడఁగట్టుచున్న దీనభావమును గష్టముమీఁద డాఁగురించుకొనెను. కాని మనఃక్లేశమునకుఁ గారకురాలైన యరవింద తనలజ్జాకోపములను వీడి మోమునందుఁ గృపారసమొప్ప వానిని బల్కరించెను. ప్రభాకరునిమొగ మింతయ్యెను. మరల వాని హృత్క్షేత్రమునందు నాశాంకూరములు క్రొత్తగా మొలచెను. నరసింహరాజు మేనల్లునివంకఁ దిరిగి ‘ కుఱ్ఱా! వీఁడె నీచిన్ననాఁటినేస్తకాఁడు ప్రభాకరుఁడు.’ అని ప్రభాకరుని ముందునకుఁ ద్రోసెను. వెంకటపతిరాజును “ ఓహో! ప్రభాకరుఁడా? ” అని మాత్రము మందహాసముతోఁ బలికి యింపుక తలయూఁచి ముందున కడుగిడి ‘ అరవిందా! నే నీదుస్తుల నెచ్చట నుంచుకొందును. సేవకుఁడు నా పెట్టె మామగదిలోఁ బెట్టినాఁడఁట. అక్కడను నన్నుఁ గొంపోవుము.

అని యామెను దీసికొనిపోయెను. వాని కపటవర్తనమును నరవిందయొక్క యమాయకత్వమును జూచి ప్రభాకరుఁడు వగచెను. అంతటను భోజనశాలలోఁ గలసికొనిరి. మగవారు నల్వు రొకపంక్తిలోను వారి కెదురుగ నరవిందయుఁ గూరుచుండిరి. శోభనాద్రిరాజునందుఁ దన భామయు నరవిందయు నాదరముం జూపుచుండిరి గావున వాని కింపగు సంభాషణముం జేసిన బాగని వెంకటపతిరాజు ముసలివాని కిష్టమగురీతినే సంభాషించుచు నందఱకు నవ్వు పుట్టించుచుండెను. అరవింద వాని వాక్ప్రౌఢిమ మెచ్చుచుండెను. వాఁ డెంత చక్కఁగా మాటలాడుచున్నను బ్రభాకరునియం దాదరము చూపకపోవుటచే నరవింద యించుక మొగము ముడిచికొనుచుండెను. భోజనాత్పరమం దందఱు నించుక సేపు నడయాడి తమతమ శయ్యలను జేరిరి. నరసింహరాజు కూఁతును బిలిచి "మన వెంకటపతి మంచివాఁడుగనే యున్నాఁడు. కాని గర్విష్ఠి లాగునఁ గాన్పించుచున్నాఁడు. ప్రభాకరునితో సంభాషించుట వాని ఘనతకు లోపము తెచ్చుకొనుట యని వాఁడు భావించుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది." అని పలికెను. "నాకు నటులే తోఁచుచున్నద" ని యరవింద యనెను. శోభనాద్రి యందఱి ముఖవిలాసములం బాగుగాఁ దిలకించుచు వాని ప్రవర్తనలం గనిపెట్టుచుండెను. అందఱును నిద్రించిరి. అరవిందమాత్రము మనసులో నెన్నియో కలఁతలను బెట్టుకొని చాలరాత్రివఱకుఁ గన్నులు తెఱచికొనియే యుండెను. వెంకటపతిరాజు వచ్చినతరువాతఁ బ్రథమదిన మిట్లు గడచెను. ముం దెట్టివింతలు పుట్టనున్నవో.

## ఐదవ ప్రకరణము.

### కాండ్రేగులకోట.

నరసింహరాజుయొక్క బంధుజనాదరణ మెట్లున్నదో యిదివరలోఁ దెలుపఁబడియే యుండెనుగదా. వెంకటపతిరాజు చెప్పిన మాటలనుబట్టి తన మేనకోడండ్రు నలువురును మంచిస్థితిలో లేరని తెలిసికొనినరసింహరాజు మిగుల విచారించుచుండెను. ఇదివఱకుఁ దాను వారినిఁగూర్చి కర్ణాకర్ణి విన్నవార్తలు నిజముగాఁ దోఁచెను. "రాచపిల్లలు. గొప్పగా బ్రతికినవారు. అట్టి కన్యలకుఁ బెండ్లి యెట్లగును? అనుకూలసంబంధములు కుదురునా? ఆవిషయమున మన మేమైన వారికి సాయము చేయఁగలమా?" యని యతఁడు తలపోయుచుండెను. మఱునాఁ డుదయమున నరసింహరాజు చింతలో మునిఁగియుండ వెంకటపతిరాజు కాల్యంబులందీర్చి మామను సమీపించి 'మామా! ఏమి యట్లాలోచించుచున్నావు?' అని యడిగెను. 'ఓరీ! అబ్బాయి! నీ సోదరీమణులగతి యేమగునో, వారికనుకూలవరులు లభింతురా? తండ్రులు దేహములెఱుఁగక సౌఖ్యమ్ము వమ్ముచేయుచున్నారే యని విచారించుచున్నానురా' యని బదులుచెప్పెను. పాఠకుల కానల్వురు కన్నెలఁ గూర్చి త్వరలోఁ దెలుపఁ బోవుచున్నాము. తరువాత నరసింహరా జాప్రసంగముమాని తన స్థితిగతుల గుఱించియుఁ దాను బ్రభాకరున కరవింద నిచ్చి పెండ్లిచేయ నిశ్చయించియుంటయు మాయయు మర్మమును లేకుండ మేనల్లునితోఁ జెప్పెను. వెంకటపతిరాజు మంచి గుణమువాఁడు. మామ యరవిందను బ్రభాకరున కీయ స్థిరపఱచినాఁడని తెలిసినప్పుడు హృదయమునం దుద్భవించిన కలవరమును బైకిఁ జూపట్టనీయ

కుండెను. ఎట్లైన హానియిష్టమును సంపాదించుటే యుత్తమమని యెంచి తానుగూడ నా కార్యమునకు సమ్మతిం దెల్పెను. వారు మరల నిట్లు సంభాషించిరి.

వెంక—'అయితే' మామా! పెద్దమామ యోడమీఁదఁ బయనమైపో యినపిమ్మట నేవార్తయుఁ దెలియలేదుకదా, యతఁడు మృతి నొందినమాట సత్యమని మీ రెట్లు నమ్మితిరి ?

నర—మాయన్న యోడతోఁ గొన్ని యోడలు బయలుదేఱినవి. వానిలోఁ గొన్ని కష్టముమీఁదఁ దప్పించుకొని వెనుకకు మరలి రాఁగల్గినవి. అందలిజనులు మాయన్ననౌక మునిఁగిపోవుచుండఁ గండ్లారఁ జూచితిమనియు నొక్కఁడైన బ్రాణమును దక్కించుకొనలేకపోయెననియుఁ జెప్పిరి. ఆవార్త నిక్కమనియే నేనును మా యయ్యగారును నమ్మితిమి. పోని. అనుదు లసత్యము లనుకొందము ఇంతకాల మయ్యెఁగదా యొక్క కుశల వార్తయైన వినంబడినదా ? ఏమియును సందియము లేదు. అతఁడు మమ్మును విడిచి వెడలిననాఁడే మాకును నతనికిని ఋణముచెల్లినది—అని మోమునం దించుక దీనత్వముఁదోపఁ బలికి యూరకుండెను.

వెంక—అలాగునా ? 'అయితే' నావదంతి యేమి ? ఆశ్చర్యముగానున్నదే ! —అని తనలోఁ దాను గొణగుకొనెను.

నర—ఏమనుచున్నావు ?—అని వానిమాటలు స్పష్టముగా వినఁబడ నందునఁ బృచ్ఛఁ జేసెను.

వెంక—విశేష మేమియును లేదు. ఏదో యాలోచించుచు నాలో నేననుకొంటిని. ఏమంటినో నాకే యెఱుక లేదు. దాని కేమిగాని, నీవు మఱఁదలి వివాహమునుగూర్చి యింతదనుకఁ జెప్పుచుంటివే, అది ప్రభాకరునియందు వలపు నిలిపినదా ? నీవెంత పల్లె

ట్టూరి రాజువైనను గూఁతుపెండ్లివిషయమై పట్టణవాస్తవ్యు
లకంటె ఘనతరమైన కోర్కెలు గల్గియుంటివి.

నర — నిజమే. అనేకులవలె బిడ్డసౌఖ్యమును జూడకుండ ధనమే పావన
ముగాఁ జూచుకొనువాఁడను గాను. ఇఁకఁ బ్రభాకరునియందు
వలపు నిలుపుటకు దాని మనోగతాభిప్రాయము లెటులున్నను
నామాటకుమాత్ర మెదురాడదు. నాసంకల్పము తన సౌఖ్యా
న్వేషణముకొఱకేయని యది బాగుగ నెఱుఁగును. నాకున్న
యైశ్వర్యముకంటెను దానివిధేయతను జూచి నేను గర్వపడుచుం
దును. దాని గుణోన్నతినిఁ బ్రకటింపఁదగినవిషయ మొక్కటి
యీమధ్య జరగినది చెప్పెదను వినుము. ఆశోభనాద్రిరాజుని
గూర్చి నీ వంతయు వినియేయున్నావుకదా. అతఁడు విపరీతస్వ
భావుఁడు. ఒకప్పుడు కలసిమెలసి యుండును. ఒకప్పు డింకొక
చందమున నుండు.

వెంక — అతనితో నిన్న సాయంతనము సంభాషించితి. మంచివాఁడుగ
నే తోఁచుచున్నది. అతనివిషయములో నేమైనఁ జేసినదా?

నర — అతఁడురుగ్ణుఁడై యున్నపుడు సర్వోపచారములఁ జేసినది. ఒకదినము
న నాతఁడు దానిబుద్ధికిసంతోషించి కన్నులుమిఱుమిట్లుగొలుపు తే
జముగల యాభరణములఁ గొన్నిఁటిఁ దెచ్చి దానికి బహుమాన
మీయఁబోయెను. అప్పుడది యేమిచేసిన దనుకొంటివి? అత
నికిఁ గృతజ్ఞతాసూచక వందనము లర్పించి రత్నాభరణముల
నిరాకరించినది. చూచితివా దాని సత్స్వభావము?

వెం — ఆలాగునా? ఆమెవర్తనము శ్లాఘనీయమే. కాని నీవు శోభనా
ద్రి రత్నాభరణము లీయఁబోయెనంటివి. అతఁడు కడు బీదవాఁ
డుగఁ గానుపించుచుండెనే, వాని కట్టిరతనము లెట్లు లభించిన

వి? అతఁడెవ్వఁడో గతిలేనివాఁడు. నీవు వానిని జేరదీసి కాపా
డుచుంటివి యనుకొంటిని. కాని—

నర—అతఁడు పేదవాఁడే. 'ఈ బీదతనముతోనే శేషకాలము ముగి
యునేమో' యని పెక్కుసారులు మన యరవిందతో నతఁడ
న్నాఁడఁట. వెనుకఁ గొన్నాళ్ళమాత్రమతఁడు మంచిస్థితిలో
నుండెడువాఁడఁట. ఈ భూషణము లప్పటివేమో! అదియెట్లు
సాధ్యమగును? ఇంత దారిద్ర్య మనుభవించుచుండి వానినేల
విక్రయించుకొనకుండును? నాకును వాని కానగ నెట్లు సమకూ
డినవో తెలియకున్నది.

వెంక—వింతగానున్నది—అని మెల్లఁగ ననుచుఁ దలపంకించి యుంకిం
చి యేదో యోచించుచుఁ గొంతవడి మిన్నకుండెను.

నర—సరేకాని నీవు శ్రీభాకరునితో నేమైన ముచ్చటించితివా?

వెంక—(విననివాఁడువోలె) ఈ శోభనాద్రి యెవఁడు?

నర—వానినిగూర్చి యిదివఱకు నీకుఁ దెల్పియే యుంటిఁగదా. అంత
కంటె నాకును దెలియదు. వాఁడొకవారముదినములలో వెడ
లిపోవును. అతనిని మరలఁ జూతు మనుకొనను. అతఁడెక్కడ
కుఁబోవునో యేమిచేయునో నే నెఱుఁగను. బహుకష్టము లనుభ
వించినవానివలెఁ గనుపట్టుచున్నాఁడు. నాకు వానిఁ జూచిన జా
లిగల్గును.

వెంక—అతఁడు వారముదినములలో వెడలిపోవునా?—అని యచ్చెరు
వుతో నడిగి క్రమ్మఱ యోచనాపయోనిధి నిమగ్నుఁడయ్యెను.

అప్పు డరవిందవచ్చి భోజనములకు లేవవచ్చుననియు సర్వమా
యిత్తము కావింపఁబడెననియుఁ గలకంఠనిస్వనముతోఁ జెప్పెను. వారు
సంభాషణమును ముగించి లోపలికిఁ జనిరి. భుజించుతఱి వెంకటపతిరా
జు వేడుకపలుకులు ; ఱ ంచు శోభనాద్రియందు మనుసటివలె నిరాడ

రభావముతో నుండక యెక్కువప్రేమనుజూపుచుఁ, బ్రభాకరునెడల నెప్పటియ ట్లలక్ష్యభావముం దెల్పుచు నుండెను. భోజనము లైనపిమ్మట నరసింహరాజు ప్రభాకరునితోఁ బొలమునకుఁ బోయెను. అరవింద యింటిపనులలో నేదియో చక్కఁబెట్టుట కేగెను. వెంకటపతిరాజుమాత్రము శోభనాద్రితో మిగిలి యుండెను.

వెంక — తాతగారూ! మనమిద్దఱమును పీఠికాపురము పోయివత్తము వచ్చెదరా ? ఆయూరిని జూడవలెనని యున్నది. మీ కోపిక యున్న నడచిరండు. లేనిచో బండినెక్కి పోవుదము రండు.

శోభ — పీఠికాపురమున కేమిగాని నే నొకచోటునకుఁ బోవలెననియున్నది. నీవును వచ్చెదవా? మంచివింతలు చూపించెదను. ఆస్థలమిచ్చటికి రెం డామడలదూరమున నున్నది. ఇదివఱకు నేను బ్రభాకరుని సాయముగాఁ దీసికొని పోవలెనని యత్నించుచున్నాను.

వెంక — తాతా ! నేనుండఁ బ్రభాకరుఁ డెందులకు ? మన మిరువురము బోదము రండు. మీ కేమియు నాయాసము కలుగకుండ మిమ్ము నేను గొంపోయెదను.

అంతవా రుభయులును బ్రయాణసన్నాహముం జేసికొనిరి. వాకిట బండివచ్చి నియమితకాలమునకు నిలిచెను. వారు కార్యాంతరముమీఁదఁ బొరుగూరికిఁ బోవుచున్నామనియు, మఱునాఁడు సాయంకాలమునఁ దిరిగివచ్చెదమనియు నరవిందతోఁ జెప్పి బయలుదేఱిరి. అప్పటికి రెండుయామములపై బ్రొద్దెక్కినది. ఐన నానాఁ డెండ యంతతీవ్రముగా లేదు. కొంచెము మబ్బుపట్టుటచేఁ జల్లగా నుండెను. వారికి మార్గాయాస మేమియుఁదోఁచలేదు. మూఁడుజాములకుఁ గాకినాడఁ జేరిరి. వా రందలిదచ్చివారిభవనములు, తుల్యానది సముద్రమునుగలయు స్థలము మున్నగువానిని జూచుచుఁ గొంతతడ వాగి వెంటనే పయనమై

సూర్యాస్తమయమునకుఁ గాండ్రేగులగ్రామమును జేరిరి. వెంకటపతి ముసలిమూతఁ డెక్కడకుఁ దన్నుఁ దీసికొనిపోవుచున్నాఁడో యెఱుఁగఁడు. కాకినాడను జేరినపిమ్మట గమ్యస్థానమును దెలిసికొనెను. వారు కలసిపోవుచుఁ గాండ్రేగుల యఱకోసుమారమునసుండ రాజగ్రామాముం దొకవంతెనయు దానియడుగునఁ బాఱుచున్న యేఱును వారికిఁ బొడఁగట్టెను. వృద్ధుఁ డచ్చట శకటము నవరోహించి యిట్లులనియె. "అబ్బాయి! చూచితివా! ఈ యే ఱెంతియందముగా నున్నదో! ఉదక మెంతవినిర్మలమైయున్నదో? అవె బాఁతు లెట్లీఁదులాడుచున్నవో చూడుము. నిదానమైన బుద్ధితో నీప్రవాహముం దిలకించితివేని భగవన్మహిమ తేటపడఁగలదు. అల్లదిగో! దవ్వున శిఖరములు గనుపించుచున్నవే. అవే కాండ్రేగులదుర్గశిఖరములు."

వెంక—తాతా! నీకుఁ గాండ్రేగులరాజుగారితోఁ బరిచయముగలదా?

శోభ—నిన్నెంత యెఱుఁగుదునో యారాజుగారి నంతియే యెఱుఁగుదును. నీతో నిన్నటినుండియే పరిచయము కల్గినది. వారినిఁగూర్చియు నిన్నసాయంతనమే మీమామవలన వింటిని. ఆతేనిగుఱించి నీవేమియు వినలేదా? అతఁడప్పులలో మునిఁగియుండి తేల లేక తనరాజ్యము నమ్మఁజూపెను. ఈప్రాంతపుఁ గోటలలో నీతనికోట మేటియనవచ్చును. అం దిందిరమందిరము నాఁబడు సౌధ మున్నది? దాని సౌందర్యమును జూచియే తీఱవలయును.

వెంక—అవియేమియు నాకెఱుక లేదు. ఏనాఁ డావైపునకుఁ బోయితినో నాకే జ్ఞప్తి లేదు. వెంకటపతి యెన్నఁడీవైపునకు రాలేదు. డంబములు గొట్టుచున్నాఁడు.

శోభ—నా కాయిందిరమందిరమును జూడవలెనని యెంతకాలమునుండియో కోర్కిగలదు. అది యమ్ముడుకాకమునుపే మనము దానిని జూచుట మంచిదని భావించి నిన్నుఁ దీసికొనివచ్చితిని.

అంత వారు మరల శకటమారోహించిచనిరి. అనతికాలములో నే కాండ్రేగులలోఁ బ్రవేశించిరి. కాండ్రేగుల రామచంద్రపుర మేలు చున్న కాకర్లపూడివారిది. వారి యన్నదమ్ములలో నొకఁడాగ్రామము న కధికారిగానుండెను. అతఁడు దుర్వ్యసనాసక్తుఁడై ధనమును బోఁగొట్టుకొని తలకుమీఱినఋణములు చేసి, తద్బాధను నివారించుకొనుట కై దానిని, దనకుఁగల యితరపరిసరగ్రామములను విక్రయింపఁదలఁ చెను. మనయాత్రస్థులిరువు రారాత్రి యొక్కపూఁటకూటియింట విడిసి మరునాఁ డరుణోదయమున నహార్ముఖోచితకృత్యముల నిర్వర్తిం చుకొని దుర్గముం జూడఁబోయిరి. వారిద్దఱిలో నొకఁడు నవనాగరకత యంతయు మొగమునఁ దాండవమాడునట్లు కాన్పించుచు మేలివలువల ను గట్టుకొనియు, రెండవవాఁడు తనవికారరూపమునకుందోఁడు మలినాం బరములునుం ధరించి యెట్టివాని కేని నేవఁగల్గించునట్లుంటయు నచ్చటి భటులుగాంచి, మంచివసనములుదాల్చిన వెంకటపతిని రానిచ్చి, శోభ నాద్రిని రావలదనిరి. కాని వెంకటపతి యతఁడు తనతాతయనియుఁ దనతో రానీయవలయుననియుఁ గోరి, వారిచేతులలో రెండువెండినాణె ములనుబెట్టి వృద్ధుని వెంటఁబెట్టుకొని సగర్వముగా నడచుచు సౌధము నుజొచ్చెను. ఒకసేవకుఁ డింద్రమందిరమును జూపుటకు వారివెంబడిని వచ్చుచుండెను. ఎన్నియో ద్వారములనుదాఁటి, పెక్కులోఁగిళ్ళనుగడిచి తుద కింద్రమందిరమును బ్రవేశించిరి.

ఆమందిరముయొక్క రామణీయకమును జూచియేతీఱవలయును గాని వర్ణింప నశక్యము. అది మిగుల విశాలమైన భవనము. దానిగోడ లు చంద్రకాంతశిలలతోఁ గట్టఁబడెను. అవి యద్దములవలెఁ బ్రతిబిం బములనుజూపుచుండెను. నేలయంతయుఁ బద్మరాగములవలె నొప్పు రాలచేఁ బ్రకాశించుచుండెను. దానిపైన విలువదైన యతిరమ్య మైన రత్నకంబళము పఱుపఁబడెను. పైకప్పునకు నున్నితమైన బల్లఁ

కూర్చు వేయఁబడెను. దానియందుఁ జిత్రమైన ‘ నగిషీ ’ పని చే యఁబడెను. కుడ్యముల కమర్పఁబడిన నిలువుటద్దములు ద్వారములుపోలెఁ గాన్పించుచుఁ గ్రొత్తవారిని మోసపుచ్చుచుండును. ఎడనెడ వీవనలు చే తఁబూని మనోహరాకారములుగలజంత్రపుబొమ్మ లుండెను. వానికిఁగల మరలు త్రిప్పఁబడెనేని నవి విసరును. బల్లకూర్చునకు బహువిధవర్ణము లుగలిగి విచిత్రమైఖరిని నిర్మింపఁబడిన కాచదీపములు వ్రేలాడఁగట్టఁ బడెను. మఱియు నందుమేజాబల్లలు గురిచీలు నెన్ని యోకలవు. అచ్చ టచ్చటఁ గొన్ని యంత్రపు విగ్రహములు బంగరు పన్నీరుబుడ్లను హస్త ములయందు ధరించియుండెను. వేసవికాలమం దాబుడ్లలో గంధజల మును బోసియుంతురు. వానికమర్పఁబడిన చీలలఁ ద్రిప్పిన నవియు జలము ను జిలికించును. గోడలకు నిలువెడెత్తునఁ బూర్వపుమహారాజులపట ము లెన్ని యోకలవు. ఇట్టి సుందరమందిరమును వెంకటపతిరా జెన్నఁడు ను దిలకించియుండలేదు. అతఁడాసౌందర్యమును జూచుచు నోడలెఱుఁగ కుండెను. మనశోభనాద్రి కిది యంతవింతనుగొల్పుటలేదు. వాని కేమి తెలియును ? అడవిమనుష్యునివంటివాఁడు. అతఁడు వెఱ్ఱివానివలె నిటు నటు తిరుగుచు నొక్కబల్లమీఁదఁ గొన్ని కాగితములుండ వానిని జదు వుచుండెను. అందారాజ్యములో నెన్ని గ్రామములుగలవో, ప్రతిగ్రా మమునకు రాఁబడియెంతయో, వాని నెంతకువిక్రయించెదరో వివరము గాఁ దెలుపఁబడియుండెను. ఆయంశములన్నియు బాగుగఁ జదివికొని యచ్చటి రామణీయకమును బూర్ణముగా ననుభవించినవాఁడువోలె నటించుచు ,, అబ్బాయి ! మనమువచ్చి చాలఁదడవైనది. ఇఁక మర లిపోవలయును. ” అనుచెప్పి వెంకటపతిరాజును వెంటఁబెట్టుకొని మరలఁ బూఁటకూటియింటికిఁబోయి భోజనములుచేసి తమయూరికిఁ బయనమై రి. వెంకటపతిరా జక్కడిభటులకుఁ దలకొకరూకయు బహుమాన మిచ్చి వారిచే నమస్కృతులంగొని ఠీవితో నడచుచు బయలుదేఱెను.

వారు భానుఁడస్తమించుసరికి స్వగ్రామమును సేమముగాఁ జేరిరి.

మఱుచటిదినమున మధ్యాహ్నమునం దందఱును భోజనములు చేసిరి. నరసింహరాజు ప్రభాకరునితోఁ బొలమునకుఁ బోయెను. అరవింద యెప్పటియట్ల యింటిపనులు సవరించుకొనుచుండెను. శోభనాద్రి పయనంపుబడలికదీఱ నించుకసేపు నిద్రఁబోవనిశ్చయించి తనపాన్పుపై వ్రాలెను. ఇదియే యరవిందతో ముచ్చటించుటకు మంచియదనని యెంచి వెంకటపతి లోనికరుగఁదలఁచి వీధియరఁగుమీఁదఁ బొగచుట్టఁ గాల్చుచుఁగూరుచున్నవాఁడు లేచెను. అరఁగుమీఁదికిఁ గనఁబడుకిటికీగుండ శోభనాద్రి పరున్నగదిలోనికిఁ దొంగిచూచెను. శోభనాద్రి గుఱ్ఱుపట్టి నిద్దురఁ జెందియుంట యతఁడు కనిపెట్టెను. వానిప్రక్క నొక తాటియాకులపొత్తము తెఱువఁబడియుంటయుఁ జూచెను. చూచినతోడనే వానికాపుస్తకములో నేమియంశములుగలవో చూడవలెననుబుద్ధి వొడమెను. తోడనే పదములచప్పుడు వినఁబడకుండఁ బిల్లివలెనడచుచు నాగదిలోఁ బ్రవేశించెను. శోభనాద్రి నిజముగా గాఢనిద్రఁ జెందెనా లేదాయని యించుకపరీక్షించి వేవేగ నాతాళపత్త్రగ్రంథములోఁ గొన్ని పుటలు చదివెను. అందేమివిశేషములున్నవో మనకుఁ దెలియదు గాని యతనిమొగముమాత్ర మాశ్చర్యమును సంతోషమును వెలిఁబుచ్చుచుండెను. ఐదునిమేషము లిట్లాతఁడు గ్రంథమును బరిశీలించి దానిని యథాస్థానమందుంచి యేమాయయు మర్మమును నెఱుఁగనివానికైవడి మనోగత భావములన్నియు డాఁగురించి లోనికరిగెను. కాని యరవిందతో సంభాషించుటకు వలనుపడినది కాదు. ఏలయన నరవింద యప్పుడు కొందఱుసఖులకు భారతములోని సుకన్యాదేవి చరిత్రమును జదివి వినిపించుచుండెను. వెంకటపతిరాజున కేమియుఁదోఁపక వాకిటనున్న పడకకురిచీలో వ్రాలి వితర్కసముద్రమునందుఁ గొట్టుకొనుచుండెను. ముందుముందు వారిచరిత్రమును గమనింతము.

## ఆఱవ ప్రకరణము.

### కన్నె యెన్నిక.



వెంకటపతిరాజు చంద్రగుపాలెమువచ్చి నెలయైనది. ఇంకను సోధనాద్రిరాజిచ్చటనే యున్నాఁడు. అతఁడు నరసింహారాజును గోరిన గడువుదాఁటిపోయి మూఁడువారములయినది. అయినను దనప్రయాణ ముంగూర్చి తలపెట్టుటయైన లేదు. గడువుమీఱి యతఁడున్నందునకు నరసింహారా జేమియు ననుకొనలేదు. పైఁగా నతఁడు వెడలిపోయినఁ గుటుంబములో నొకఁడు లోటువచ్చునేమోయన్నంత ప్రేమయు వానియందు దండఁటికిఁ గుదిరినది. వానికడ మునుపటివలె నతివృష్ట్యనావృష్టి దోషము లేమియు లేమి నరవిందయు వానియెడఁ బాటునకు సమ్మతింపకుండెను. వెంకటపతిరాజుకూడ వానియం దమితాదరముఁ జూపుచు వానిపనులు శ్రద్ధతోఁ గమనించుచుండెను. తఱచు వానితోఁ జనవుగా భాషించుచు వాహ్యాళికై పోవుచు వేడుకగాఁ గాలము వెడలఁబుచ్చుచుండెను. ఇతఁడు వచ్చినదిమొద లరవింద ప్రభాకరునితో నంతఁ గలసిమెలసి మాటలాడుటలేదు. ఆమె కెట్లు తీఱికగల్గునో? రాకరాకవచ్చిన బావతో వేడుకనుడు లాడుటకే యామెకుఁ గాలము చాలకుండెను. ప్రభాకరుఁడును నాఁటి పుష్పవృత్తాంతముఁ దలపెట్టుట కవకాశము చిక్కుటలేదు. మునుపటివలె నరవింద యాతనితోఁ బీఠికాపురముపోవుట మానినది. వేషాడంబరము, వాగాడంబరమును గల మేనత్త కొమారుఁడను నయస్కాంతముచే నాకర్షింపఁబడిన సూచియైయున్నది. కాని ప్రభాకరునిఁ గేవలమును విస్మరింపలేదు. నిరాశాగ్రీష్మపరితాపముచే నెండుచున్నవాని హృదయక్షేత్రమును దనప్రియవచన సుధారససేచనముచే నప్పుడప్పు డించుక యార్ద్రీకృతముం గావిం

చుచున్నది. ఆమె వెంకటపతిరాజునలఁజిక్కినహారిణి యని గట్టి యనుమానము ప్రభాకరునకుఁగల్గినను, నతఁడు కేవలనైరాశ్యహతుఁడు కాలేదు. ఆకాశ మెంతగా మేఘచ్ఛన్నంబైనను సూర్యకిరణప్రసార మొక్కటియు లేనిదిగ నెన్నఁడుఁ డదనియు, రాత్రి యెంతయంధకార బంధురమైనదైన నొక్కనక్షత్రకాంతియైన నుండకుండదనియు, నెడారి యెంతటియూషరక్షేత్రమైన నొక్కచోటనైన ఫలవత్ప్రదేశముండకపోదనియు, నప్పుడామెపలుకు ప్రియవచనములే తనయాత్మయనును మేఘావృతనభంబునకు, తిమిరాకారాత్రమునకు, నూషరక్షేత్రపరీతప్రదేశమునకు సూర్యకిరణమును, నక్షత్రమును, సుక్షేత్రమును నగుననియు వానినమ్మకము. వెంకటపతిరాజు యథాపూర్వముగఁ బ్రభాకరునియెడ నిరసనభావముం గనఁబఱచుచునేయుండును. వాఁడు మొదటినుండియు నటులేయుండుటచే నరసింహరాజు వానియలక్ష్యభావముఁ బరికింగొనకుండెను.

ఒకనాఁడు సాయంకాలమున నరసింహరాజు కొంతధనము నొకస్నేహితున కప్పిచ్చుటకుఁ బట్టుకొనిపోవుచుఁ బత్రముమీఁద సాక్షివ్రాలుచేయుటకుఁ దనమేనల్లునిఁగూడఁ దనతోరమ్మనెను. వాఁడు సదా యరవిందకు సంతసముంగూర్చుచు నింటనుండవలయుననియే కోరువాఁడైనను, మామమాటఁ దీసివేయలేక నల్లెయనెను. వారుభయులారీతిఁ బోయినపిదప శోభనాద్రిరాజు ప్రభాకరునిఁ దనగదిలోనికిరమ్మని పిలిచి యిట్లు మాటలాడఁదొడఁగెను.

శోభ—ప్రభాకరా! నీతో నొకమాట చెప్పవలెననియున్నది. కొంచెముసేపిచ్చటనుండుటకు నీకుఁ దీరుబడియున్నదా?

ప్రభా—లేకేమి? చెప్పుఁడు.

శోభ—నేనుజెప్పునది పరమరహస్యము. నీతో నేఁజెప్పిన దెవ్వరితో ననఁగూడదుసుమా? నీవరవిందయందు మోహమునునిల్పితివికదా?

ప్రభాకరుఁడు తెల్లఁబోయెను. కలవరము మొగమునఁ దెల్లము గఁ గనఁబడుచుండెను. కొన్నినిముసము లటులుండి వాఁడిట్లనెను. "అవును. నేనరవిందను మనసారఁ బ్రేమించితిని."

శోభ—నిజము. స్వభావముచే నీకామెపై మోహముకలుగవలసిన దే. ఆమెను నీకిచ్చెదనని యామెతండ్రి చెప్పెనుగదా ?

ప్రభా—సత్యమే. కాని—

శోభ—కానులటులుంచుము. నీవు పైకిసంతుష్టిగలవానివలెఁ గాన్పించుచున్నను నిజముగా నీమనసులో నేమున్నదో నాకుఁ దెలియును. నీవరవిందపై మోహమొందియున్నను, వెంకటపతిరాజును జూచి యసూయపడుటలేదు. నీసత్స్వభావము నే నెఱుఁగుదును. అయినను నీకుఁ గొన్నిసంకోచములు హృదయమునందుఁ గలవు. అవునా ?

ప్రభా—(వెఱఁగుపడి) అవును.

శోభ—అవి నీకు న్యాయముగా నుండఁదగినవే! కాని వానిని మనము నందిడికొని వ్యర్థముగా నీవు రహస్యక్లేశము నొందరాదు. నీవు మంచియో చెడ్డయో తేల్చికొనవలెను. అరవింద నిశ్చయముగా నిన్నుఁ బ్రేమించి నిన్నుబతినిగాఁ గైకొనఁదలఁచిన నిఁక నాలస్యముచేయరాదు. మీవివాహముఁ బ్రకటింపఁ దగుకాలమువచ్చినది. లేనిచో నీమనోగతసందేహమును నివృత్తిఁ జేసికొని ధీరపురుషుఁడ వగుటచే నేమియువిచారింపక భవిష్యచ్చింత చేసికొనవలయును. నీసందేహభారము నిఁకనైన వదల్చుకొనవలెను. ప్రభాకరా ! నావాక్యములు నీకు బోధపడినవా ? నేను నీకు స్నేహితుఁడను. నన్ను నీవు వేయువిధములఁ గనుఁగొని యాదరించుచుంటివి. చిన్నచిన్నపనులు లెక్కలోనికి రావుగాని, నీవు నాకుఁజేసిన యుపచారములెన్నియోకలవు. త

తృప్తిఫలముగాఁ గాకపోయినను, మనుజుఁడై పుట్టినవానికి సా
ధ్యమైనంతయుపకృతి నొరుల కొనర్పవలసినధర్మముఁ గనుటచే,
నీకు హితోపదేశమునుజేసెదను వినుము. ఇప్పుడరవింద పూ
లుగోయుచుఁ దోఁటలోనుండును. నీవును వెంటనే యామెయొ
ద్దకుఁబోయి నీభావిజీవితమునుగూర్చి స్థిరపఱచుకొనుటకై,
యామెనోటనుండి యేదోయొకటి తెలిసికొని రమ్ము.

పరిభా—అయ్యా! చక్కఁగానాలోచించిన నామె ప్రస్తుతపువర్తనమే
యామె మనోనిశ్చయమును దెలుపుచున్నది. ఆమె యిదివఱకే
తన చేష్టలచేఁ దనయభిప్రాయమును నాకు వెల్లడించినది. అ
ని తనకు నామెకును బూవునుగూర్చిజరిగినసంభాషణమును బూ
ర్తిగాఁ దెలిపెను.

శోభ—దానికేమి లెమ్ము. కన్యయగుటచే బిడియపడి యట్లుచేసినది.

పరిభా—తాతగారూ! నేను నటులేతలఁచి యూరటఁజెందితిని. ఆనాఁ
టిరాత్రి భోజనంపుసమయమున నామె నాతో వికసించిన మో
ముదమ్ముతో సంభాషించినపు డటులే యనుకొంటిని. కాని—అని యా
గిపోయెను. మఱిమాటాడలేకుండెను. ఏదో చెప్పవలెననికోరికగలదు.
కాని చెప్పలేకపోయెను.

శోభ—ఏదెట్లయి నింక నాలస్యముంజేయక 'యగును కాదు' అను
సంగతి నిర్ధారణపఱచుకొనవలెనుగదా? ఊరక లేనిపోని చింత
లుపెట్టుకొని హృదయమును జెదరఁగొట్టుకొనుట మేలగునా?
కాదు. కావున నాయుపదేశమునువిని తత్క్షణము తోఁటలో న
రవిందను గలసికొమ్ము. పర్యవసాన మాలోచింపుము.

ఈమాటలుజెప్పి వృద్ధుఁడు లోనికిఁ జనెను. పరిభాకరుఁ డాయు
పదేశవాక్యములఁగూర్చి కొంతవడి చింతించి వాని ననుసరింప నిశ్చయిం
చి పెరటిలోనికిఁ జనెను.

అరవింద సన్నని మనోహరమైన కంఠధ్వనితోఁ బాడుకొనుచు మల్లెపందిరులయం దచ్చటచ్చట సకృతుగానున్న మొగ్గలను గోయుచుండెను. అప్పు డామెయాకృతి దర్శనీయమైయున్నది. ఒకకాలు ముందునకువైచి యూని, రెండవపాద మించుకయెత్తి వ్రేళులపై భారమునిల్పి, కలకలలాడు నెమ్మోమునఁ జిఱునవ్వొలుకఁ నేదియో కీర్తన మధురధ్వనితోఁ బాడుచు, రదనకుందములును హస్తలబ్ధ కుందములును గనఁబఱచుచుఁ, దనకపోలదర్పణముల తళతళత్కాంతులు సంజకెంజాయతో వియ్యమందఁజేయుచు, మందమారుతముచే సంచలితములగు వినీలకుంతలములును, శరీరమంతయుఁ గప్పి యించుకమేనిసువర్ణచ్ఛాయను జూపుచున్న సన్నని ధవళాంబరమును గలదియగుచు, మబ్బులలోఁ దోఁచు తొలుకారు మెఱుపువలె నొప్పుచుండెను. అప్పుడామె కెవ్వరిదో యడుగుల చప్పుడు వినఁబడెను. ముసలివాఁడై యుండనోపునని యామె చంచలకటాక్షములతో నాఁడు లేడివలె నిటునటు జూచెను. కొంతసేపటికిఁ బ్రభాకరుని యాకారము గాననయ్యెను. తెలతెలఁబోయెను. చేతినుండి యరవిరిమొగ్గ లయత్నముగ జాఱిపడియెను. తరువాతఁ గొంచెమెద వదిలపఱచికొనినట్లు కనుపించెను. ప్రభాకరుఁడు సమీపించి ‹ అరవిందా!' యని పిలిచి కొంతవడి మిన్నకుండి ‹ నీతో రెండునిముసములు మాటలాడ సెలవిత్తువా ? ' యని యడిగెను.

అర.—ప్రభాకరా ! నేనా ? సెలవా ? క్రొత్తమాటలాడుచుంటివే ?

ప్రభా.—‹క్రొత్తమాటలుకావు. ఒకవేళఁ బ్రస్తుతావస్థనుబట్టి క్రొత్తనై యున్నవేమో ?' ఇయ్యెడ వానిచూపులలో నాత్రము విస్పష్టముగాఁ గానఁబడుచుండెను. దేహము కంపించుచుండెను. మరల ‹ఓయరవిందా ! నామనంబును బాధించుచున్న సందియమును బోఁగొట్టవా ? నేనంతగొప్ప కోరికను గోరుట యనుచితము. కాని నాగతిని గూర్చి నీనోటితో, నీ బంగారు నోటితో

నేమిపల్కెదవో పల్కుము. ఆనుడులు వినువఱకు నేను నిరా శను జెందను. నీతండ్రి—నాకునుదండ్రివంటివాఁడు—నాయందు వ్యాజప్రేమచే నటుల వచించియుండనియెడల నీప్రాణిని గ్రహింపఁ బ్రయత్నముసేయునంతటిసాహసకృత్యము నొనర్చియుం డను. నేను దీనుఁడను. అనాగరికుఁడను. ప్రాయశః సురూపరహి తుఁడను. వచోచమత్కృతి లేనివాఁడను. సర్వమునకు నీజనకునే నమ్మినవాఁడను. కాని ప్రేమరసపూరితమైన హృదయముఁగ లవాఁడను. ఇంతవఱకు నిష్కళంకవర్తనముం గలవాఁడనని గ ర్వముతోఁబలుకఁగలవాఁడను.

అర—(వానిమాటకడ్డమువచ్చి) ఏలయీప్రసంగము ప్రభాకరా ? నీ మంచిగొనముల నేనెఱుఁగుదును. మఱియు, మఱియు—(అని యేమియోయనఁబోయి, తడఁబడి, యవ్యక్తకంఠధ్వనితో ) వా నిని గ్రహించితిని—

ప్రభా—అట్లయిన నీవు నా పవిత్రమైన ప్రేమను, అవ్యాజమైనప్రేమ ను, చిరకాలజనితమైన ప్రేమను, భవజ్జనకసమ్మతమైన ప్రేమ ను, అంగీకరించి నన్ను ధన్యునిఁజేసెదవా ? ఒక్కమాట, న న్ను నిరంతరసౌఖ్యాంబునిధి నోలలాడింపఁగలయొక్కమాట. 'స రే' యను నొక్కమాట పలికి నా చెవులలో నమృతమును బో సెదవా ? (కొంతవడి యూరకుండి ) నీకు సమ్మతముకానిచో నీ హృదయమును దాఁపక నాకెఱింగింపుము. సందిగ్ధమైన చిత్త ముతో నింక భరింపఁజాల.

ఇట్లు ప్రభాకరుఁడు పలుకఁగా నరవింద యేమిప్రత్యుత్తరమీ యవలెనో నేరకుండెను. ఆమె యెదయందుఁ దలఁపులు వేనవేలుద్భవించి బుద్బుదములవలె వెంటనే నాశముసొందుచున్నవి. వానిలోఁగొన్ని యామెకుఁ జాల బాధకరములుగా నున్నవి. ప్రభాకరుని సద్గుణము

లోకదానివెంబడి నొకటి యామెకు స్ఫురించుచుండెను. పితృప్రాపదేశము కూడ బాగుగ మనసునందు నిలిచియేయున్నది. తండ్రి మనోరథమీడేర్చుట ముఖ్యకర్తవ్యమనియు నామెకుఁ దెలియును. తాను జనకునకుఁ జేసిన వాగ్దానమును జ్ఞప్తియందుంచెను. కాని యామె వెంకటపతిరాజు విలాసచేష్టితములఁజూచి భ్రమనొందినది. వాని నుద్వాహమాడినఁ దన కు సర్వసౌఖ్యము లొదఁగూడునని యుద్దేశించినది. ఒకవిధమైన యంధకార మామెకన్నులను గప్పివైచినది. అదిమోహాంధకారము. దానిప్రభావమువర్ణనీయము. అది యిప్పు డావిందను బూర్ణముగా లోపఱచుకొన్నది. నాఁడు శోభనాద్రిరాజామెకు మణిసరములిచ్చినపు డుపదేశములనొసంగిన దేవత లిద్దఱును మరలఁ దమ సోదెల నామె హృదయవాటికయం దేకరువుపెట్టుచుండిరి. కాని మోహాంధకారవోరుఁ డాచాపల్యదేవతకు సహాయుమైయుండి యామె మనోధనమును హరించెను. భావిచింత లేకుండఁ దన కెట్టివిపత్తులువచ్చినను వెంకటపతిని వివాహమాడ నిశ్చయించి యరవింద యెట్టకేలకు వానితోఁ నిట్లనెను.

అర—ప్రభాకరా! (అని కొంతసేపైనదాఁక మాటలాడలేకుండెను. తర్వాత మనసుఁ గుదుటుపఱుచుకొని) నీ సుగుణ సంపత్తికి నిన్నెప్పుడును గొనియాడుచుందును. నీయందు నాకు నిశ్చలమైన ప్రేమగలదు. నీవు నాతోడఁబుట్టినవాఁడవుగాఁ దలఁచి ప్రేమించుచున్నాను. కాని—

ప్రభా—అరవిందా! చాలుఁజాలు—ఇప్పుడు నాని ముఖమువికాసము దప్పినది. నోట మాటరాలేదు. దుఃఖము పొరలిపొరలి వచ్చుచుండెను. కష్టముమీఁద దాని నాపుకొని మనస్సును దృఢపఱుచుకొని యామెకుఁ గడుదాపున నిలచి దీనదృష్టులఁ జూచుచు "భగవంతుఁడు నిన్ను సుఖవంతురాలునిగఁ జేయుత' మనిదీవించి గిరుక్కున వెనుకకు మరలెను.

అరవిందయొక్కర్తుక తోఁటలోఁ దిరుగుచుండెను. ఆమెనడక మందగించినది. హృదయముమా వేగపడుచుండెను. మధ్యమధ్య వేఁడినిట్టూర్పులను విడుచుచుండెను. గుత్తముగాఁ దొడిగికొనిన యామెకంచుకము పెకలిపోవుననుసందియము పుట్టుచుండెను. కుసుమమువిషయమై పశ్చాత్తాపపడినట్లు మరలఁ దాను నేఁడు చేసినది తప్పని పరితాపమొందుచుండెను. తండ్రి యానతి నతిక్రమించితినని వేదనపడుచుండెను. పరిశుద్ధ హృదయుఁడగు ప్రభాకరుని నొవ్వాడితినని తహతహపడుచుండెను. ఇదంతయు నొక్క నిమిసమువఱకే. పదపడి యాశావిద్యుల్లతయొకటి యామె మానసగగన వీధిఁ దళుక్కుమని మెఱసెను. అదెంతసేపు నిలుచును? దాని కాంతియెంత? వెంటనే దుఃఖాంబుదమావరించెను. ఆవల బాష్పవర్షము కురిసెను. మిక్కిలి పైకెగురఁగోరి తటాలుననెగచి, యశక్తతచే నేలఁగూలిన పక్షిచందమున నామెయొక్కమాఱట్టి పేరాసచేఁ బైకిలేచి క్రిందఁబడెను. ఆమె వగచుచు నొక పొదచాటునఁ గూరుచుండెను. ఎంతసేపు వగచెనో యామెయే యెఱుఁగదు. కన్నీరు మున్నీరై పాఱుచున్నది. అప్పుడొక సుందరాకారుఁడు వచ్చి యెదుటనిలిచెను. అదియు నామె యెఱుఁగలేకపోయెను. అతఁడుత్తరీయాంచలముతో నామె యశ్రువులను మృదులముగా నొత్తుచు “ అరవిందా! ఏమి? ఏమి? ఏలవాపోయెదవు? నీవుదుఃఖపడిన నేనును దుఃఖపడుదును. నీవు సుఖించిన నేనును సుఖింతును. నీతో సుఖదుఃఖములయందు భాగస్థుఁడనౌడకే యిటకు వచ్చితిని. నిన్ను నిండుమనంబుతోఁ బ్రేమించితిని. నీకు దయగలదేని, నాభావికాలమంతయు నీతోనే కడపఁదలఁచితిని. దుఃఖకారణమేదియో చెప్పుము. నేనుండ నీకేల?” అనియనెను. అతఁడు వెంకటపతిరాజు. వాఁడుతప్ప మఱెవ్వరిట్లు ప్రేమయుట్టిపడునట్లు మాటలాడఁగలరు? వాఁడు బలుమోసగాఁడు. వాని వాగ్వాయువులచే నామెయెడదయందలి దుఃఖపయోదములు చెదరఁగొట్టఁ

బడెను. ఆమె హృదయ మించుక తెఱపిగాఁబడెను. వెంకటపతిరాజు వంక నపాంగవీక్షణములఁ జూచినది. దుఃఖమంతయు నొక్కపర్యాయమే గతించినది. అతఁడు పలికినయమృతప్రాయవచనము లామె వీనులలోఁబడిన పిమ్మట నామె వైఖరియంతయు మాఱిపోయెను. ఇప్పుడామెమనసులోఁ బ్రభాకరుఁడున్నాఁడా ? కంచుకాగడతో వెదకినను గనఁబడఁడు. అతఁడు లేఁడు ఆమెకు దండ్రియేమనునోయని యేమైనభయముకలైనా? లేదు. తనసుఖమే ముఖ్యముగాఁ గోరువాఁడగునా తఁడు తనవాంఛను దీర్పకపోఁడని నమ్మికతోఁచెను, ఆమె సంతోషమునుదెలుపుచూపు లాతనిపైఁ బఱపెను. అవియే యంగీకారసూచకదృష్టులు. తుదకామె వానితో, 'మనయీకూడిక మానాన్నగారికింకను దెలియఁజేయవలదుసుమీ' యని చెప్పెను. ఈనుడులువిని వెంకటపతిరాజు మహానందముం బొందెను. తాను బన్నినవలలో నామె సులువుగాఁ జిక్కుకొనెనని యత్యంతహర్షమొందెను. పైకిమాత్రము మనోవికారమేమియుఁగానరానీక యామెతో గృహముంజొచ్చెను. రాతిరి భుజించువేళయయ్యెను. అందఱును భోజనములకు లేచిరి. ప్రభాకరుఁడు మాత్రము వచ్చుటలేఁడు. నరసింహరాజు ప్రభాకరుఁడెక్కడయని సేవకులనడిగెను. ఎవ్వరును వానినిగూర్చి యెఱుఁగమనిరి. అప్పుడొకసేవకుఁడు వాకిటబల్లమీఁదనుంపఁబడిన యొక్కకమ్మఁదెచ్చి నరసింహరాజునకిచ్చెను. అతఁడాయక్కఱముల పొంకముఁజూచి యది ప్రభాకరుని వ్రాఁతయే యని తెలిసికొని, మిగుల నాతురముతో దానివిప్పి బిగ్గరగా నిట్లు చదువఁదొడంగెను.

"ఆర్యా ! నమస్కృతులు. తమ యపారకృపచే నింతదనుక సుఖంబుగ మీయండఁజేరి కాలంబు వెడలఁబుచ్చితిని. నాకు జననీజనకులు లేకపోయినను, సర్వము మీరయై కాపాడితిరి. విద్యాబుద్ధులు చెప్పించితిరి. ఇప్పుడునాకు ఱెక్కలువచ్చినవి. ఎల్లకాలమును మీకు

భారమునై యుంట మేలుకాదని తోఁచినది. ఇప్పు డెందేనియేగి స్వకాయకష్టములవలన జీవయాత్రనుజేయుచుఁ గీర్తిధనము సంపాదింపవలెనని కోరికగలదు. ఈయుద్దేశము దమకుఁ దెలిపిన మొదలయినాని యిట్లు సాహసించి బయలువెడలితిని. క్షమింపఁ వేఁడెదను. నాయందు సోదరప్రేమను వహించినయరవింద క్షేమమునే సర్వదా కాంక్షితునని మనవిచేయఁ బ్రార్థింతును. తాము నాయెడలఁ బూర్వపువాత్సల్యమే యుంపవర్థింతు: మన్నింపఁగోరెదను. భగవంతుఁడు తమకుఁ దమకొమరితకు నాయురారోగ్యంబొసంగి రక్షించుఁగాత.

ఇట్లు, విధేయుఁడు,

ప్రభాకరుఁడు.

## ఏడవ ప్రకరణము.

నరసింహరాజు మనసు చివుక్కుమనెను. అరవిందమొగముపై లజ్జాజనితారుణ్యము పదిపండ్రెండుసారులు కనఁబడి మాయమయ్యెను. 'నాయందు సోదరప్రేమవహించిన' యనుమాట లామెహృదయమును గలఁచివైచినవి. 'అయ్యో! నిష్కారణముగా వానిని వెడలఁగొట్టితినే' యని లోలోనఁ బరితాపమొందుచు దిగ్భ్రమఁజెందినదానివలె నుండెను. శోభనాద్రి యామెవంకఁ దదేకదృష్టితోఁ జూచుచుండెను. అతఁడామెచేష్టలఁ గనిపెట్టుచుండెను. వెంకటపతిరాజువదనమునందు విషాదమధికమయ్యెను. ఇంక నిరాఘాటముగా నామె పాణిని గ్రహింపవచ్చుననియుఁ బిశాచము వదలిపోయినట్లు తనభావిసౌఖ్యమున కడ్డంకియగువాఁడు పోయెననియు నాతఁడు మురియుచుండెను. కన్నకొడుకు దేశాంతరములకుఁ బాఱిపోయినప్పుడు దుఃఖించు తండ్రివలె నరసింహరా

ఁ వగచెను. వానిని బసిబాలుఁడై యుండఁ దెచ్చి యింతవానిఁగఁ జేసి యుంటచే వానివియోగ మాతనికి బహు విషాదకరముగానుండెను. నాఁడు తనతో సుతపలికిన పలుకులనుబట్టి యామెకు వానియందలి ప్రేమలో నే లోపమునుండదని యతఁ డనుకొనెను. కూఁతుఁ రవిధేయత జూపదనినమ్మెను. ఆమె తప్పుదారినిఁ బట్టదను గుడ్డినమ్మకముతోనే యుండెను. వేయేల, యాతఁడెంతసేపు మనంబున వితర్కించుకొనిన నామెయందు దోషారోపణముచేయుట కాధారములు దొరకలేదు. కాని వెంకటపతిరాజురాకయే వానిపోకకుఁ గారణమైయుండునని యతను మానించెను. ఇట్లు కొంతవఱకుఁ దనలోఁ దావితర్కించుకొని “ పాపము. వానిని దలఁచికొనిన నాకు జాలియగుచున్నది. వాఁడు లేనిద నే నిచ్చటనుండలేను. తత్క్షణమే వానిని వెదకుటకై సేవకులనంపి యెచ్చటనున్నను బిలిపింతును.” అని వాక్రుచ్చెను. ఆమాటలాలించి శోభనాద్రిరాజు “ అయ్యా ! వలదు. వలదు. నాయుపదేశము వినుఁడు. ప్రభాకరుని వానియిచ్చవచ్చినదారినిఁ బోనిండు. వాఁడుపోవుట మీకును వానికిని క్షేమంకరమే. అన్యథాభావింపక నామాటవినుఁడు. అని పలికి యెవ్వరివైపునను జూడక తలవంచికొని తనగదిలోనికిఁ బోయెను. ప్రభాకరుఁ డంతహఠముగఁ బ్రయాణముగుటకు నిజమైనకారణము తన తండ్రి గ్రహింపలేదని యరవిందయెఱుంగును. ఆమె నిశ్చయమైన పశ్చాత్తాపమొందుచుండెను. తాను మోసకత్తియని యనిపించుకొనక యుండ సత్యము జనకునితో వచింపవలెనని నిశ్చయించుకొనెను. తాను చంచలబుద్ధిగలదగుటచేతనే యిట్టి యిక్కట్టు సంభవించినదని తెలిసికొనెను. స్వభావముచేత నామెసుశీల అగుటచే మరలనామె సత్స్వభావము తెల్లమగుచుండెను. లోకములో సహజసౌశీల్యముగలవారలొకతఱిఁ బొరపడినను మఱియొకసమయమునందు దానిని సవరించుకొని తమమంచితనమును స్థిరముగ నిలిపికొందురు. అరవిందయు నట్టిదేకావునఁ దన

తప్పులనెల్లఁ దండ్రియొద్ద నొప్పుకొనుటకుఁ గృతనిశ్చయురాలయ్యెను.

మఱునాఁడు శోభనాద్రి వఱువాత లేచి నరసింహరాజుగారి గదియెదుటఁ జావడియందుఁ బ్రాతస్స్మరణీయ శ్లోకముల బఠించుచుఁ బచారము చేయుచుండెను. కొంతవడికి నరసింహరాజునకు మెలఁకువ వచ్చెను. ఇతఁ డాతనికడకుఁజని "అయ్యా! నేను మీయింటనుండి మీయన్నమును దినినవాఁడనగుటచే మీమేలును సదా కోరుచుందును. మీరు ప్రభాకరునిఁ దిగఁ దే యత్నములుసలుపవద్దని నాకోరిక నే నేండ్లుమీరినవాఁడను. ఎందునకుఁ జెప్పితినో యాలోచించుకొనుఁడు. అతఁడు మీకులభింపఁడు. అప్పుడు మీచిత్తము మఱింత తత్తరమొందును. అదియునుగాక యతఁడు మహాబుద్ధిమంతుఁడు. మీయొద్దనే యతఁడుండిన నతని సర్వాంకిషప్రజ్ఞ యంతయు నడవిఁగాసిన వెన్నెలయగును. సముద్రగర్భమందలిరత్నములవలె నున్నవానిసుగుణమణులు మీకడనున్నంతకాలము పైకి దేబడఁ నేరవు. తేఁబడనివో వానికాంతులు వ్యర్థముగాఁబోవును. కావున నామనవి విని వానికొఱకైన విచారంపాటు మాని సుఖముండుఁడు. ముందుముందు వానియద్భుతచరిత్రము మీకే తెలియఁగలదు." అని చెప్పెను.

జగమునందుఁ బరులహృదయము లాకర్షింపయత్నించువారల కత్యద్భుతమైన గుణములుండవలెను. వారిమోములందు భావములుట్టిపడుచుండవలెను. మాటలు తేనెలొలికించుచున్నట్లుండవలెను. వారు ప్రసంగించువిషయములు పాండిత్యచితములై హృదయంగమములై యుండవలెను. ఇట్టి వచోచమత్కృతియంతయు శోభనాద్రికడనున్నది. నరసింహరాజు వానిమాటలువిని నిముసములో వశుఁడయ్యెను. ఆమాటలతనిపాలిటి మంత్రాక్షరములయ్యెను. ప్రభాకరునికై మిగులవగచువాఁడూరటఁ జెందిమిన్నకుండెను. కాని కొన్నిదినములవఱకతని కేమియు దోఁచకుండెను. తనకుడిభుజము పడిపోయినటులేయతనికి గోచరమయ్యెను.

శోభనాద్రి యీ 'సలహా' యిచ్చి యరవిందయున్న యెడకుఁ బోయెను. అరవింద తండ్రితోఁ దన హృదయగతాభిప్రాయములన్నిఁయుఁ జెప్పవలెనని మునుముందులేచి యారామమున నతఁడు నిత్యమును దంతధావనము చేయుచోటున వేచియుండెను. నరసింహరాజక్కడకుఁ బోకమునుపే శోభనాద్రిపోయి యరవిందతో 'అమ్మా! అరవిందా! నీతో నొక్కమాటఁ జెప్పవలెనని వచ్చితిని సావధానముగా విందువా?' యని యనెను. అతఁడు ప్రభాకరునిఁగూర్చి మాటలాడునేమోయనితలఁచి యామెయేమియుమాఱుపలుకకుండెను. శోభనాద్రియెంతయన్యుఁడైనను, వానినిజూచిన నందఱకొకవిధమైనగౌరవముఁజూపబుద్ధి జనించును. అరవిందప్రత్యుత్తరమీయకపూర్వమేయతఁడుమరల 'నీవిచ్చోటున కింతపెందలకడనేలవచ్చితివో మొదటఁజెప్పుము.' అనియడిగెను.

అర—గదిలో మానాన్నగారి కంఠధ్వని వినఁబడి యాయన యప్పుడే లేచెఁగదాయని తెలిసి, కలసి యొకవిషయముంగూర్చి సంభాషింపవలెనని యిచ్చటికి వచ్చితిని.

శోభ—అరవిందా! నేను జోలిమాలిన పనులలోఁ బ్రవేశించుచుంటి నని నిందింపకుము. ముసలివాఁడను. మీయందఱిమేలును గోరువాఁడను. ఏదో వెఱ్ఱియాత్రముచేత నిట్లడుగుచున్నాను. మన్నించి మాఱుపలుకుము. మీతండ్రితో మాటలాడఁబోవు నంశములెవ్వి? నాకుఁ దెలుపవచ్చునా?

అర—(కొంతసేపు నీళ్ళునమలుచు గొణఁగి) నేనొకరహస్యమును మాటలాడుటకై వచ్చితిని.

శోభ—నీవొకరహస్యమును మాటలాడుటకువచ్చితివా? అదేదియో చెప్పవా? నీవు ప్రభాకరునిగుఱించి ప్రశంసించుటకురాలేదా?

అర—అవును—అని తెల్లఁబోయెను. కలవరము మోముదమ్మిని విస్పష్టముగాఁ గాన్పించుచుండెను.

శోభ—అరహస్యము లోని మర్మము లన్నియు నేనూహించి చెప్పఁగల ను. నీవు ప్రభాకరుని ప్రేమను నిరాకరించితివి కాదా?

అర—(తలవాంచియుండి) అ-వు-ను.. అని మెల్లగనని మంచిముత్తియ ములవంటి బాష్పములఁ జెక్కిళులవెంబడి వెలార్చెను. పదపడి 'తాతా! నాప్రియజనకుని యభిప్రాయమునకు వ్యతిరేకము గాఁ జరించి కడుమోసముఁ జేసితిని. అతఁడు ప్రభాకరుని నా భావినాథునిగా గ్రహింపుమని యాజ్ఞాపించెను. కాని నేనా యాజ్ఞోల్లంఘనముఁగావించి ప్రభాకరుని నిరాకరించితిని. ఇ ప్పుడు నాదోషము నాతనికడ నొప్పుకొని క్షమింపవేఁడెదను. అందులకే యుచ్చటఁ గనిపెట్టుకొని యుంటిని—' అని గద్గదకం ఠియై వచించెను.

శోభ—సరే. సరే. అనుతాపము మంచిదే. మీనాన్నగారితో మాట లాడవలసిన రహస్యాంశ మిది యొక్కటియేనా?

అర—తాతా! నేను జెప్పఁదలఁచిన దింకొక్కటికూడ నున్నది. దుష్టు రాలనైన నేననేకాకార్యము లొనర్చితిని.

శోభ—నాకు బోధపడినది. నీరెండవరహస్యమునుం దెలిసికొంటిని. నీవు ప్రభాకరుని నిరాకరించుటయే కాక వెంకటపతిరాజును వ రించితివనియు నీతండ్రితోఁ జెప్పఁగోరుచుంటివి కాదా?

అరవింద యగాధమైన తనహృదయము నాతఁ డట్లుగ్రహించి నందుల కాశ్చర్యపడి 'నిజమే తాతా! ఆలాగుననే' యని యస్పష్టము గాఁ బలికెను. శోభనాద్రి ముఖమందుఁజూపట్టు సహజకాఠిన్యమంత యు వీడి సౌమ్యస్వరూపుఁడై యామెతో నిట్లనెను.

శోభ—"అమ్మా! నాకంతయు ద్యోతకమైనది. నీవు వేఱచెప్పనేల? నానుడులాలకింపుము. ఈప్రపంచమునఁ జాలమంది తామొన ర్చిన యీ కార్యమును జిన్నదానినిగాఁ జేసి యితరులతో వచిం

తురు. కొందఱు న్యాయమార్గానువర్తులు యథాపూర్వముగాఁ బల్కుదురు. మఱికొందఱుమూఢులు, నీవంటివారు, తమ స్వల్పదోషమును ద్విగుణమునుజేసి చెప్పుదురు. నీవట్టివారవైతివి. ధర్మబుద్ధితోఁజూచిన నీయందంత దోసమున్నట్లు తోఁచదు. నీమనంబునకు నచ్చినవానిని నీవు మోహించుటలో నీ తప్పేమిగలదు? మొట్టమొదట నీతండ్రి నీహృదయమును జక్కఁగా గ్రహించి మఱి నిన్నుఁ బ్రభాకరునందుఁ బ్రేమనిలుపుమని యాజ్ఞ యీయవలసినది. నీ ప్రేమప్రవాహ మెట్లుపాఱుచున్నదో యెఱుఁగమి నీతండ్రిదోసముగాని నీదికాదు. జనకు నాజ్ఞ నతిక్రమించుటచే నించుకదోషము నీయందున్నను, నీ వాతని మొదలనుబట్టి ప్రతికూలవరుని వరించి చేయుదోషము కంటె నెక్కుడైనది కాదు. కావున నీవిప్పుడు నీజనకునితో నేమియుఁ జెప్పనక్కఱలేదు. మఱియు మీనాయన ప్రభాకరుని యభిగమనమునకై కుందుచుండెను. వాఁడు నీమూలముననే లేచిపోయెనని తెలిసినప్పుడు మఱియుఁగుందును. కనుక రహస్యమును వెల్లడించుట యెంతమాత్ర ముచితముగాదని నాయభిప్రాయము. అదియునుగాక దానిని నీహృదయమందుంచినందువలన నష్టమేమియుఁ గానరాదు. తల్లీ! నామాటవినుము. నేను నీసేమమును గోరి యిట్లు వక్కాణించుచుంటిఁగాని మఱియొకటి కాదు. కావున వేఱుగాఁదలంపక నామాటపాటింపుము."

"ఆహా! నీపలుకులు నావీనుల కమృతధారాపాతములవలె నున్నవి. నీయుపదేశము నాకు సర్వవిధముల సమ్మతమైనది. నీవింత నిష్కళంకహృదయముతో నాకుఁజేసిన యుపకృతికి నిన్నెట్లు స్తుతింతును? నేఁడిదె మనఃపూర్వకముగా వందనమాచరించుచున్నదాను. నీమాటకు జవదాఁటను.

శోభ—ఇం కొక్క మాట. నీవు చీటికిమాటికి నిట్లు దీర్ఘాలోచనయందు నిమగ్నవై యుండక, దుఃఖపరవశవై బెగడొందక, ధీరత్వమును వహించి నీ మేనత్తకొమరునిఁ బరిణయమాడు విషయమై లెస్సగా నాలోచించుకొనుము. ప్రతిక్షణమం దాతనిప్రవర్తనము ను శోధించుచుండుము. ఆతనిఁబెండ్లియాడిన నీకు సౌఖ్యము చేకూరునో లేదో నిన్ను నీవే ప్రశ్నించుకొనుము. నీహృదయవాణిపలుకులను శ్రద్ధతో నాకర్ణింపుము. వానినే నమ్ముము. ఆ వాణి వెంకటపతినే వివాహమాడుమని చెప్పినవెంటనే కృతనిశ్చయవుకమ్ము. అప్పుడు నీపితతో నీమనోరథ మెఱిఁగింపవచ్చును. అట్లెఱిఁగించుటయు నీవుచేయుటకంటె వెంకటపతియేచేసిన మేలగును. ఇదియే మనసార నేనిచ్చు నుపదేశము. నేను నీ మంచినిఁగోరువాఁడను, మంచి యుపదేశమిచ్చితినని నీకువిశ్వాసమున్నచో దాని నాచరింపుము. లేనిచో నీయిష్టము చొప్పున నల్పుము.

అర—నీ యుపదేశవాక్యములు నామానసమున కెక్కినవి. తప్పక వాని ననుసరింతును. అని నీరు క్రమ్మిన కన్నులఁ జీరచెరఁగుతోఁ దుడిచికొనుచు గజరాజుదిరస్కరించు సుందరమందగమనము తో నింటిలోనికి గృహకృత్యముల నిర్వర్తించుటకుఁ బోయెను, శోభనాద్రిమాత్ర మచ్చటఁగొంతసేపువడయాడిమఱిపోయెను.

వీరికాపురములో శనివారమునాఁడు గొప్ప పశువులసంత జరుగును. నరసింహరాజు వ్యవసాయమునిమిత్తము కొన్ని పశువులఁ గొనదలంచి సంతకుఁ బయనమయ్యెను. అరవింద శాంతమ్మనుజూచి చాల దినములయ్యెను. నాఁడు తెప్పతెరలుపండువునకుఁ బోయినప్పుడు తప్ప మఱి చూడలేదు. కావున నామెయుఁ దండ్రిని వెంబడింప సిద్ధమైనది. వెంకటపతికిఁ జూడ: బోవలెనని యుద్దేశముకలదు గాని వ్యవసాయ

దారులవలె, ననాగరికులవలె సంతకుఁ బోవుటకు మనసొప్పకుంటచే నూరకుండెను. తండ్రియును గూఁతురును బయలుదేఱి వెడలిరి.

శోభనాద్రిరాజు తనగదిఁ జొచ్చి పండుకొనెను. వెంకటపతికూఁడఁ గొంతసేపు వృద్ధునికడఁ గూర్చుండి పొగచుట్టఁ గాల్చుకొనుటకు వీధియరుఁగుమీఁదికిఁ బోయెను. అప్పు డొకతరుణి వాని యెదుటికివచ్చి నిలిచెను. ఆమెను జూచినతోడనే యతని మోము వెలవెలఁబోయెను. మేని నిండ స్వేదోద్గమమయ్యెను. వెనుకనున్న గవాక్షములోనుండి శోభనాద్రి మేలుకొనియున్నాఁడో నిద్రించుచున్నాఁడో పరీక్షించెను. పిల్లులమోఁతవలె గుఱ్ఱు వినఁబడుటచేత నతఁడు గాఢ నిద్రయందున్నాఁడని నిశ్చయించుకొనెను. వానిమొగ మించుక తేఱుకొనెను. ఆ యువతీరత్నముతో “ ఇప్పుడేల వచ్చితివి ? గట్టిగామాటలాడకుము. ఈ యెదుటిగదిలో శోభనాద్రిరాజను నతఁడు పరుండియున్నాఁడు. అతఁడాపులించినఁ బ్రేవులు లెక్కించువాఁడు. ” అని మెల్లగననెను. ఆ కాంతామతల్లిక యిరువదేండ్ల యీడున నున్నట్లు కాన్పించుచున్నది. దీర్ఘమైనకాయముగలది. దబ్బపండువంటి మేనిచాయగలది. కట్టినపుట్టములు మిగుల విలువయైనవి. శరీరమునిండ మేలినగలను బెట్టుకొన్నది. సిగఁజుట్టుకొని దానియందు సువాసనగల పుష్పముల ధరించినది. పెదవులు లాక్షారసము పూయఁబడుటచేతనో, తమలపాకులు నమలుటచేతనో మంచి యారుణ్యమును వహించియున్నవి. చిఱుతవాటుగనున్న వదనసరోరుహమందు విరిసారుగలదు. చాంచల్యమైన చూపులలో హావములుగలవు. నిరంతరమును దేహమును జలింపఁజేయుచుఁ బయ్యెదను సవరించుకొనుచుఁ గర్ణకుండలముల కాంతినిఁ దిరస్కరించు కపోలయుగళియొక్కనైగనగ్యమును వెల్లడింప మాటలాడునప్పుడొకరీతినిఁ దలయూఁచుచు నుండెను. ఈ చేష్టలన్నియు జారిణీ లక్షణములు. ఆమె వానిమాటలాలించి కన్నులయందుఁగెంపుతోఁప మిగులభయముగాని

నాకేమిభయము. నన్ను మీరింత ద్రోహముచేసి వచ్చినందులకు మిమ్మే మిచేసినను బాపములేదు. అని బిగ్గఱగాఁ బలికెను.

వెంకటపతిరాజు కలఁతనొంది నపుమనకును గిటికీవంకఁ జూచుచు " మాలతీ ! నిన్ను బతిమాలెదను. నీవు మాత్రము బిగ్గఱగా మాటలాడకుము. ఇక్కడ గౌరవముగాఁ గాలక్షేపము జేయుచున్నాను. నాకు నలుగురిలోఁ దలవంపులు రానీయకుము. ఆ పెరటి గుమ్మముగుండ దొడ్డిలోనికిఁబోదమురమ్ము. అక్కడ మంచి పూవులుకూడ నీకు దొరకును. మన మేకాంతముగా సంభాషించుకొనవచ్చును. " అని పలికెను. మాలతి ' సరే ' యని వానితోఁ బెరటిగోడకిఁ బోయెను. శోభనాద్రి నిజముగా నిద్రపోవుచుండలేదు. గాఢనిద్రపోవుచున్నట్లు దొంగ గుఱ్ఱుపట్టి నటించుచున్నాఁడు. మొగముమీఁదఁ గప్పికొనిన పలుచని బట్టగుండ నాతఁడన్నియుఁ దిలకించుచునే యుండెను. వారి సంభాషణము తయును వినెను. వారు పెరటితోఁటలోనికి వెడలినతోడనే తానులేచి పిల్లివలె సద్దుచేయక యడుగులిడుచు గృహములోపలి దారిగుండ నుద్యానవనమును బ్రవేశించి వారాసీనులై యున్న పాదపమునకు సమీపముననున్న నికుంజము మాటున దాఁగియుండెను.



## ఎనిమిదవ ప్రకరణము.

### మాలతి.

వెంకటపతిరాజే మొదట సంభాషణము నిట్లు ప్రారంభించెను.

వెంక—మాలతీ ! నీవువచ్చినపని యేమో వెంటనే తెల్పుము.

మా—ఏమింత తొందర ? అయిన నే నెందుకువత్తునని మీయూహా ?

వెంక—ఇంకను ధనమే మైన లంకించుకొని పోవుదమనియా ?

మా—ఆఁ ! ఇఁకేమి ? అంతయుఁ గనిపెట్టితిరి ! ఎఱిఁగియుండియు న న్నేల యిట్లు ప్రశ్నించితిరి ?

వెంక—నీకును నాకును నాఁడే విడియాకులైనవికదా యింకను నన్నేల వేఁచుకొని తినియెదవు ?

మా—(క్రోధరక్తమ చెక్కుటద్దములయందుఁ దోఁప) విడియాకులా ? విడియాకులిచ్చుటకును మానుటకును మీయిష్టమే యనుకొం టిరా ? మీరు నన్ను సింహాచలపు దేవాలయములో గాంధ ర్వవివాహమాడినది మొదలు మీ యాజ్ఞ ననుసరించియే మె దలుచుంటిఁగదా ! మనకూడికనుగుఱించి యెవ్వరితోను జెప్ప వద్దని మీరనఁగా నటులే యాచరింతినిగదా ? మీపైఁగల మోహాతిరేకముచే మొదటఁ గట్టుకొన్నయాతనిని సైతము వి డిచిపెట్టితినే !

వెంక—'హుష్—హుష్.' అంతగట్టిగా నఱచెదవేల?

మా—నామాటలు మీకఱపులుగానున్నవా ? చాలునయ్యా. నన్ను లేవఁదీసికొనిపోవునప్పుడు పల్కిన కల్లబొల్లిపల్కులేమి ? ఇప్పు డీ వింతమాటలేమి ? నేను వెఱ్ఱిదాననై మీ రాడినదే యాట గను బాడినదే పాటగను దలఁచితిని. నల్లనివన్నియు నీళ్ళును దెల్లనివన్నియుఁ బాలు నని నమ్మితిని. మీరింత ద్రోహబుద్ధి తో నుందురని యెఱుఁగకపోయితిని. ఇప్పుడు నా బ్రతుకు 'ఉ భయభ్రష్టత్వ ముపరిసన్యాస మ' నునట్లయినది.

వెంక—ఇందుకు నా తప్పేమున్నది ? నీకును నాకును సంబంధములేద ని మూఁడుమాసములక్రిందనే చెప్పితిని. 'ముందు నాదారియె ట్లనుచు ... డిగినప్పుడు నాయొద్దనున్న ధనములో సగపాలు నీ

కిచ్చి నీతోఁ డెగతెంపులుచేసికొంటినిగదా ! ఇప్పుడు మరల నేమికారణమున నిచ్చటికి వచ్చితివి ?

మా—పెండ్లియాడినభార్యను విడిచిపెట్టుటకు నీ యిష్టమనుకొన్నావా? నాకాధారములేదు నన్ను వదలిపెట్టుమని నీవు నన్నుఁగోరఁగాఁ గొంతకాలమెడగలుగనుంటినిగాని, పూర్ణముగా వర్జింప నమ్మతించితినా ? నాకేయాధారమును లేకున్నదే ? నేనిప్పుడెందుబోవుదు ననుకొంటివి ? నాకన్నముఁబెట్టుటకు నీకు గతిలేదుగాని, యీ రవలదుద్దులు, బంగారుటుంగరములు, పట్టుబట్టలును గొనుటకుమాత్రి మెచ్చటినుండి సొమ్మువచ్చినదో ? సర్వమునకు నిన్నేనమ్ముకొనియున్న నాకు నీద్రివ్యములోఁ గొంచెమైన ననుభవించుటకు హక్కులేదా ?

వెంక—ఏల యీ చర్వితచర్వణము ? వెనుకటి సంగతులన్నియు నేల త్రివ్విపోసెదవు ? నిన్ను విడిచిపెట్టి నాకడనున్న ద్రివ్యము నీ కొసంగినప్పుడు నీ వేమంటివి ? ఇఁక నన్ను ధనము విషయమై శ్రిమపెట్టననియు, నే నెవ్వతెను పెండ్లియాడిన నభ్యంతరము చేయననియు, మన యీ స్వల్పకాల స్నేహాము మఱచిపోయెదననియు వాగ్దానము చేసితివిగదా ? తిరిగి నీ వీవితమున రాఁగతమేమి ?

మా—నీ విచ్చినసొమ్ము నా యావజ్జీవమును బ్రితుకుటకే ? ఏమిచోద్యమయ్యా ! నాకిచ్చిన ధనమంతయుఁ గలిపిన నీ వొక్కరాత్రి పువ్వుల వెంకటరత్నమున కిచ్చినంత లేదు. నీ మాయామాటలలోఁబడి పండువంటి సంసారమును బాడుచేసికొంటిని. ఇప్పుడు నాకుఁ గాసునకైన గతిలేదు. ఈనగలన్నియు మా పినతల్లి కూఁతురివి. నీ యంతవాని చెట్టఁబట్టి మెడలో దారములతోఁ దిరుగుట మంచిదికాదని యీ డంబపువేసమును వేసికొంటిని.

నే నిన్ని మాటలాడవలసిన పనిలేదు. నీవు నన్నుఁ బూర్తిగా విడిచిపెట్టఁదలఁచితివేని ముందు నాకు జీవనోపాధిఁజూపి మఱి క దులుము. లేనిచో నిన్ను నలుగురిలో నవమానించెదను. తెలిసినదా ?

వెంక—( ఏమిచేయుటకుం దోఁపక ) నా ప్రయత్నములనుగుఱించి చెప్పనా?—వాని నీమె కెఱింగింపక తప్పదు—అనియస్పష్టముగా నని, ప్రకాశముగా " నా నిజమైన యవస్థ నెఱిఁగియుండువే ని నీవు నన్నిట్లు బాధింపవు" అనెను.

మా—( పాముచెవులతో వాని యస్పష్టపుఁబలుకులు నయితము గ్రహించి ) రా. రా. నీ ప్రయత్నములేవో చెప్పుము. నాఁడు దుష్యంతుఁడు శకుంతలను పెండ్లియాడినరీతి నీవు నన్నాడితివని చెప్పితివిగదా ! అతనివలెనే భార్యను శోధింపవలెనని వివాహ విషయమును రహస్యముగా నుంపుమంటివా ? లేక యితరమైన దురుద్దేశముచేతనా ? పలుమాటలేల ? పుష్కలముగా ధన ముదొరకు మార్గమేదో చూపుము. నాకు ధనమే కావలెను. దోహిపవగు నీవక్కరలేదు. .

వెంక—మాలతీ ! నాకష్టములు భగవంతునికే యెఱుక. ఒక పెద్దయాశతో నిచ్చటనుంటిని. నీవు దానికడ్డమువచ్చిన నేమోకాని, లేనియెడలఁ దప్పక నెఱవేఱును. అది సిద్ధింపనిచో నేనూయియో గోయియో చూచుకొనవలసినదే. మరణముతోఁగాని నాకు మనశ్శాంతికలుగదు.

మాల—ఆయాశ యెందులకో ?

వెంక—గొప్పయాస్తితోనున్న మా మేనమామకూఁతును పెండ్లియాడవలెననునది. నీతోఁ గాపురముచేయుటవలనిలాభము. నాకు సర్వవిధముల హానియగుటయే. అట్టి తరుణములో నే నే

లమతి యోర్చును బరిణయంబై సుఖింపరాదు ? గతించినదాని
కేమి? మరల నీకేదో యాధారమేర్పఱిచి మఱి పెండ్లియాడెదను.
సమ్మతమేనా ?

మా—పనికిరాదు. పనికిరాదు. నా బుట్టను మసిఁబూసి నన్నెడఁబాసి
పోఁదలఁచుచుంటివా ? ముందెప్పుడో నాకేర్పాటుచేసెదవా ?
నాకేమియు సరిపడవు. ఇప్పుడు నీ 'జేబు' లోనున్న ధనమంత
యు నిచ్చివేయుము. నేను బోయెదను. ఇఁకనీజోలిఁ దలపెట్ట
ను. నాకింతే ప్రాప్తమనుకొందును.

వెంక—(ఎట్లులైన నామె వదలిపోవుటే యుచితమనియెంచి తనజేబు
నుండి పది బంగారునాణెములను దీసియిచ్చి) ఇవిగో! పదికాసు
లు. ఇంతకంటె నాయొద్ద నేమియునులేవు. చూచితివా (అని
చొక్కాయను దులిపిచూపెను )

శోభనాద్రి యిఁకఁదా నక్కడనుండఁబనిలేదని మెల్లమెల్లఁగా
నావలకుజాఱి తనగదిలోఁబ్రవేశించి యథాపూర్వముగా గుఱ్ఱుపెట్టి నిదు
రఁబోవుచుండి నట్లుండెను. వెంకటపతి మాలతిబాధను వదిల్చుకొని
యామెతో మరల దొడ్డిగుమ్మమునుండియే యావలకువచ్చెను. తోఁట
మాలులు మొదలగువారు తిండికై పోవుటచే నెవ్వరును వారినిఁ జూడ
లేదు. వెంకటపతి మాలతిని సాగనంపి 'బ్రతికినానురా. పిశాచపుముం
డ వదిలినది. భగవంతునిదయవలన మమ్మెరును గానలేదు' అని య
నుకొనుచు గృహముఁజొచ్చెను. శోభనాద్రి యప్పుడే మేల్కాంచినట్లు
నటియించెను. వెంకటపతిరాజున కాతనిమోమునందేమియు మార్పు
కానుపట్టలేదు. సాంజవేళకు నరసింహరాజు సంతలోఁ బశువులనుగొని
కొమార్తెతో నిలుసేరెను. శోభనాద్రి వెంకటపతిరాజునుబిలిచిఁ ఓయి !
సాయంతనమైనది. కొంతదూరము నడచి వత్తుమురా' యని తీసికొని
పోయెను. వారు పొలాలగట్లవెంబడిఁబోవుచు నిట్లు మాట్లాడుకొనిరి.

శోభ—నీవీమధ్య విశాఖపురికిఁ బోయెదవా?

వెంక—తాతా! అప్పుడే యీ యూరిని విడిచిపెట్టఁదలఁచుకొనలేను. ఏల యట్లడుగుచున్నావు?

శోభ—మఱేమి లేదు. నేనుగొన్ని ముఖ్యమైన పత్రములను నా స్నేహితులకుఁ బంపఁదలఁచితి. వానిని బ్రతివానికి నీయఁవీలు లేదు. నీవంటి విశ్వాసార్హునిచేతనే పంపవలెను. ఒకవేళ నీవు పోయెదవేమో వానినిచ్చెదమని యట్లడిగితిని.

వెంక—ఓ. అట్లయినఁ దప్పక వెడలివచ్చెదను. నీపని నెఱవేర్చుటకంటెను నాకుఁ గర్తవ్యమేమున్నది?

శోభ—అయ్యో! నీకు శ్రమయేమో? నాకొఱకే వెడలెదవా?

వెంక—నీకొఱకే నాకేమియుఁ బనిలేదు. నీవంటివాని కుపకారముఁ జేయుట శ్రమయా? నాయందంత ప్రేమవహించి, పన్నంత గౌరవముతోఁ జూచుచున్న నీకీమాత్రపు నాయము చేయరా? నన్నెప్పుడు బయలుదేఱుమందువు?

శోభ—సోమవారమునాఁడు.

వెంక—సరే. సిద్ధముగానుండెదను.

శోభనాద్రి సంతసమందెల్పెను. వెంకటపతి వానిని మెప్పించి తిఁగదాయని గర్వంపుఁజూపులఁ జూచుచుండెను.

శోభ—నీవు నాకొఱకుఁ బోవుచున్నట్లు మీ మామగారియింట నేవారికిని దెలియరాదుసుమీ. మఱేమియు ముఁగాదు. నాకది యొకవెఱ్ఱి. ఎవరిపద్ధతి వారిది. నీవుమాత్ర మెవరితోఁ జెప్పకుము.

వెంక—నాకేదోపని యున్నదని యనృతము పలికెదను. నాకైతే నసత్యమాడుట యలవాటులేదుకాని, నీకొఱకేమి చేయుమనిన దానిని జేయ సంకల్పించుకొంటిని.

శోభ—మిక్కిలి నే నెఱుఁగనా? అన్నియుఁ దెలిసియుండియే యీపని

నీకు వదలిపెట్టితిని. నీవలె సమయస్ఫురణముగలవారు మఱియొక
రుగలరా?

ఈవచనములయందలిధ్వని యామెయందునకుఁ దెలియలేదు. ఉపరి నవియన్నియుఁ దన్నుఁగూర్చి స్తోత్రములనియే భావించెను. వారు లోకాభిరామాయణమును జెప్పుకొనుచుఁ గొంతదవ్వుచని మరలివచ్చిరి. రాత్రిభోజనములవేళ యయ్యెను. అందఱును లేచిరి. వెంకటపతి మధ్యరంగమున 'మామా! నే నెల్లుండి విశాఖపురము వెడలవలసియున్నది. కొలఁది దినములుమాత్రమే యచ్చటనుండి మరలివత్తును.' అని చెప్పెను. 'ఓరీ! పల్లెటూరిజీవనమప్పుడే బరువై పోయినదా?' యని నరసింహారా వడిగెను. అరవింద నిశ్చేష్టురాలై యూరకుండెను. వెంకటపతి 'మామా! ఇంతలోనే భారమగునా? నీయింట నెన్నినాళ్ళున్నను దనివి తీఱునా?" యని యరవిందవైపునఁ జూచెను. ఆమె మొగమునందలి విన్నఁదనమాతనికిఁ బొడఁగట్టెను. శోభనాద్రి ''వెంకటపతీ! ఇందాఁక మీమామగారు వీరపురికి వెడలినతరువాత వచ్చిన లేఖలనుబట్టియే కాఁబోలు నింతవేగముగాఁ బ్రయాణనిశ్చయముం జేసితివి?" యని సమయస్ఫూర్తిగా వచించెను. వెంకటపతి వాని తెలివితేటలకలరి ''అవును. తాతా" యని బదులుచెప్పెను.

మఱుచటిదినమున వెంకటపతిరాజెట్లయిన నరవిందతో సావకాశముగా మాటలాడి మఱి పోవలెనని నిశ్చయించి యామెయుద్యానవనమునకుఁబోయినఁ దానుకూడ వెన్నాడిచనియు, నామె తనగదిలో సవరించుకొనఁబోయినఁ వెంబడించియుఁ బ్రయత్నముఁ జేసిచూచెను. కాని ప్రతిపర్యాయమును శోభనాద్రిరాజే సైంధవునివలె నడ్డువచ్చుచుండెను. అతఁడానాఁడు వెంకటపతి నొక్క నిముసమైన నెడఁబాయకుండెను. సోమవారమునాఁడుదయమున వెంకటపతిరాజు ప్రయాణమునకు సర్వము నాయత్తముచేయఁబడెను. అతఁడు బండియెక్కఁబోవుట

తనగౌరవమునకు లోపము తెచ్చుకొనుటయని మునుపటివలెనే పల్లకిలోఁ బోవుటకే స్థిరపఱుచుకొనెను. జామునావద్దెక్కినపిమ్మట బయలు దేఱఁ దలఁచుకొని పెందలకడ భుజించెను. శోభనాద్రి వెంకటపతినిఁ దనగ దిలోనికిఁ బిలిచి యొకకమ్మయుఁ బది బంగారునాణెములును జేతిలోఁ బెట్టి 'బాబూ! ఈసువర్ణములు నీకు దారియందలి వ్యయమునకిచ్చితిని. నీవు నిరాకరింపకుము. తప్పులేదు. ఈకమ్మను భోగరాజు కామేశ్వర రావుగారనునొక న్యాయవాదికిమ్ము. అతఁడు సముద్రపుటొడ్డుననున్న మేడలలో నొకదానియందు నివసించును. అందు ముంగిట నతనిపేరొక బల్లమీఁద వ్రాయఁబడియేయున్నది. ఇల్లువెదకుటకై నీవు శ్రమపడ నక్కఱలేదు. నీవీకమ్మ నతనికొసఁగి ప్రత్యుత్తరమునిచ్చువఱకు దయ యుంచి యాగినచో నతఁడు చెప్పినచొప్పునఁ జేయుము.' అని చెప్పెను. వెంకటపతి 'తాతా! ప్రయాణపువ్యయము నీవు వహింపనేల?' యని యొకమాఱని వానిని 'జేబు' లోనుంచికొని 'నీవుచెప్పిన ప్రత్యక్షరము ను నెఱవేర్చుకొనివత్తును. సెలవిమ్ము' ని యీవలకువచ్చెను. ఎట్లైన నరవిందతో నొక్కసారి మాటలాడిపోవలెనని యత్నించుచుండెను. కాని శోభనాద్రి యతనిని విడిచిపెట్టలేదు. అరవిందకు శోభనాద్రిపైఁ గోపమువచ్చినది. కాని సాహసించి యేమియుననలేదు. వాఁకిటఁ బల్ల కియు వాహకులును నిలిచిరి. ప్రొద్దువోయిన మార్గమధ్యమందుఁ బ్ర యాసపడవలసివచ్చునను భయముచే నతఁడు బయలుదేఱెను. వెడలు నప్పుడు 'అరవిందా! పోయివచ్చెదను. తాతా. సెలవు.' అనిమాత్రము పలికి మేనమామతో సంభాషించుచు నూరివెలుపలవఱకు నడచి యేగె ను. వారు నిర్గమించినవెంటనే శోభనాద్రి యరవిందతో 'బిడ్డా! ఇప్పు డు నీతో నొకముఖ్యవిషయమునుగూర్చి ముచ్చటించెదను. వినుము' అనెను. అతఁడు బిడ్డాయని సంబోధించుటలో నర్థములేకపోలేదు.

అర—నీ కెల్లప్పుడేదో చెప్పుటకుండును—అని పండ్లసందుననుండిపలికెను.

శోభ—వెఱ్ఱిపిల్లా ? నీయాశలన్నియు నేను భంగముం గావించుచున్నా
నని కాఁబోలు నీవు తలఁచుచున్నావు ?—అని యామె మొగమురీ
తిఁ గనుంగొని చెప్పెను.

అర—వాస్తవమే. నీవేల నన్ను గూర్చి యనవసరముగా జోక్యము గ
లుగఁజేసికొనుచున్నావు ? అంతయధికారము బైనవేసికొను
టకు నీవెవ్వఁడవు ? ఎందుకు నీవు ప్రతివిషయములో నడ్డము
వచ్చెదవు ?—అని కోపమాపుకొనలేక పలికెను.

శోభ—నే నెవఁడనా ? నీబాగును గోరువాఁడను. అని యామెవంక
నిశ్చలవీక్షణములఁ జూచెను. ఆచూపులలో నేమిమహిమ యున్నదో
కాని వెంటనే యరవింద మనసుమాఱిపోయెను.

అర—అవును. నీవు నాబాగును గోరువాఁడవే. నాఁడు నీవు నాకుఁజేసిన
సదుపదేశమునకుఁ గృతజ్ఞురాలను. నిన్ను నోనాడినందులకు న
న్ను మన్నించి ముందుగతి యెటులుండునో నాదారి యేదో
తెలుపుము.

శోభ—నేను దెలుపనక్కఱలేదు. నీయంతర్వాణి నీలోపల వచియించి
యేయుండును అయినను జెప్పెదను. నామాటలు నీకుఁ గష్ట
ముగాఁ దోఁచునేమో ? కానిమ్ము. చెప్పకతప్పదు. వెంకటప
తిరాజు నీకుఁ బతియగుటకుఁ దగఁడు.

అర—అతఁడు కొంతకాలము దుర్వృత్తియందుఁ జరించెనని నేనును
వింటిని. కాని యది యెంతవఱకు నిజమో తెలియదు. వాని
యం దీమద్దోషముండ, లోకులు దానినతిశయోక్తిగాఁ జెప్పియుం
డవచ్చునని నాయభిప్రాయము. మఱియు—

శోభ—నీయుద్దేశ మటులున్న సత్యమెఱిఁగించెద. వీనులొగ్గివినుము.
నీహృదయమును వినిర్మలముగా నుంచుకొనుము. వెంకటపతి
దుర్గుణములన్నియు లోకులెఱుఁగరు. ప్రజలయభిప్రాయమున

కుమించిన దుష్టత్వము వానియందుఁగలదు. నిన్నను నేఁడును వానిని విడువకుండ, నీతో సంభాషించుట కెడగలుగనీయకుఁ డ వెన్నాడి తిరుగుచుంటిని. నీవు చూచియేయున్నావు. సర్ప తుల్యమగు వానిజిహ్వానుండి యొక్క పలుకైనను నీ చెవినిఁబడు ట నాకిష్టములేదు. చండాలసన్నిభుఁడు వాని శరీరము నిన్నుఁ దాఁకి నీ పరిశుద్ధదేహము నపవిత్రపఱుప నేనొల్లను. అఁతడి దివఱకే పెండ్లియాడెను. నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము.

అరవింద ముఖచంద్రమండలమునఁ గత్తివాటునకైన రక్తములే దు. "తాతా నిజమేనా ? పెండ్లియాడెనా ? మెడలోజన్నిదపుఁబోఁ చ యొక్కటే యున్నదే ? " యని యద్భుతపడి యడిగెను.

శోభ—వాఁడు మహా ధూర్తుఁడు. పెండ్లియన మంత్రములతో నం దఱికివలెఁ గాలేదు. అతఁ డొకయువిదను లేవనెత్తుకొని వచ్చి సింహాచలపు దేవళంబున గాంధర్వవివాహమాడెనఁట. ఒకరి నొకరు విడువమని శపథములుచేసికొన్నారఁట. కాని కొంతకాల మైనపిమ్మట వారిద్దఱికిఁ జెడినది. ఇప్పు డొకరికొకరికిఁ గిట్టుట లేదు. నీవు వానిని ప్రేమించి వివాహమాడుట, ఆవల వాని దుశ్చరితము వెల్లడియగుట, అప్పు డన్యోన్యమును వాదులాడు ట, నే ననవసరముగా మధ్యవర్తినై వాని గుట్టును బయటఁ బెట్టుట, కడపట నీవు పశ్చాత్తాపమొంది బ్రతుకుపై రోయుట నాకు సమ్మతికాక వాని కొకపనిఁగల్పించి విశాఖపురికిఁ బంపి తిని. ఇఁక వాఁడు రాఁడు. అందునకుఁ దగిన కట్టుదిట్టములఁ జే సితిని. నీకు వానిపైఁగల ప్రేమనువచింపక, క్రమముగా నీజ నకునితో వాని దుష్ప్రవర్తనముంగూర్చి యంతయుఁజెప్పి, వా నియందతనికి నేవఁగల్గింతును. నీవుమాత్రము వానిపైనున్న బు ద్ధిని మరలించుకొని శాంతచిత్తముతో నుండుము.

అర—ఆహా ! తాతా ! నాకెట్టి మహోపకారముం గావించితివి ? నీ వచ్చుపడనియెడల నే నకారణంబ వాని మాయలలోఁ బడిపోయియుందును. లోకములో మహాపకీర్తికిఁ బాత్రలై పోయి యుందును. భగవంతుఁడు నన్ను రక్షించుటకుఁ బ్రత్యేకముగా నిన్ను దూతఁగాఁ బంపియుండవచ్చును—లేనిచో నీకు నాపై నిట్టియవ్యాజప్రేమయేల కలుగవలయును. ఈ చరిత్రయంతయు వినిన తరువాత వాఁడు వెడలిపోయినాఁడని యుండెడు విచారమంతయుఁ బటాపంచలైపోయినది. విశేషించి హృదయమునందు వచింపరాని సంతోషమును సౌఖ్యమును గలుగుచున్నవి.

శోభ—బిడ్డా ! ( అని దగ్గఱకుఁదీసికొని పుత్రికావాత్సల్యముతోఁ జుంబనముఁజేసి ) నీమాటలు నా మనంబునకుఁ బరితృప్తి నిచ్చినవి. నీహృదయము నాకుఁ జక్కఁగా నెఱుకపడియెను. జగత్తున స్త్రీ లబలలని పిలువఁబడుచున్నారు. కాని వారి మనములు దుర్భేదములైయున్నవి. పరేంగితజ్ఞానధురీణులునైతము ప్రౌఢకాంతల హృత్పేటికా గతాభిప్రాయముల నెఱుఁగలేరు. కాని నీవందఱవంటిదానవుకావు. నీయంతరంగమును గప్పియున్న దొక కాచఫలకము. దానిగుండ నెట్టివాఁడైన నీ యింగితమును గ్రహింపఁగలఁడు. నీవమాయకురాలవగుటచే నొక్కొకతఱిఁ బొరపడినను, సహజసౌశీల్యముకలదానవగుటచేఁ బొరపాటులను సుకరముగా సవరించుకొనుచున్నావు. తల్లీ ! ఇఁక నీవు స్థిరచిత్తముతో నుండుము. నీ యంతరంగమందున్న వెంకటపతిప్రతిమను బాఱఁదోలుము. గతించినదానికి వగవక, నీముఖకమలమును ముకుళింపనీయక, సదా వికాసస్థితియందే యునిచి నీ ప్రియజనకునకు ముదముంగూర్పుము. (లికిఁ బోయెను.

అర—తాతా ! నాకు సాధ్యమైనంతవఱకు కటుతేచేసెదను—(అని లోప

## తొమ్మిదవ ప్రకరణము.

### సోదె.

వెంకటపతిరాజు చంద్రమపాలెమును విడిచిపెట్టి యొక మాస మైనది. అతఁడు మరల రాలేదు. కుశలవార్త దెలుపలేదు. వాఁడు కొలఁదిదినములలో మరలివచ్చెదనని చెప్పి వెడలి యింకను రాకపోవుటకుఁ గారణము తెలియక నరసింహరాజు కలఁతపడుచుండెను. ప్రభాకరుఁడుండిన నతని కింతమనఃక్లేశముండకపోవును. వాని జాడయు నేమియును దెలియలేదు ఒకనాఁడు మధ్యాహ్నము నరసింహరాజు మేనల్లునిఁగూర్చి తలపోయుచుఁ గూరుచుండియుండఁగా శోభనాద్రివచ్చి యతని తలపోఁతకు హేతువుగనుగొని వెంకటపతియొక్క దుర్వ్యాపార మంతయు నివేదించెను. అందునుగుఱించి తన కెట్లుతెలిసెనో మాత్రము చెప్పలేదు. నరసింహరాజంతయు విని ఖేదమందెను. "అయ్యో మాణిక్యము వంటి కుఱ్ఱవాఁడు వ్యర్థముగాఁ జెడిపోయినాఁడే. వాని బుద్ధి తిన్నఁబడినది. ఇఁక భయములేదని సంతసించితిని. ఇంత దుర్మార్గుఁడనియు నింతమోసగాఁడనియు నెఱుఁగను. మన మేమిచేయఁగలము. వాని కర్మఫలము వాఁ డనుభవించును." అని యూరకుండెను. అరవింద తన వాగ్దానమును నిలుపఁదలఁచి చేతనైనంతమట్టునకు వికసితాననమే తండ్రికిఁ జూపుచు మనోగతదుఃఖమును గప్పి పుచ్చుచుండెను. శోభనాద్రి "అమ్మా! నీ మనసునుండి వెంకటపతిప్రతిమను బాఱఁదోలు" మని చెప్పెను. కాని యది యెట్లు సాధ్యమగును? ఈ వెంకటపతి ప్రతిమ, పసితనమునుండియు నామె హృదయపీఠము నాక్రమించుకొనియున్న మఱియొక చక్కని ప్రతిమను దోసిపైచి యాస్థానమందు స్థిరముగా నెలకొని యున్నదే! అదియును గాక యామె యేమి యపాజ్ఞరాలా?

కాదు. కొంచెము చాంచల్యము తప్ప నామెయొద్ద నేలోపమును లేదు. దానిని వెడలఁగొట్టుట యామె తరమా ? మసిబొట్టా తుడిచివైచుటకు ? ఐన నామె శక్తివంచన లేకుండఁ బ్రయత్నము చేయుచున్నది. క్రమముగాఁ జాంచల్యమును జయించుచున్నది. త్వరలోఁ దన నూతనలబ్ధ చిత్తస్థైర్యముచే సాదుష్టపరిణామాగ్రహమును దఱిమివైచునని మనము నమ్మవచ్చును.

వెంకటపతి వెడలినతరువాత నీ నెలదినములలో శోభనాద్రికిఁ బ్రతిదివసమున నెన్నియో లేఖలు వచ్చుచుండెను. అనుదినమును భటులు వచ్చుటయుఁ గమ్మలందిచ్చుటయు వారి కీతఁడు వారితోషికములనిచ్చుటయుఁ జూచి యరవిందానరసింహరాజు లాశ్చర్యమగ్నులగుచుండిరి. మఱియుఁ దన యాజ్ఞల శ్రద్ధతో నెఱవేర్చుచున్నందులకు నరసింహరాజు సేవకులకుఁ బెక్కు-సారులు బహుమానములక్రింద నెంతో ధనము వ్యయపఱచు చుండుటచే వాని చరిత్ర యరవిందాదుల కత్యద్భుతముగాఁ దోఁచెను. అఁతఁడు తన బీదతనమును గూర్చి యరవిందతో నప్పుడప్పు డనుచుండెడునుడు లిప్పుడు వినఁబడుటలేదు. అతఁడు చంద్రమపాలెమువచ్చి నాల్గునెలలయినను భారముగాఁ దోఁచుటలేదు. నరసింహరాజాదులు వానిని దమ సమీప బంధువుగనే భావించుచుఁ జిరకాలమునుండి తమయింట నుండుచున్నటులే తలఁచుచుండిరి గాని మాసచతుష్టయముక్రింద వచ్చెనని పరుఁడని యనుకొనకుండిరి. ముఖ్యముగా నరవింద తన కాతఁడిచ్చిన యమూల్యోపదేశముచే నతనిఁ దన పితృసమానునిగాఁ జూచుకొనుచుండెను.

నరసింహరాజొకనాఁడు పీఠికాపురమునుండి వచ్చి చావడిమీఁదఁ గూరుచుండి యరవిందతో గృహకృత్యములగురించి యేదో మాటలాడుచుండ శోభనాద్రిరాజు వచ్చి యిట్లు పలుకరించెను.

శోభ—నరసింహరాజుగారూ ! పిఠాపురపు వింతలేమి ?

నర.—ఏమి యును లేవుగాని, యీ దినమున మీరును మా వెంకటపతి యుఁ జూడనేగిన కాండ్రేగులకోటకు సాధారణపు సంసారి యొ కఁడు కొన్నాఁడఁట. వాని పేరుమాత్రము తెలియలేదు. అ తఁడు రేపుసాయంకాలమునకుఁ ద్రాక్షారామమునకువచ్చి శ్రీ భీ మేశ్వరస్వామివారి దర్శనముం జేసికొని యెల్లుండి యుదయమునఁ గాండ్రేగులఁ జేరునఁట. ఉద్యోగస్థులప్పుడే నియమింపఁబడిరఁ ట. క్రొత్త యధికారినిఁ జూచుటకు జనులు తండోపతండములు గఁ బోవుచున్నారు. కాండ్రేగులలో నేదో గొప్ప యుత్సవము జరుగుననియు సర్వజాతులువారికిని సంతర్పణములు చేయఁబడు ననియుఁ దెలిసి పెక్కు రచ్చటికిఁ జనుచుండిరి.

శో.భ.—అలాగునా? వానిపేరు తెలియలేదా? అతఁడు ప్రాయశః విశాఖపురివాఁడై యుండును. ఏలయన నీమధ్య నొక న్యాయ వాది, విశాఖపురి కాపురస్థుఁడు కాండ్రేగులకుఁ బోయినట్లును సర్వమును బరీక్షించి బేరముసరిచేసికొని వెడలినట్లును నాకుఁ దెలిసినది. ఆన్యాయవాది నూతనాధికారిచేఁ బంపఁబడినవాఁ డై యుండవచ్చును. [వత్తమా?

నర.—మనము కూడఁ నాయూరికిఁబోయి యీ జమీందారునిఁ జూచి

శో.భ.—పిలువని పేరంటమునకుఁ బోవనేల? మనల నాహ్వానముం జే సినఁ బోదము. లేనియెడల వలదు.

నర.—వారు మనల నాహ్వానము చేయుదురా? మనమెవరమో వారి కేమి తెలియును? మన యవసరము వారికేమిగలదు?

శో.భ.—వారి యవసరము మనకేమిగలదు? మీరెంత చిన్నగ్రామము లో నివసించువారైనను, మీపదాన్యత తెలుఁగుమండలమంత యు వ్యాపించినది. మిమ్ములఁ దప్పక సగౌరవముగాఁ బిలుతు రు. అప్పుడు పోదము లెండు.

నరసింహరాజు 'సరే' యని యూరకొనెను. మఱునాఁడు శ్రావణమాసమందలి ప్రథమ సోమవారము. అరవింద మంగళవారమునాఁడు నోమునోఁచికొనును. ఆ వ్రతమునకుఁ దన పినతల్లి కూఁతునుకూడ దీసికొని రాఁగోరి యరవింద పిఠాపురమునకుఁ బ్రయాణ మయ్యెను.

శ్రావణమాసమందలివ్రతములు వివాహితలే చేసికొందురు. కాని కొందఱు కన్యలుకూడ ముచ్చటకొఱకుఁ దమ తల్లిదండ్రులవద్దఁ గాసులు వరాలు పుచ్చుకొనుటకు వ్రత మాచరించు వాడుక కలదు. అరవింద కానుల కొఱకుఁ గాక పోయినను, ఇరుగుపొరుగు బ్రాహ్మణకన్యలు చేసికొనుటఁ జూచియుఁ దన కిప్పుడేమియుఁ గాలక్షేపము కాకుండుటఁ జూచియు నీ నోమును నోఁచికొని శాంతమ్మతోఁ గొంతకాలము వెడలఁబుచ్చ వచ్చునని నిశ్చయించినది. ఆ కాలమందుఁ బొలములకు మున్నులై యుండుటచే బండిదారి కట్టివేయఁబడెను. రాజమార్గమునఁ బ్రవేశించువఱకు కొకయఱకోసు దూరమందఱును నడచిపోవలసియుండెను. అరవిందను జనకుఁడు "సవారి" యెక్కి పొమ్మనెనుగాని యామె యొంటరిగాఁబోవుట కిష్టపడక శోభనాద్రిరాజును గూడఁ దనతో రమ్మని కాలినడకను బయలుదేరెను. రాజమార్గమునఁజొచ్చినతర్వాత శకట మారోహింప నేర్పాటుచేసికొనెను. వారిరువురు పాదచారులై యూరివెలుపలికిఁ బోవునప్పటికచ్చట నొకచింతచెట్టుక్రింద మనుష్యులు గుంపుగూడి శ్రద్ధతో నేమియో యాలకించుచుండుట వారికిఁ బొడఁగట్టెను. అరవింద "తాతా! ఏ మాగుంప" ని శోభనాద్రినడిగెను. అతఁడు చూచి వచ్చెదనని చెప్పి యామెను నిలిపి తా నాగుంపునడుమకుఁబోయి కొంతతడవాగి వచ్చి "అమ్మా! ఒక కయెఱుకత సోదెచెప్పుచున్నది. ఆమె చెప్పు వాక్యములు చాల నిదర్శనములుగా నున్నవఁట. అందుచేత జనులు తమ యదృష్టముం దెలిసికొనుటకు గుంపులుగుంపులై వచ్చుచున్నారు.' అని వచించెను.

అర—ఇంతియేకదా ! రా. పోదము.

శోభ—పోదముగాని నీకు సోదెయందు నమ్మికకలదా ?

అర—నాకేమియు విశ్వాసములేదు. "కోతివిద్యలు కూటికొఱకే" యని పెద్దలందురు. వారలీరీతి జనుల భ్రమపెట్టి మోసము చేసి పోవుచుందురు.

శోభ—పోనిమ్ము. ఎప్పుడైన నీవు సోదెను జెప్పించుకొంటివా ? నీకంత విశ్వాసములేకపోవుటకుఁ గారణమేమి ?

అర—చిన్నతనాన నాకును బ్రబోధయందు నమ్మకముండెడిది. ఒకనాఁడొక యెఱుకసాని నా యఱచేతినిఁ జూచి నా భవిష్యచ్చరిత మంతయుఁ జెప్పెదనని నన్ను భ్రమయఁజేసి నానలన నొక పాతచీరఁగొని యేవో యసంబద్ధ ప్రలాపము లాడినది. అప్పటి నుండియు వాండ్రు మోసకత్తియలనే నాయభిప్రాయము.

శోభ—అది నీభావిజీవితమునుగూర్చి యేమి పలికినది ?

అర—ఏమని చెప్పుదును? నేనొక దివ్యభవనమునందుఁ గాపురముండెదనఁట. దాసదాసీజనములు సదా యడుగడుగులనై నాయొంట నుందురఁట. నేనమూల్యరత్నాభరణాలంకృతనై, బహుజనోపకారిణినై, యనేక సత్రపాఠశాలాసంస్థాపకురాలనై, విస్తారరాజ్య సంపాదకురాలనై, దిగంతవ్యాప్తకీర్తిసంపన్నురాలనై, సమధిక భోగానుభవయోగ్యనై చిరకాలము భూమిపై నుందునఁట—అవన్నియు నసంభవములు కావా?

శోభ—అసంభవములని మనమెట్లు చెప్పఁగలము ? ఆ పరాత్పరునిసంకల్ప మట్లున్నదేమో ! తల్లీ ! నీ విశ్వాసమెట్లున్న నింకొకతూరి నీ హస్తమును జూపించుకొనుము. నీభావిజీవితము నీ యెఱుకత నోటినుండి వినవలెనని నాకు వేడుకగా నున్నది.

అర—తాతా ! నీకేమి వెఱ్ఱియా ? నాకు నమ్మకములేనిదానియందుఁ బ్రవేశింపుమనరాదు. నీవు నాకు నొప్పిఁగల్గించినవాఁడవౌదువు.

శోభ—అమ్మా ! నాముద్దు చెల్లెంపులా ! నేను మీయింటనిఁక నెన్నియో దినములుండను. రేపో యెల్లుండియో నా నాథుని నేఁబోయెదను. కావున నాకోరికను నిరాకరింపకుము.

అర—(ఆత్రముతో) ఇదేమిటి ? తాతా ! నీవొకటి రెండు ' రోజు ' లలో వెడలిపోయెదవా ?

శోభ—అమ్మా ! మీ రెన్నాళ్లున్నను నలనను. మీయౌదార్యమట్టిదే. కాని నాకుమాత్రమిఁక మీకుఁ గష్టము కల్పింపవలెనని లేదు.

అర—నీ యునికి మాకేమియు గష్టముగాలేదు. విశేషించి మాకు నీ వలననే కాలక్షేపమగుచున్నది.

శోభ—నిజమే. మీయిద్దఱకు నాయందంతదయకలదు. నే నెఱుఁగుదును.

అర—ఎఱిఁగియుండియు నేలపోవ యత్నింతువు ?

శోభ—అమ్మా ! మీకు నేనిదివఱలోఁ గల్గించినకష్టములు పెక్కులు గలవు. మీచేత నెంత యుపచారముఁ జేయించుకొంటిని ? ఎన్నిసారులు మీతో నడ్డదిడ్డముగా భాషించితిని ? ఎన్నిపర్యాయములు విసుగుకొంటిని ? మీయుండఁ జేరినవాఁడనయ్యు నెన్నిమాటలు మీయందలక్ష్యముఁ జూపితిని ? మీకు నేనుజేసిన సాయము లేదు. మీవలన నేనుమాత్రమమితసాహాయ్యమును బొందితిని. ఎల్లకాలమిటులే మీకు భారము కల్గింపనా ?

అర—అవన్నియు మఱచియేపోయితిమి. నిన్ను మాకుటుంబములోఁ బెద్దవానిఁగా భావించుచున్నాము. కాని, నీ ప్రయాణమును గూర్చి మానాన్నగారికేమియుఁ దెలియదు కాఁబోలు.

శోభ—తెలియదు. ఈరాత్రియో రేపో చెప్పవలెననుకొనుచున్నాను.

అర—నీవెచ్చటికిఁ బోయెదవు ?

శోభ—ఎచ్చటికిఁబోదును ? నా యింటికే—యది యిల్లనిపించుకొ నినయెడల పోయెదను—ఒకవేళ నూతన సంఘములో నివసింతు నేమో !

అర—నీయిల్లనినఁ జంద్రమహాలెములో నున్నదేకదా. ఇఁక నచ్చటఁ గొత్తలెవరు ?

శోభ—బిడ్డా ! నీమంచితనమట్టిదే. నేను బోకతప్పదు. దానికేమిగాని నాముద్దుచెల్లించి యొకసారి యీ యెఱుకసానిచేఁ జేతినిఁ జూపించుకొనెదవా లేదా ?

సరియే. నీకోరికఁదీర్చుటకైన నొడఁబడెదననుఁ అని యాతనితో నెఱుకత సమీపమునకుఁ బోయెను. శోభవాది మూక నొకపక్క కొత్తిగించియెఱుకచెప్పఁదానితో « అమ్మా ! మాపిల్ల చేయిచూచి యున్నదున్నట్టుగాఁ జెప్పఁగలవా ” యనెను. అదియు « నాకొకమంచిచీరఁ గొనిపెట్టితిరేని తప్పకచెప్పెద ” నని మార్గ్వాలికి యున్నయడనున్న మనుజులను దూరముగాఁబొమ్మనెను. ఎవరో గొప్పవారు వచ్చిరని తెలిసికొని జనులావలకుఁ బోయిరి. ఎఱుకసాని యరవిందహస్తము నందలి రేకలను బరీక్షించి యొక పుల్లను జేతఁబట్టుకొని యిట్లుచెప్పఁదొడంగెను.

అర—« ఓ అవ్వో, అవ్వ. నీ అదృష్టంఅంతా చెపుతా వినవమ్మ. మేలుగలుగుతుంది, బాగ్గెం గలుగుతుంది. మేడలుకడతావు. మిద్దెలుగడతావు. దానాలు సేత్తావు. దర్మాలుసేత్తావు. నగలెట్టుకొంటావు సొమ్ములెట్టుకొంటావు. గొప్ప రాజ్జెంకలుగుతుంది. రాణివౌతావు. ”

ఈమాటలు విని యరవిందకు నిర్వేదము కలిగెను. వెనుకటిబో యదియు నీపలుకులే పలుకుటచే నండఱు వీనిని వల్లెవై చుకొనియుం దురనుకొని కరము నీవలకు లాగికొనఁబోయెను.

శోభ—“ అమ్మా! తొందరపడకుము. అది చెప్పునదంతయు విని పిమ్మటఁ బోవుదము. ఉండు ’ మని యాపెను. మరల నది యిట్లు సోదె నేకరువుపెట్టమొదలిడెను—“ అమ్మా, తొండ రపడకమ్మ. ఇదుగో దాన్యరేకమ్మ. ఇదే దనరేకమ్మ. ఇదిసం తానరేకమ్మ. ఇది ఆయువురేకమ్మ. నీకన్నీ బాగున్నాయమ్మ. నీకు నూఱుమంది బలగంవుంటారమ్మ. నిన్ను చిన్నప్పటినుంచీ ఒక రాచకుఱ్ఱోడు వలచాడమ్మ. నువ్వుకుట్టుదానవవుటచేత వాడి మంచిని గెయిం చావుతావమ్మ. వాడ్ని తోసేతావమ్మ. వాడు బెంగెట్టుకొని దేశాలమ్మట పోయినాఁడమ్మ. నీకో మేన త్త కొడుకున్నాడమ్మ. వాడు పోకిరీయమ్మ. వాడి వలలోపడి వాడ్ని వలచావమ్మ. కానినీకు వాడు మొగుడుకాడమ్మ. కొద్దిరోజులలో నీవు రాణివౌతావమ్మ. నిన్ను మొదటవలచిన వాఁడే నిన్ను పెండ్లాడతాడమ్మ. నువ్వ కొడుకులు, కూతుళ్ళు కని నూరేళ్ళు భూమిమీఁదబతుకుతావమ్మ. గుళ్లు గోపురాలు, సత్రాలు సావిళ్లు కట్టిత్తావమ్మ. అప్పుడు మాలాంటి బీదోళ్ళ ను మఱచిపోకమ్మ. నాకుగట్టిచీరెట్టమ్మ. పున్నెంగల చెయ్యి, బాగ్గెంగల చెయ్యి—”

అరవింద యంతయు విని తెల్లఁబోయెను. అది తన గతదశనంత స్పష్టముగాఁ బూస గుచ్చినట్లు చెప్పినదని యాశ్చర్యపడఁజొచ్చెను. సోదెయందుండునవిశ్వాసము లేకపోయెను. కడచిన యవస్థ సరిపోయిన ది, రాఁబోవునదికూడ సరిపోవునా లేదా యని యాలోచించుకొనుచుం డెను. శోభనాదిరి యా సోదెనుగుఱించి యేమియు మాటలాడక యె

యుకత చేతిలో రెండు రూకలను బెట్టెను. అది యంత చక్కఁగా వచిం
చినందుల కాసొమ్ము నతఁడిచ్చెనో, లేక వానికిని దానికి నా విషయ
మై యింతకుముందే యేర్పాటు జరిగెనో మనకుఁ దెలియదు. అరవిం
ద తాను బిఠాపురమునుండి తిరుగ వచ్చిన పిమ్మట నొక చీరఁ బంపెద
నని దానితోఁ జెప్పి శోభనాద్రితో మరలఁ గదలిపోయెను. వా రనతికా
లములో 'రహదారి' లోఁ బ్రవేశించి, యచ్చట నొక మేలిబండినె
క్కి పీఠపురికిఁ బోయిరి. భోజనములైనపిమ్మట శాంతమ్మను దీసికొని
మూఁడుజాముల ప్రొద్దెక్కుసరికి మరలఁ జంద్రమపాలెమునకు వచ్చిరి.
రాఁగానే శాంతమ్మయు నరవిందయు సర్వాభరణభూషితలై, రమ్యవ
స్త్రధారిణులై గ్రామములోని సువాసినులను పేరంటమునకుఁ బిలువబయ
లుదేఱిరి. అప్పు డరవిందకట్టినపుట్టమునుండి పైకిఁ బ్రసరించి సాయం
కాలపు నీరెండతోవియ్యమందుమేనినిగ్గులు, రాజహంసికనీనడించు
నడలతీరు, నొక్కునొక్కులుగలిగి జలదమాలికలఁ దిరస్కరించు వినీల
కుటిలకుంతలముల సొబగు, బంగారు నీర్వఱపినయటులుండు నెండలోఁ
గర్ణకుండలముల కాంతి యేదో కపోలములకాంతి యేదో తెలియఁబ
డకుండునట్లు తళతళ మెఱయు గండస్థలములు, మీలను గేలుసేయు క
న్నుల సౌభాగ్యము చూడఁదగినవై యున్నవి. అవి యన్నియుఁ జి
త్రకారుని కాదర్శములై యున్నవి. వారందఱినిఁ బిలిచి దీపములుపె
ట్టువేళ కిలుసేరిరి.

మఱుచటి దినమున మధ్యాహ్న మరవిందయు శాంతమ్మయుఁ
బుణ్యస్త్రీలకు వాయనములిచ్చియుఁ, జందనసుగంధతైలాది లేపనములఁ
జేసియుఁ, దాంబూలముల నొసంగియు సత్కరించుచుండ నరసింహారా
జు శోభనాద్రిరాజుతో వాఁకిటఁ దివాసిపైఁ గూర్చుండి యిష్టగోష్ఠిని
మాటలాడుచుండెను.

శోభ—నరసింహారాజుగారూ ! నేను మీ గృహమునకువచ్చి నాలుగు నెలలకంటె నెక్కుడై యుండవచ్చును. ఈలోపున నన్ను మీరె న్నియోవిధముల నాదరించితిరి. కాని నేనుమాత్రము మీకంత యనుకూలుఁడనై యుండలేదు. ఇఁక నెల్లకాలమును మీకు శ్రమగల్గింపవలెనని లేదు. దయయుంచి నాకు శెలవొసంగవలయును నా ప్రయాణమునుగూర్చి మొన్ననే యరవింద తోఁ జెప్పియుంటిని.

నర—అదేమిటి శోభనాద్రిరాజుగారూ ! వెళ్ళిపోయెదమనుచున్నారు ! మా యరవింద నాతో నేమియుఁ బలుకలేదు. అది నోము తొందరలో నీమాట నాతోఁ జెప్పమఱచినది కాఁబోలు. మఱియు దానికిఁ బ్రభాకరుఁడు వెడలినప్పటినుండియు మనస్సుమనస్సులో లేదు. ఇప్పుడు మేనత్తకొడుకు దుర్నీతిపరుఁడై యుంట విని మఱింత కుందుచున్నదేమో ! మీరు మమ్ములను విడిచి పెట్టుటకుఁ గారణమేమి ? మీకు మునుపటివలె సదుపాయముగా లేదా ?

శోభ—నన్నింతకంటె నెక్కువగా నెవరు గారవింతురు ? నాకు సదుపాయములలో నేలోటునులేదు. నా కంఠములోఁ బ్రాణములున్నంతవఱకు మీ యాదరణమును విస్మరింపఁగలనా ? నాకుఁ గొన్ని తొందరపనులుంటుటచే నేను బోకతప్పదు.

నర—సరే. పోవచ్చును. పనులఁదీర్చికొని మరలి రావచ్చును. ఎన్నినాళ్ళకు మరలివత్తురు ? వారమునకా, పక్షమునకా ? అంతకంటె నెక్కువకాలము పట్టదనుకొందును.

అప్పు డొకవెండిబిళ్ళగల ‘ డవాలీ ’ వైచికొనిన బంట్రోతొకఁడు వాకిట నిలిచి “ అయ్యా, నరసింహారాజుగారూ ! ” అని పిలిచెను. “ ఎవరు వార ” ని నరసింహారా జనునంతలో నింటి వాకలి

పుల్లిగాఁడనువాఁడు “బాబూ! ఎవఁడో ‘ దలాయతు ’ తమకొఱ కు వచ్చినాఁడు. ఏదో జాబుపట్టుకొని వచ్చినాఁడ ” ని చెప్పెను. నరసింహరాజు వానిని లోనికిరమ్మనెను. వాఁడెదుటికివచ్చి ‘ సలాము ’ చేసి కమ్మ చేతికందిచ్చి “ అయ్యా! నాకింకను బనియున్నది. నాకు సెల వింక ” ని చెప్పి వెడలిపోయెను. కొండపల్లి కాగితముపై వ్రాయఁబడి బంగారుపొడి యిసుక చల్లఁబడిన లేఖను విప్పి నరసింహరాజిట్లు చదువ నారంభించెను.

శ్రీ శ్రీ శ్రీ

కాండ్రేగులకోట

శ్రావణ శుద్ధ విదియ మంగళవారము.

“ అయ్యా!

కాండ్రేగులకోటకుగొన్న నూతన ప్రభువుగారు రేపుకోటలోఁ బ్రవేశింతురు. మధ్యాహ్నము మూఁడుజాములకు ‘ మసలందు ’ జరగును. అప్పటికి మీరు సకుటుంబ బంధుపరివారముగా విచ్చేసి మాతేని సత్కారములఁ గైకొనఁ బ్రార్థితులు. రాణివాసపు స్త్రీలకును దగిన స్థల సమపాయము లేర్పఱుపఁబడెను. రేపు జాము ప్రొద్దెక్కుసరికి మీకొఱ కొకగుఱ్ఱపుబండినిఁ బంపుచున్నాము.

చిత్తగింపవలెను.

అద్దంకి పూర్ణయ్య

ప్రధాన మంత్రి. ”

ఆ జాబును జదివి యతఁడు మిగుల సంతసమందెను. తన కపరిచితుఁడైన నట్టి గొప్పప్రభువు తన కాహ్వానమును బంపినందున కానందమును బొంది “ శోభనాద్రిరాజుగారూ, వింటిరిగదా జాబును? వారు మహాకృపతో నన్ను నా కుటుంబము నేకాక బంధువులను బరివారమును గూడ సగౌరవముగఁ బిలిచిరి. కావున మీరపయునమాపి రేపు నాతో

రండు. మన మువురయులము నరవిందా శాంతమ్మలతోఁ బోదము. నా మాటకెదురాడకుఁడు." అని పలికెను. శోభనాద్రి "అలాగుననే కానిండు. నారాక మీకంత ప్రీతినిఁ గల్గించునప్పుడు నేను మాఱు మాటాడరాదు. ఎన్నాళ్ళీవరియింట నన్నోదకములు ప్రాప్తమగునో యెవరు చెప్పఁగలరు ?" అనెను.

నర—స్వామి కృపవలన మీతో మఱిరెండుదినములుండుట కల్గినది. సరే మీరెప్పుడు మరల వచ్చెదరో చెప్పినారుకారు.

శోభ—నేను మిమ్ములను సదా విడకుండ నుండవలయుననియే మీరు కోరెడుపక్షమున మిమ్మును బూర్ణముగా విడిచిపెట్టనని యిదే వాగ్దత్తము చేయుచున్నాను. కాని తిరుగ నెప్పుడు వచ్చి యీ గ్రామమున మీయింట నుండఁగలనో మాత్రమిప్పుడు చెప్పలేను.

నర—ఎట్లయిన మమ్ము విడువమని మాటయిచ్చితిరిగదా. అంతే చాలును. మీరిచ్చటనుండబట్టియే దినములు నిముసములవలెఁ గడచుచున్నవి.

నరసింహరాజువంక స్థిరదృష్టితోఁ జూచుచు శోభనాద్రి గడ్డముతోఁ దలయూచి మిన్నకుండెను. నరసింహరాజు లేచి లోపలికిఁబోయి "అమ్మా ! అరవిందా" యని పిలిచెను. ఆమె శాంతమ్మనైదు వరాండ్రయొద్దనుండి తండ్రికడకుఁ జనినెను. అతఁడు "తల్లీ ! మనకుఁ గాండ్రేగుల రాజుగారియొద్దనుండి యాహ్వానపత్రిక వచ్చినది. రేపు నీవు, నేను, శాంతమ్మ, శోభనాద్రియు నాయూరికిఁ బోదము. మనకొఱకొక యశ్వశకటముకూడ వచ్చును. ఆ నరపాలునకు మనపై నింత దయ యేలకల్గెనో ! శాంతమ్మయు నీవును మంచి బట్టలను నగలను బెట్టుకొని యున్నియు సవరించుకొని సిద్ధముగా నుండుఁడు. మన శోభనాద్రి ప్రయాణము ప్రస్తుతమాపు చేసినాను." అని సంతోషపూర్వకము

గా వహించెను. అరవింద యనిర్వాచ్యమైన యానందముఁ బొందెను. వారు పల్లెటూరువాండ్రు. ఎప్పుడిట్టి ‘ మసలందు ’ లు సభలు చూచి యెఱుఁగరు. మన మాసభా విశేషములను దెలిసికొందము రండు.



## పదియవ ప్రకరణము.



### అతిథులు.



గ్రామ్యులకుండు నానందము, సౌఖ్యము నాగరికులకుఁ గలుగదు. గ్రామమందు వినిర్మలమైన గాలి, పరిశుద్ధమైనపదార్థములు, ఆరోగ్యకరమైన శరీర పరిశ్రమము మున్నగునవి ప్రతివారికి లభించును. నగరమందవి దుర్లభములు. అమలదేహులును, పవిత్ర స్వభావులునగు గ్రామవాస్తవ్యులకు మానసోల్లాసకరమగునదేదిలభించిన నవాచ్యమగు నానందము కలుగును. దంభవ్యాపారచారులగు నాగరికుల కట్టి యానందముకలుగనే కలుగదు. ఒకవేళఁ గలిగిన ననుభవింపలేరు. మన నరసింహారాజునకు నరవిందకు నట్టి యానందమే నేఁడు కలిగినది. రాజసభాప్రవేశభాగ్యము కలిగెనని తండ్రియుఁ గూఁతురును మహామోదమొందుచుండిరి. శాంతమ్మ యెప్పటియట్లే యుండెను. పీఠికాపురములో నిట్టి సభలకామె పెక్కుసారులుపోయియున్నది.

వారుమఱునాఁడరుణోదయమున లేచికార్యంబులనిర్వర్తించిస్నానము లాచరించి ధౌతవస్త్రములంగట్టి భగవత్ప్రార్థనముఁ జేసికొని శోభనాద్రితోఁ గూడి పెండలకడ నారగించి గుఱ్ఱపుబండికొఱకెదురు చూచుచుండిరి. అరవింద మోమప్పుడే వికసించిన యరవిందమువలెనే యున్నది. శాంతమ్మ శాంతామహాదేవివలెనే యుండెను. ఎన్నినగలుపె

ట్టుకొనిననేమి, యెంతయందముగా జుట్టును గట్టుకొనిననేమి సహజ
సౌందర్యములేనియప్పు డవి యన్నియు బనుపుచేయులేకనా. నేఁ డరవిం
దా శాంతమ్మల సింగారము చూచితీరవలయును. నరసింహరాజు తె
ల్లని పలుచని " జరీ " పంచను గట్టి, చారల యంగీదొడిగి, వంగపండు
చాయగల పట్టుబట్ట తలకుఁజుట్టి, సున్నితమైన బంగారు సరిగల యు
త్తరీయమును వైచుకొని మూర్తీభవించిన నైర్మల్యమునా నొప్పె. శో
భనాద్రి యెప్పటి మురికిబట్టలే కట్టుకొని ప్రయాణమునకు సిద్ధముగా
నుండెను. నియమితకాలమునకు శకటము వచ్చెను. నరసింహరాజాదు
లందాసీనులై కదలిపోయిరి. కాకినాడ యొద్ద గుఱ్ఱములమార్చిరి. వా
రు రెండు యామములకుఁ గాండ్రేగులకోటలోఁ బ్రవేశించిరి. కోట
యంతయుఁ జాలతోరణములతో నలంకరింపఁబడెను. మధ్యమధ్య పం
దిళ్ళును వాని కంబములకు రంభాస్తంభములును గట్టఁబడెను. అన్ని ది
క్కులనుండియుఁ గమ్మతావులు వెదఁజల్లుచుండెను. నరసింహరాజమ్మ
హోత్సవ దర్శనోత్సుకతచే నొదలో జనులు వచ్చియుందురనుకొనెను.
కాని యక్కడక్కడ నున్న కానలివాండ్రు తప్పనతని కెవ్వరును గోచ
రింపలేదు. అతిథులువిడియుటకై యుంద్రమందిరమునకుసమీపమునున్న
యానందమందిర మేర్పాటు కావింపఁబడెను. బండిని దూరమునుండియే
చూచి పూర్ణయామాత్యుఁడెదురేగి వారలఁ దోడ్కొని యానంద మం
దిరముం జొచ్చెను. దారిలో సేవకులు నమ్రులై యతిథులకు దండము
లు పెట్టిరి. కాని ముసలివానివై ఖరిజూచి యేవగించికొని " యీ బి
చ్చగాఁడెవఁడురా ! అలనాఁడు రాచపడుచువానితోఁ గోటఁ జూడవచ్చి
నవాఁడులాగునఁ గనఁబడుచున్నాఁడు. రాజుగారు చూచిన వీనిని లోని
కి రానిత్తురా " యని వారిలోవారు మెల్లగాఁ జెప్పుకొనసాగిరి.

అంతఃపురకాంతలకు లక్ష్మీవిలాసమను భవనము విడిదిగా నేర్ప
ఱచిరి. కాంతలకు స్వాగతమిచ్చుటకొఱకు నెలఁతుకయుఁ బురుషులనాద

రించుట కొఱకు యుద్యోగియు సిద్ధముగా నుంపఁబడిరి. ఆనందమందిర ప్రాంగణమందు ఘనులైన యతిథులు సుఖాసీనులగుటకు మేలైనవడికుర్చీలునుపఁబడెను. అరవిందయు శాంతమ్మయు లక్ష్మీవిలాసమునకుఁదోడుకొనిపోఁబడిరి. నరసింహశోభనాద్రిరాజులు పూర్ణయమంత్రితో నానందమందిరముఁజొచ్చిరి. అప్పుడు వారిట్లు భాషించిరి.

నర—మంత్రిశేఖరా ! మీరాజుగారెక్కడ ?

పూర్ణ—వారింతకు మునుపే వచ్చియుండవలసినది. ఏమికారణముచేతనో యింకను రాలేదు. ఇఁకనో యిప్పుడో వత్తురని వేచి యున్నాము.

నర—ఇఁకను రానేలేదా ? ఆయన నామధేయమేమి ? వారి యాజ్ఞయైనదని వచ్చితిమికాని వారెవరో యెఱుఁగము.

పూర్ణ—మేమును మీకంటె నెక్కువవారము కాము. వారిపేరు మాకును దెలియదు. విశాఖపురిలోనున్న యొక గొప్ప న్యాయవాది వారిపక్షమున నిచ్చటికి వచ్చి యీ "జమీను" గొని నన్ను దాక్షారామునుండి పిలిపించి యీ యుద్యోగ మొసంగినాఁడు. ప్రస్తుతము కార్యములన్నియు నతనివలననే జరుపఁబడుచున్నవి. పుడమిరేని మేమింకను జూచు భాగ్యము కలుగ లేదు.

నర—కడువింతగానున్నది. ఆ న్యాయవాది యెక్కడ ?

పూర్ణ—ఆయన యిందిరామందిరమున నొక గదిలో నేవియో పత్త్రిములను జదివికొనుచున్నాఁడు. రెండు దినములనుండి యీపనితోనే కొట్టుకొనుచున్నాఁడు. వారిదర్శనము మనకిప్పుడుకాదు.

నర—నియతకాల మతీతమగుచున్నదే ? ఏల యింకను సభ్యులెవ్వరును రారైరి ? మేమే సభ్యులమా? మఱియెవ్వరైనఁగలరా ?

పూర్ణ—సభికులైనఁ బెక్కురురారు. ఇంక నైదాఱుగురుమాత్రము వత్తురు. వారు విజయనగరమునుండి గావలెను. స్వల్పకాలము లో వచ్చెదరనుకొందును.

నర—అయ్యో ! ఏదో మహోత్సవము జరగునని వచ్చితిమే. ఇంతే నా ? సంగతులన్నియుఁ దెలిసికొనకుండ మేము ముందు వచ్చి కూర్చుంటిమే.

పూర్ణ—ఇప్పుడైననేమి ? అందఱు నొకటి రెండు గడియలలోఁ దప్పక వత్తురు. తాళుఁడు—

శోభనాద్రిరాజేమియు నెఱుఁగనివానివలె నిటునటు దిరుగుచుండెను. వారి సంభాషణమును వినెనో లేదో ? నరసింహరాజరవిందతోఁ బలికినపలుకులు, వెంకటపతి మాలతితో నాడిన రహస్యపు నుడులు వినినవాఁడు వీనిని వినకుండునా ? అంత నరసింహరాజు లక్ష్మీవిలాసములోఁ దమవారుతప్ప మఱేవారును లేరని తెలిసి దాని సొగసును జూడఁ బోయెను. శోభనాద్రియు వాని వెనుకనే గంగిగోవువలెఁ దలవంచుకొని వచ్చుచుండెను.

నర—అమ్మా!అరవిందా! మీకు రాజాంగన లెవ్వరైనఁ గాన్పించిరా ?

అర—రాజాంగనలందువు. రాజుగారే రాలేదఁట.

శాం—రాజుగారు బ్రహ్మచారులఁట. ఇప్పుడు మాకు స్వాగతమిచ్చిన వనజాక్షియను నామె చెప్పినది. భార్యలేనిదే పట్టాభిషేకమహోత్సవము జరగునా ?

నర—ఆశ్చర్యముగా నున్నదే ? ప్రభువు కనుపింపఁడు. ప్రభు భార్యలంతకంటెఁ జూపట్టరు. సభ్యులు మొదలేలేరు. మనము మాత్రమిచ్చట నుండనేల ? మంత్రిగారితోఁజెప్పి పోదమా ?

శోభ—తొందరపడకయ్యా ! రాజిఁకనో యిప్పుడో వచ్చునని మంత్రి చెప్పినాఁడుగదా ? అవిగో ! రెండు శకటములు వచ్చు

చున్నవి. అవి నురుఁగులు గ్రక్కుచు వచ్చుచున్నవి. పాపము వానిని జాలదూరమునుండి నడపించుకొని వచ్చుచున్నారు కాఁబోలు.

నర—అందులోఁ బ్రభు వుండునేమో ?

బం డ్లొకచెట్టుసీడనాగినవి. ఒక్కొకబండినుండి యొక్కొకపురుషుఁడు నిద్దఱుస్త్రీలును దిగిరి. మరలఁ బూర్ణయ్య యొకబంటుతోనెదురేగి వారలఁ దోడ్కొనివచ్చెను. వా రానందమందిరమునకుఁ గొంపోఁబడక తిన్నగా లక్ష్మీవిలాసమునకై పునసే తీసికొనిరాఁబడుచుండిరి.అరవిందయు శాంతమ్మయుఁ బరపురుషులు వచ్చుచుంటచే భవనములోనికిఁబోయి తలుపును జేరవైచికొనిరి. పూర్ణయ్య వారితో నరసింహారాజుకడకు వచ్చి 'వీరే నారాయణకృష్ణమరాజుగారులు. వీరిది విజయనగరము కాపురము. వీరును మీ సమీపబంధువులనియే 'వకీలు' గారు చెప్పినట్లున్నారు. వీరు వారికొమార్తెలఁట." అని వచించి వారినిఁజూపెను. నరసింహారాజు భరింపరానిసంతోషమునుబొందెను. 'బావలార! వచ్చినారా' యని చెటియొకచేతితోఁ గౌఁగిలించుకొనెను. వారు 'ఓహో! నరసింహారాజా' యనిమాత్రమని యతనిదాఁకుటచేఁ దమదేహము లపవిత్రములగుననికాఁబోలు విదళించుకొని యావలకువచ్చి నిలువఁబడిరి. నరసింహారా జంతటితో నూరకుండక యాయువతులను సమీపించి 'తల్లులారా ! ఎన్నినాళ్ళకు మిమ్ముఁ జూడఁగంటిని ? నాసోదరీమణులు పోయినదాది మీరు నాకు దూరమైపోయితిరిగదా ? అమ్మలారా! నేను మిమ్మును దలపెట్టనిగడియలేదుసుఁడీ. మనకుబ్రవాఁడు వెంకటపతివలన మీక్షేమసమాచారమునువిని కడుసంతసించితి' నని సాదరముగాఁ బలికెను. తలుపుచాటుననుండిన యరవింద యీమాటలువిని వారు తన మేనత్తలబిడ్డలని కనుగొని బైటికివచ్చెను. నరసింహారాజు 'తల్లులారా! ఇదే మీావదిన యరవింద' యని కూఁతును వారికిఁ గనఁబఱిచి

'అమ్మా ! నీమేనత్తల కొమార్తెల నాలింగనముఁజేసికొనుము' ని యరవిం
దతోననెను. అరవింద యట్లుచేసెను. కాని నారాయణరాజుకూఁతురలిద్ద
ఱు ముకుళితవదనములతో వెనుకకుఁబోయి తండ్రియొద్దనిలిచిరి. కృష్ణమ
రాజుసుతలుమాత్రము కొంచెమాదరముతో నరవిందను బలుకరించిరి.
నారాయణరాజుకృష్ణమరాజుగారులు కొంచెమెచ్చుతగ్గుగా నరసింహరా
జువయస్సునందేయుండిరి. ఇరువురుసుస్ఫురద్రూపులే. ఇరువురునమూల్యా
దుకూలములధరించి, నిమ్మకాయలునిలువఁబెట్టఁదగినవగుబుగ్గమీసముల
నుదువ్వి, మేన ఘుమఘుమపరిమళించునత్తరులనుబూసికొనియుండిరి. వా
రిద్దఱును గర్విష్ఠులుగా నేకాన్పించుచుండిరి. వారిలో నారాయణరాజు
మఱియు మిట్టిపడుచుండెను. అతఁడు నరసింహరాజును 'బావా' యని
పిలుచుట తనఘనతకు లోపమనియెంచినవాఁడు. వానికిఁ దగినవారే
పుత్త్రికలు అరవిందనుఁజూచి మూతి ముడిచికొన్నవారు. కృష్ణమ
రాజు తన్నుఁగూర్చి ఘనాభిప్రాయములు గలవాఁడైయెనను, పైచేష్ట
లయందుమాత్రము గరువముఁజూపఁడు. అతనికూఁతులు సత్స్వభావలే
కాని తండ్రికి వ్యతిరేకముగాఁ జరించిన నేమనునోయని భయపడుచుం
దురు. వారే యరవిందతోఁ గలసిమెలసి మాటలాడిరి. నారాయణరా
జుతనయలు రాగమ్మ,సుబ్బమ్మలకంటెఁ గృష్ణరాజు తనయలు రత్న
మ్మ లక్ష్మీనరసమ్మలే యెక్కువ యందమైనవారు. అరవింద వారికొఱ
కు దేవులాడుటయేకాని వారుమాత్రము టెక్కుతోనేయుండిరి. అప్పు
డు పూర్ణయ్య వీరికి ఫలహారములఁబంప నావలకుఁజనెను. మనశోభ
నాద్రిరా జొకవాల్కుర్చీమీఁదవాలియుండి వీరిసంభాషణ మొప్పరికిం
చువానివలెఁ గునికిపాట్లు పడుచుండెను. అంత నరసింహరాజు సగము
జాగ్రదవస్థయందున్న యాముదుసలిని 'శోభనాద్రిరాజుగారూ!' అని
బిగ్గఱగాఁబిలిచి లేపి బావలతో ''ఈతఁడు శోభనాద్రిరాజను పేరుగల
వాఁడు. నాకు సమీపబాంధవునిమించిన స్నేహితుఁడు' అని యాతనిని

జూపెను. పత్నీసోదరుని స్పృశించుటకురోయువా రాతని సమక్షమునవె ట్లుందురో యాలోచించుకొనుఁడు. వా రాతనిజూచినతోడనే పెడము గములంబెట్టి దూరముగాఁజనిరి. ఈపరివర్తనముంజూచి శోభనాద్రి రేమనుకొనునోయని నరసింహరాజు భయపడుచుండెను. కాని శోభనాద్రి యేమియునవక నిద్రమత్తుపోవుటకుఁ బ్రచారముచేయువానివలెఁ దిరుగుచు నెక్కడకోపోయెను అరవింద తండ్రితో 'నాన్నగారూ! అంతగర్వముగలవారితో మనకు సంభాషింపవలసినయవసరమేమి? మనవస్తువు లెప్పుడుపోయినవో యప్పుడే వారితో మనకు సంబంధముచెల్లినది.' అని యనెను. నరసింహరాజు తలపంకించి యూరకుండెను. ఆవల నారాయణరాజు ముసిముసినవ్వులతోఁ గూఁతులవంకఁ దిరిగి 'ఆయరవింద చక్కని కుఱ్ఱదేసుమీ. కాని పల్లెటూరిపిల్లయగుటచే మోటుబట్టలు నగలును బెట్టుకొన్నది. ఆరెండవపిల్లయెవరు? అరియు నరవిందవలెనే యున్నది?' అనియనెను. ఆయువతులు 'ఏమో, మాకేమి తెలియును?' అని యూరకొనిరి. శాంతమ్మ యింతవఱకు వారిమాటలును వైఖరియుఁ గనిపెట్టుచు గుమ్మమువద్ద నిలిచియేయుండెను. ఆమెకేసి చూచియే నారాయణరాజట్లు కూఁతులను బ్రచ్ఛచేసెను. ఆసమయమున నొకబ్రాహ్మణుఁడు సత్ఫలముల నొకపళ్లెరమునఁబెట్టుకొని తీసికొనివచ్చెను. ఎంతగర్విష్ఠులైన నందఱును బందుగులేకావున, వారెల్ల రొకచోటుననే యుచితాసనములపై నాసీనులయిరి. శోభనాద్రిమాత్ర మచ్చటలేఁడు. అతనికొఱ కరవిందయు నరసింహరాజును వెదికిరి. "అతఁడు మరల నిందిరమందిరములోని బొమ్మలను జూచుటకై పోయియుండవచ్చును. వెనుక వెంకటపతిరాజుతోఁబోయి దానినిజూచివచ్చి నాతో దానిశృంగారముంగూర్చి పలువితముల వర్ణించిచెప్పినాఁడు. ఇప్పు డక్కడకే పోయియుండు" నని నరసింహరాజు కుమారికతోననెను. అందఱును గానలసి నన్ని ఫలములఁదిని నిర్మలోదకమును ద్రావిరి. అప్పుడు నారాయణ

రాజు నరసింహరాజుతో నేమియుఁ బలుకకుంట బాగుగనుండదనియెంచి బావా! నీతోనున్న యాకురూపియెవఁడు. వాని నేలతీసికొనివచ్చితివి? రాజుగారుచూచిన వానిని నిన్ను వెడలఁగొట్టెదరుసుమీ' యని యనెను. నాగరికులగు నాఁడువాండ్రు పకపకనవ్విరి. వారి వెనుకనుండియే శోభనాద్రి దగ్గుచు వచ్చెను. వానిని జూడఁగానే నరసింహరాజు 'శోభనాద్రిరాజుగారూ! దయచేయుఁడు. బావలారా! ఇతఁడు—'అనియేదోచెప్పఁబోవుచుండ శోభనాద్రి వానిమాట కడ్డమువచ్చి "నరసింహమా! నీవు నన్నుఁగూర్చి పొగడనక్కఱలేదు. నాపేరు శోభనాద్రిరాజుగాదు. నేను భూ ప తి రా జ ను నీయున్నను. ఇప్పుడు మీరందఱు నాయింట నతిథులై యున్నారు. అతిథులరేకాక రక్తసంబంధమైన చుట్టములుగావున మీకిదే స్వాగతమొసఁగుచున్నాను." అని యుచ్చైస్స్వనముతోఁ బలికి విజయనగరపువారివంక నిశ్చలమైనదృష్టితోఁ జూచుచు నిలిచెను.



## పదునొకండవ ప్రకరణము.

## స్వ మ త త్యా గి.

భూపతిరాజు నరసింహరాజుకన్నఁ బదేండ్లు పెద్దవాఁడు. కావున నిప్పు డతని కఱువదిసంవత్సరముల వయసుండును. కాని యతఁడింకను బెద్దవానివలెఁ గాన్పించును. వెనుక వర్ణింపఁబడినరీతి నతని వెండ్రుక లకాలముననే నరసిపోయినవి. అతనిచరిత్రమును సంగ్రహముగాఁ దెలిపెదనువినుఁడు. అతఁడు వాణిజ్యమునకై పయనమైపోవునప్పటి కిరువది నాలుగు వసంతముల ప్రాయముగలవాఁడు. అతఁడు సింహళద్వీపమునకుఁ బోవుమార్గమందు గొప్పతుపానుపట్టుటయు నితనిమోడ వ్రయ్యల

గుటయు సమస్తమును నాశమగుటయు నిక్కువమే. కాని యతఁడు మాత్రము దీర్ఘాయుష్మంతుఁడగుటచేఁ జావలేదు. తననౌకనుండి దుసికిలిపడిన యొక కొయ్యముక్కను గట్టిగాఁ బట్టుకొని మహోదధియం దీదుకొని పోవుచుండెను. వానికెంతకును దరి కానఁబడలేదు. ఆయాస ముచేఁ బట్టు సడలుచుండెను. అత్తఱిఁ గొండొకతెప్ప దరిఁజేరెను. ఆనా వ మైసూరురాష్ట్రమునుండి కొందఱుజనులను దీసికొని సుమిత్రా ద్వీప మునకుఁ బోవుచున్నది. వారు మలయాళప్రాంతదేశములనుండి తేఁబ డి, స్వమతమునువిడిచి మహమ్మదీయమతమును స్వీకరింప నిర్బంధింపఁబ డి యందున కొల్లమిఁ గారాగృహమునకుం గొంపోఁబడి, యచ్చటనుం డి టిప్పుసుల్తానునాజ్ఞపై వేఱొకమహమ్మదీయరాష్ట్రమైన సుమిత్రా ద్వీపమునకుఁ దీసికొనిపోఁబడు హైందవులు వారలలో నొకఁ డీతనిజూ చి తమయోడమీఁదికిఁ దీసికొనుట కిష్టములేనివాఁడయ్యును, ప్రాణర క్షణ మవశ్యముకావునఁ దనయుత్తరీయమును విసరి, దానినితఁడు పట్టు కొనఁగాఁ బైకిలాగెను. ఇట్లు భూపతిరాజు ప్రాణములు కాపాడఁబడె ను. ఆయువు గట్టిగానున్న నెన్నిగండములు తటస్థించినను భయములే దు. తుద కొకగడ్డిపరకయైనను వాని ప్రాణరక్షణ మొనర్పఁగలదు. ఆ యువు మూఁడినవాని కెట్టియల్పాపదయైన హానిచేయును. భూపతిరా జాదురదృష్టవంతులతోఁబాటు సుమిత్రాద్వీపము జేరెను. కాని వాని దినము లంతచెడ్డవికాకపోవుటచేఁ గారాగృహనివాసముమాత్రము తట స్థముకాలేదు. ఆద్వీపాధికారి వానికిరెండుతెరువులఁ జూపెను. మహమ్మ దీయమతమును స్వీకరించి తేనిదయకుఁ బాత్రుఁడై గొప్పయుద్యోగము నందు నియమింపఁబడినవాఁడై యుండుటో, లేక ప్రాణము లర్పించు టకు సిద్ధముగానుండుటో చేయుమనెను. భూపతిరాజునకు సుసుకులపై నాసయెందు జీవించియుండినఁగదా యేఘనకార్యములకైనఁ గడంగుట యని యతఁడు తలఁచుచుండెను. అతఁడు విధిలేక స్వమతమునువీడి పర

మతమును గైకొనెను. వెంటనే యతనికాస్థానమందు గొప్పపదవి లభిం
చెను. ధనమక్షయముగా నింటఁబెరుఁగుచుండెను. కాని హృదయము మా
త్రము స్వమతత్యాగమునకై నకనక పడుచుండెను. ఏమిచేయఁగలఁడు ?
ఏయెండ వచ్చినప్పుడాగొడుగుపట్టవలెనుగదా ! ఏండ్లుగడచినకొలఁది
హృదయతాపము చల్లారుచుండెను. అతఁడు కుశాగ్రబుద్ధిగలవాఁడగుట
చే నతనియుపదేశములు భూభర్తకు ననుకూలములై యుండెను.
రాజున కతనియందు మఱింతప్రేమకలిగెను. కాని యతఁడు దేశమువిడి
చిపోవుటకు సమ్మతింపఁడయ్యెను. తనకు సన్మంత్రోపదేశమునుజేయు
టకై వానిని దనముఖ్యమంత్రినిగాఁ జేసి తనయొద్దనే యుంచుకొనెను.
వయస్సుతోఁబాటు ధనసంచయములు నభివృద్ధిఁ జెందుచుండెను. ఆప్ర
వాసమందు ముప్పదియేండ్లు గడచెను. అంతనారాజు మరణించెను.
అతనికొడుకునకు మతమునం దంతపట్టుదలలేదు. మఱియు విషయలంప
టుఁడు. ఎవరెట్లుపోయినను సరకుఁగొనఁడు. ఒకనాఁడతఁడు హఠాము
దోద్రేకుఁడై యుండ భూపతిరాజు వానిని సమీపించి తాను దనదేశము
నకుం బోవలయుననెడియభిలాషమును దెల్పి సమ్మతిం గైకొనెను. వెం
టనే యవ్వారిగా లభించిన ధనమును మూటఁగట్టుకొని బయలుదేఱి
విశాఖపురపు రేవునొద్ద దిగి యచ్చటి ఘనసంఘములో ఘనతముఁడగు
భో॥ కామేశ్వరరావుగారియింట బసచేసెను. అతఁ డీతనియద్భుతచరిత్ర
మును విని, మతవిషయమై యతఁడు పశ్చాత్తాపమొందినవాఁడు గ
నుక మరలఁ బ్రాయశ్చిత్తమవసరము లేదని నిశ్చయించి, యతని కోరిక
చొప్పున నతనిసత్యచరిత్రమెవ్వరితోఁ జెప్పనని వాగ్దానముం జేసి, యత
నికి 'వకీలు' గానుండి సమస్తకార్యములను నెఱపుటకు సమ్మతించెను.
భూపతిరాజు వానిసత్ప్రవర్తనమును జక్కఁగాఁ బరీక్షించి తనధనమంత
యు వానివశముచేసి తనయిచ్చవచ్చినరీతిని వ్యయముచేయుచుండుమ
ని యాజ్ఞయిచ్చెను. అతఁడందులకు హృదయపూర్వకముగా నియ్య

కొనెను. అచ్చట నుండఁగానే 'వాకబు' వలన నతనికిఁ దనతండ్రి మృతినొందినట్లును, దనచెలియండ్రు ధనవంతులను బెండ్లియాడి భూమిపై నిద్దఱేసిపుత్రికలనువిడిచి యిరువురు, నొక్కపుత్రునిమాత్రమే విడిచి యొక్కతెయుఁ జనిపోయిరనియుఁ, దనతమ్ముఁడు మేనత్తకూఁతుఁ గన్నను ద్వాహమాడి యొక్కకూఁతునుగని భార్యను గోల్పోయెననియు, నాస్తియంతయు నతనికే చెల్లుచున్నదనియుఁ దెలిసికొనియెను. తమ్ముని, తమ్మునికూఁతునుగుణసంపత్తినిఁ గూర్చి లెస్సగావినెను. ఒకసారి వారల నుజూచి తనగొప్పయాస్తి నర్హుల కర్పింపవలెనను తలఁపుతోఁ జంద్రము పాలెమునకువచ్చి మాఱుపేరితో మెలఁగెను. అతఁడు విదేశమునకుఁ బోవునప్పటికి నరసింహరాజునకుఁ బదునాల్గేండ్లుమాత్రమే యున్నవి. అతఁడు ముప్పదిమైదేండ్లు గడచినపిమ్మట వచ్చినప్పు డెవ్వరువానిఁజూచి యానవాలు పట్టఁగలరు ? సోదరునింట మాఱుపేరితో నతఁడేలయుండెనో ముందుముందు మనకే యెఱుకపడును. మన మీచరిత్రకథనమునుజాలించి వెనుకటిప్రకరణముతో విడిచిపెట్టిన కాండ్రేగులకోటలోని లక్ష్మీవిలాసమునకుఁబోయి యచ్చటివారి యవస్థలను దెలిసికొందము.

అందఱును విస్మయపరీత చేతస్కులైరి. నరసింహరాజునకుఁ దమి పట్టఁజాలకుండెను. అతఁ డన్ననుబరీరంభణముఁ జేసికొని యశ్రువులు రాల్చెను. అశ్రువు లానందముచేతనైన రావచ్చును. దుఃఖముచేతనైన రావచ్చును. నరసింహరాజునకుమాత్ర మానంద దుఃఖ మిశ్రితమగు నవస్థవలన బాష్పములు వచ్చెను. తరువాత నారాయణరాజు కృష్ణమరాజులు వచ్చి కౌఁగిలించి " బావా ! ఎంతకాలమునకుఁ జూడఁగల్గితిమి. ఈ ప్రాంతపువారిలో నీవు తక్క మమ్ముఁ బిలుచువా రెవ్వరునుండరని మేమనుకొనిన యట్లె జరగినది, " అని యిదివఱకు కాతని నెఱుఁగకపోయినను బాధ్యతగలవారివలె మాటలాడిరి. పిమ్మట నారాయణరాజుకొమార్తెలు గారియొక్క వైపునకు వచ్చి " మామా ! మా

ప్మ నీకొఱకు బెంగపెట్టుకొనియే పోయినది. ఆమె బ్రతికియున్న నేఁ డెంత సంతోషమును బొందునో కదా" యని సానురాగముగఁ బలికిరి. ఇదివఱకు వానిని రోఁతవస్తువుగాఁ జూచిన వారికింత ప్రేమ మేల హఠంబున వచ్చెనో? ధనమెంతటి విచిత్రపు నాటకములనైన మనుజులచేఁ గట్టించును. ఆవల కృష్ణమరాజు తనయులు వచ్చి హృదయపూర్వకమైన ప్రీతితో "మామా! నమస్కారముల" ని ప్రేమపుంజూపులఁ జూచుచుఁ బ్రక్కను నిలిచిరి. భూపతిరాజు 'నాకుఁ గావలసినవారందఱువచ్చి నాదగ్గఱకువచ్చి నాపైఁగలప్రేమను దెలియఁబఱచిరి. మాయరవిందమాత్రము రాలేదేమి?' అనెను. అరవిందకిప్పు డాశ్చర్యసంతోషవిషాదములు ముప్పిరిఁగొనియున్నవి. అవియన్నియు హృదయమునిండ బూర్ణీభవించియున్నవి. భూపతిరాజు 'కన్నతల్లీ, అరవిందా' యని పిలుచువఱకామె సమీపింపలేకపోయెను. ఆమెయు నాతని నాలింగనముం జేసికొని 'పెద్దనాన్నగారూ! నాయపరాధములను క్షమింపుఁడు.' అని యించుక కంటఁదడిపెట్టెను. భూపతిరాజు మెల్లగఁ జెవిలో 'అమ్మా! నీవు కడపటనచ్చి నన్నుఁ గౌఁగిలించినను మొదటిదానవేసుమీ' యని వచించెను. ఇట్లందఱు మహానందసాగరమునం దేలుచుండ నెవ్వరో టకటకమను జోడుచప్పుడుతో నచ్చటికేతెంచిరి. అతఁడు భోగరాజు కామేశ్వరరావు.

ఇయ్యెడ నారాయణ కృష్ణమరాజుల కెట్లాహ్వానమందెనో, వారెట్లింతదూరము ప్రయాణశ్రమకోర్చి రాఁగలిగిరో యించుక వచింపవలసియున్నది—కామేశ్వరరావు కాండ్రేగులకోట కెవరెవరు పిలువఁబడవలయునో భూపతిరాజువలనఁ దెలిసికొని నరసింహరాజున కొకజాబునువ్రాసి, యతనికొఱకొకబండినిఁ బంపుమని పూర్ణయ్యమంత్రిపేర వ్రాసి తానొకలేఖను నారాయణరాజున కిట్లువ్రాసెను.

"అయ్యా,

నాస్నేహితుఁడొకఁడు గోదావరీమండలమందలి కాండ్రేగులసంస్థానమును గొనెను. అతఁడు మిమ్మును బాగుగనెఱుఁగును. అతఁడు దుర్గపురము బ్రవేశించునాటికి మీరు సుతలతోఁ గాండ్రేగుల రాఁ గోరుచున్నాఁడు. అతఁడు చాలఁగాలమునుండి విదేశమందుండి యనంతధనమును సంపాదించి వచ్చెను. నే నాతనిపేరు చెప్ప నధికార మీయఁబడనివాఁడను. ఏమికారణముననో యతఁడు తననామధేయాదులు ముందుగాఁ దెలుపఁబడుటకు సమ్మతించుటలేదు. మీకు హితముగఁ గాన్పించి సంతోషముం గూర్పవలెనని యున్నవాఁడు. మఱియు మీరన్యథా భావింపకుంటిరేని యతఁడు మీకుఁ బ్రయాణవ్యయమునకై నూఱు రూకలను బంపుమని యాజ్ఞయిచ్చెను."

ఆలేఖనందికొని నారాయణరాజు తాను బయలుదేఱుట కభ్యంతరములేదనియు నామహామహుని నామముమాత్రము తెలుపఁగోరుచుంటిననియు నొకకమ్మ వ్రాసెను. కాని యాన్యాయవాది యథార్థవాదియగుటచేఁ తననెయ్యుని యభిమతప్రకారమే వర్తించెను. పేరుమాత్రము తెలుపలేదు. ఒకనాఁడతఁడు విశాఖపురినుండి విజయనగరమునకుఁబోయి నారాయణరాజును దర్శించి నూఱురూకలిచ్చి యవలఁ గృష్ణరాజునుగాంచి యటులేసంభాషించి యతనికిని రూప్యఖండశతమర్పించి వచ్చెను. వారిరువురును బయనంపువ్యయము పుచ్చుకొనుటకు మొదట సందేహించిరికాని, పుచ్చుకొనకుండఁ జేయునదిలేక సమ్మతించిరి.

పాఠకులారా! మీకిప్పు డేకారణమున భూపతిరాజు మాఱుపేరితో వర్తించెనో తెలిసినదా? అతఁడు జీవితకాలమంతయు బ్రహ్మచర్యవ్రతమే నెఱపెను. విస్తారధనమును సంపాదించెను. ఆధనమంతయుఁ దాననుభవించుటకుఁ గాలము చాలదు. దానిని దనముఖ్యబంధువులలో నెవరికైనఁ జెందనీయవలెను. అందుల కర్హులెవరో తెలిసికొనుటకే యీప్రవర్తనము. మఱియుఁ జంద్రమపాలెములో రోగపీడితుఁడై యుం

డి ప్రాణభంగము వచ్చునని భయపడి లోలోన భగవన్నామస్మరణముం జేసికొనుచు 'ఓతండ్రీ! నే నేపాపమును జేసియెఱుంగ. కాని మనస్సాక్షికి వ్యతిరేకముగా నన్యమతస్వీకారమునుమాత్రము చేసితిని. క్షమింపుము' ని వేడుచు మరల మరలఁ బశ్చాత్తాపపడుచుఁ దుదకు నిద్రలోఁ బైకి 'నేను ద్రోహిని. మహాపాపకార్యమునొనర్చితి' నని యనుటకు హేతువుకూడ మీకుఁ దెలిసినదా? 'నేనుజేసినతప్పు నాకే హానిఁదెచ్చునుగాని యితరులకుఁగాద' ని యతఁడప్పుడు నరసింహరాజుతో వచించిన వాక్కులు నిక్కములేనా?

భూపతిరాజు కామేశ్వరరావును దనవారలకుఁ గనఁబఱిచి యతఁడు తన 'వకీల' నియు విశాఖపురిలోఁ గాపురముసేయు న్యాయవాదియనియుఁ దెలిపెను. వారంద ఱతనితో సగౌరవముగ భాషించిరి. కామేశ్వరరావు "అయ్యా! ఇప్పుడే పూర్ణయ్యమంత్రితోను 'నౌకర్ల' తోను దమరే ప్రభువులని చెప్పితిని. వారి యచ్చెరువునకు మేరలేదు." అని భూపతిరాజుతోఁ జెప్పెను. అతఁడేమియు మాటువలుకక కొంతసేపైన పిమ్మట 'మిత్త్రమా! నేఁడు గదా నాకు నేత్రోత్సవమైనది. నాజన్మము తరించినది.' అని యనెను. సూర్యాస్తమయమయ్యెను. అహస్కరున కర్ఘ్యములు విడుచుటకై యందఱుచనిరి. వెనుక గుసగుసలాడుచు శోభనాద్రిని నిందించినభటులాతఁడే తమదొరయని తెలిసినప్పు డపరిమితభయమంది యతఁడు కనుపింపఁగా గజగజవడఁకుచు వినమ్రులై నమస్కరించుచు నిలిచిరి. భూపతియుఁ బ్రసాదభాసురంబగు నాననంబుతో వారివంకఁజూచి వారి వెఱపుఁబాపెను.

## పండ్రెండవ ప్రకరణము.

### వకీలు.

ఆదినమున నరసింహరాజాదులు వేమకల వెల్లిగో మునిఁగియుం డిరి. మఱునాఁడు భూపతిరాజు ప్రభాతమున మేల్కాంచి కామేశ్వరరావుతోఁగూడి కోట యావరణమంతయుఁ దిరిగి యచ్చటనశ్వములు, శకటములు, పశువులు, గజములు, పల్లకులు, మొదలగునవియుంపఁబడవలెనో సేవకులకుఁ దెలుపుచు నందలి పదార్థములన్నియు నొక క్రమమైనస్థితిలో నుంచుటకై యాజ్ఞ చేయుచుండెను. ఏమఁగులమున్నగున వింతకుఁ బూర్వమే కామేశ్వరరావు తెప్పించియుంచెను. అతఁ డనేకసంస్థానాధిపతులతో స్నేహముగలిగి యన్నివ్యవహారములయందు నాఱితేఱిన వాఁడగుటచే నేలోటును లేకుండఁ జేసెను. జాముప్రొద్దెక్కునరికి రాజబంధువు లందఱును భోజనములశాలయందుఁ జేరి పంచభక్ష్యపరమాన్నములతో విందారగించిరి. తరువాత నందఱు నించుక విశ్రమించిరి. భూపతిరాజు నాదరింపనిబంధుగులు లేరు. నారాయణరాజు కూఁతులతో ‘ అమ్మా, మీరు మీపెద్దమామతో జాగ్రత్తగా మాటలాడవలెనుసుఁడీ. సదా యతనికిష్టకార్యములనే చేయుచుండవలెను. ఎటులో యతనిదయకుఁ బాత్రులై యతనియాస్తిలోఁ జాలవఱకు సంపాదింపవలెన ’ ని చెప్పెను. వారునటులే వర్తించుచుండిరి. భూపతిరాజందఱను సమానముగానే గౌరవించుచుండెను. ఒక్క తమ్మునియందుమాత్రమెక్కుడు ప్రేమఁజూపుచుండెను. అది సహజప్రేమ. దాని కాక్షేపించువారెవరు? అరవిందను బైకి మేనఁగోడండ్రతో సమముగానే చూచుచుండెను. అతఁ డందఱను దీసికొని యింద్రమందిరమునకుఁబోయెను. అచ్చటి చిత్రపటముల నవలోకించుచు విరతలఁ దిలకించుచుఁ దలకొకమూలను

దిరుగుచుండిరి. అరవింద తండ్రితో నొకమూలనుండెను. తోడియల్లుం డ్రిద్దఱొకచక్కఁ జూచుచుండిరి. అప్పసెల్లెండ్రు నలువురు మందిర మంతయుఁ గలయఁదిరుగుచుండిరి. భూపతిరాజుమాత్ర మొకపూర్వపు మహారాజుపటమ్మువంకఁ దదేకదృష్టితోఁజూచుచు నిలిచియుండెను. నా రాయణరాజు కూఁతులిరువురును విడిపోయి ప్రక్కనున్న యొకగదిలోనికిఁ బోయి యచ్చట నొకతెరఁగప్పఁబడిన పెద్దపటమును జూచిరి. వారిలోసుబ్బ మ్మ యవనికనొత్తిగింపఁబోయెను. రెండవయామె 'చెలియలా! దానిజో లికిఁ బోకుము. నాన్నగారియాజ్ఞను వింటివిగదా. మనకు సాధ్యమై నంతవట్టు మామకు నమ్మకముఁబుట్టించునట్లే వర్తింపవలెను. అప్పు డీరాజ్యమంతయు మనకే యిచ్చివేయును. ఇంతధనమున్నది, యెవఁడు తినుటకు? కొడుకులా? కూఁతులా?' యని మెల్లగాననెను.

మొదటి—(ఇటునటు పరికించుచు) నేను నాజాగ్రత్తలోనుంటిని. కాని చిన్నమామయు నతనికూఁతురును నింతకుమునుపే యాతనిని బుట్టలో వైచుకొనిరేమో?

రెండవ—అబ్బే! లేదు లేదు. నిన్నటినుండియుఁ గనిపెట్టుచుంటివా? అతఁడరవిందను మనలను సమభావనతోనే చూచుచున్నాఁ డు. (అంత వెనుకకుఁదిరిగిచూచి భూపతిరాజునాకృతి కనుపింపఁ గాఁ దొట్రుపడి) ఈపెద్దపటము—

మొదటి—ఎవరునులేరు. భయపడకుము. అని జవనికను బ్రక్కకుఁదీసి, కుడికాలుపై నిలువఁబడి రెండవచరణముయొక్క వేళ్ళుమాత్ర ము కుడిప్రక్కనేయూని, కాంచనచేలమును మొలనూలిగజ్జె లును బ్రకాశింప, దూరితతారళ్యవిస్తారితనయనములయందు విలాసమొప్ప, మందస్మితభాసురంబగు వదనారవిందము ముద్దు లుమూటఁగట్టినట్లుండ, నధరపల్లవమున మురళిఁబూని, మొ దవులుసయితము కొఱుకులుమాని రిక్కించిన చెవులతో సంగీత

రసము నాస్వాదించుచుఁ గదలకుం[illegible]యుచు నట్లు [illegible]నము సేయు చున్న శ్రీకృష్ణువిగ్రహము [illegible]వారలిం[illegible] జి[illegible]పఁబడి యుంటఁగనెను. అంత మర[illegible]డగపడినట్లుశోఁ [illegible]భ్రమపాటుతోఁ దెరనుమూసి[illegible]యావలకువచ్చిరి. భూ[illegible] రాజు నారు మొదటఁజూచునప్పటి[illegible]లె [illegible]నాగమహారాజు [illegible]వంక నిశ్చలవీక్షణములతో న[illegible]చుచుండెను. అ[illegible]వారిలో నొకతెఁబ్రతికినామే అతఁ [illegible]మనభ్రమ యే’ యనెను. వారు త్రేపతో సంభాషించిమాచిరి. అతఁడేమి యు మార్పొందలేదు. ముఖ మెప్పటివలెనే యుండెను. వారి ప్రాణములు గూటఁబడియెను. ఈవిషయ మల్పమైనను జదువరులు జ్ఞప్తియందుంచుకొనుటలెస్స. జాము ప్రొద్దున్నదనఁగా నింద్రమందిరమున వీణాగానము ప్రారంభింపఁబడెను. శంకర శాస్త్రియను నొకగొప్పవైణికుఁడు బొబ్బిలినుండివచ్చి పాడుటకు నియమింపఁబడెను. గ్రామములోనితగుమనుష్యు లాదటను విచ్చేసిరి. గాయకుఁడు తనగానకళానైపుణ్యముచేత సభ్యులన చేతనులఁ గావించెను. అందఱును వానిని బుంభావసరస్వతి గా నేతలఁచిరి. నీరెండయుండఁగా గానమాపుచేసిరి. కామేశ్వర రావుగా రప్పుడే తమయూరికిఁబయనమగు చుండిరి. ఆయన నరసింహారాజుతో నేదో రహస్యముగా మాటలాడి రాజుగారి యొద్ద సెలవుపుచ్చుకొనుటకై వచ్చెను. వారిట్లుసంభాషించిరి.

భూప—ప్రియమిత్రమా! లెక్కలన్ని యుసరిచూచితిరా? ఏమి యుమిగు

కామే—తమసెలవుప్రకార మన్నియుఁ బూర్తి చేసితిని. [ఇలేదుగదా.

భూప—మీకుఁగృతజ్ఞుఁడను. సగేశాని మావెంకటపతినిగూర్చి మిమ్మొ మిము నడుగులే మఱచితిని. వాఁడు మీాపన్నిధికివచ్చినదాది యే మిజరగెనో చెప్పుఁడు.

కామే—సుమా రొక నెలక్రింద నొకనాఁటి యుదయమున మీ వెంకటపతిరాజుగారు నాయింటికివచ్చి కొన్ని లేఖలందిచ్చి, యందలి యంశములంజదివి మరలఁ బ్రత్యుత్తరమిచ్చువఱకుఁ దమకు నాయొద్దనే యాయన నుండుమనిరని చెప్పెను. ఆమాటలవలనఁ దమయుద్దేశమును గ్రహించి యాతని నాసీనునింగావించి తమ కమ్మలను జదివితిని. పిమ్మట నతనితోనిట్లంటిని—వెంకటపతిరాజుగారూ! మీ చేతికిజాబులిచ్చిన శోభనాద్రిరాజుగారు, మీరు జన్మింపకపూర్వము వ్యాపారమునిమిత్తము సింహళమున కేగి దారిలో సముద్రమునకుఁ బ్రాణములర్పించిరని మీరంద ఱనమ్మిన మీ పెదమామయగు భూపతిరాజుగారేయని మీరెఱిఁగియేయున్నారు—నాపలుకులువిని యతఁ డాశ్చర్యపడినట్లు కనుపించెను మరల నిట్లంటి—అయ్యా! మీ ర వెఱఁగుపాటు నటింపనక్కఱలేదు. మీరు చంద్రముపాలెమునకుఁబోయిన దినమందే మీరాతని రహస్యమును గ్రహించినట్లు మీ మాటలుఁ డెలుంగు. అతని రహస్యాంశములుగల తాటియాకుల పొత్తమును మీరు చాటుననుండిపరిశీలించినవిషయమాతఁడు గణింపకపోవచ్చును. కాని మీరు ప్రచ్ఛన్నముగ వివాహమాడియు నది కప్పిపుచ్చి మీయరవిందకరమును గ్రహించుటకై ప్రయత్నముచేయుటచూచి యాతఁడు మిగులఁగినిసెను.

భూప—ఇంతటికర్ణకఠోరమైనపలుకులు వానివీనులఁబడినప్పుడు వాఁడెట్లుసహించి యూరకుండెను?

కామే—ఊరకొనకేమనఁగలఁడు? మిగులఁ గలవరపడినాఁడు. మొగమునఁ గత్తివాటునకైన నెత్తురులేదు. ఏమోపలుకఁబోయెను. కాని తడఁబడెను, అప్పుడుపదపడియిట్లుచెప్పనారంభించితిని. అయ్యా, మీకున్న యైశ్వర్యమును మీ పెద్దమామకుఁ దెలియు

ను. కాని చిన్నతనముచే దానిని బోఁగొట్టుకొనినందులకు త
మించి మరల మీకొకదారి నాతఁడు చూపఁదలఁచుకొన్నాఁడు.
మీరుమాత్రము తిరుగఁ జంద్రమపాలెము పోఁగూడదు. అర
విందను వివాహమాడుటకై జతనము సలుపరాదు. ఈసరికి
మీచెడ్డనడతయంతయు నామెకుఁ దెలిసియుండునుగాన నీకనా
మెతో నుత్తరప్రత్యుత్తరములు జరపుటయు నిరర్థకమే. మఱి
యు మీపెదమామవిషయమైనయేకాంత మేకాంతముగానే
యుంపవలయును. నారాయణరాజాదులతోనైనఁ జెప్పరాదు.

భూప—ఇంతనిష్ఠురముగాఁబలుక నతఁ డేమిమూర్వలికెను ?

కామే—'మీకొకదారి నాతఁడు చూపఁదలఁచుకొన్నాఁడు.' అని నేన
న్ననుడులు వానికిఁ గొంచెము ధైర్యమునుగల్గించినవి. నీటముం
చినఁ బాలముంచినఁ దమదేభారమనియుఁ దమయానతి శిరసా
వహింతుననియుఁ జెప్పినాఁడు. తనయేకాంతవివాహము నొప్పు
కొనెను. అందునుగూర్చి పశ్చాత్తాపపడుచున్నట్లుచెప్పెను. కా
ని మనఃపూర్వకముగ మోహించిన యరవిందవిషయమైన యా
శనుమాత్రము విడనాడుట తనవశముకాదని వచించెను. ఏదె
ట్లయినను మంచిదారినిఁ బడఁగలఁడని తోఁచుచున్నది.

భూప—మీవాక్యములనుబట్టిచూడ వాఁ డించుకపశ్చాత్తాపమునకు
వచ్చినట్లు నాకుందట్టుచున్నది. కాని యింకను వానిని నమ్మఁజా
లను. వానిది స్థిరబుద్ధికాదు.

కామే—తర్వాత నతనితో నిట్లుపల్కితి—మీరు చేరఁదీసినకాంతను
విడిచిపెట్టుటనుగూర్చి మీరెట్టియేర్పాటులుచేసికొన్ననుసరియే.
అందునుగుఱించి నేనుపదేశముచేయువాఁడనుగాను. ఆకష్టసుఖ
ములు మీరే చూచికొనుఁడు. నేనిదె మీమేనమామయాజ్ఞా
నుసారముగఁ బదివేలరూప్యముల నిచ్చుచున్నాను. వానిని వ

ర్తకముచేఁ బెంపొందించుకొనియెదరో, మఱియేమార్గముచే వృద్ధిఁజేసికొందురో మీచిత్తము. మీరు దీనిని దుర్వ్యయముఁ జేసితిరేని మీమామకుఁ గోపము వచ్చి శిక్షింపఁగలఁడు. మీరు సద్వర్తనముఁ గలవారై యాయనకు ముదముంగూర్చితిరేని యాయన మిమ్ముఁ గోటీశ్వరులుగఁ జేయఁగలఁడు. ఇదిగో ధనము—అని పదిసంచులతో రూపాయిల నిచ్చితిని.

భూప—అప్పు డతఁడేమనెను?

కామే—ఏమనుటకేమున్నదిః సంతోషమును దెలిపి తనభవిష్యద్వర్తనముంగూర్చి యనేకప్రమాణములఁ జేసెను.

భూప—వానికి ధనమిచ్చినపిమ్మట వానినడతె యెట్లుండెనో మీకుఁ దెలిసెనా?

కామే—లేదు. నేను మీసంస్థానమును విలుచుట, తగినయేర్పాటులను జేయుటతోనే యీమధ్యకాలము కడచిపోయినది. నేఁడు మరల నక్కడికిఁ బోవుచుంటిగదా. అన్నియుఁ గనుఁగొని తమపేరఁ గమ్మవ్రాసెదను. సెలవు దయచేయవేఁడెదను.

భూప—అయ్యా! మీరు నాకొఱకుఁ జాలఁగష్టపడితిరి. ఇంకను బడనైయున్నారు. మీరు నాకుఁజేసినసాయమునకేమియిచ్చినను మీఋణము తీఱదు. ఇదె రత్నాలసరమును దుస్సాలువును బారితోషికముగ నిచ్చుచున్నాను. వీనిని గైకొనుఁడు. అని చేతికిచ్చి నమస్కరించెను. అతఁడు పరమానందభరితుఁడై పల్లకిపై నెక్కిపోయెను.

అతఁడు వెడలిపోయినతోడనే తనవారిని గలసికొని మఱఁదులను మేనకోడండ్రను నింక నొకమాస మచ్చట నుండుఁడని వినయపూర్వకముగఁ గోరెను. వారు సమ్మతించిరి. అవ్వలఁ దమ్ము నొకయేకాంతమందిరమునకుఁ బిలిచి సోదరా! ఏకోదరులమగు మనము భగవత్కృపచే

నిన్నాళ్ళకుఁ గూడికొంటిమి. ఎల్లకాలము మనము కలసియుండవలెనని యే మనకుఁ గోర్కి యుండును. కాని నీవు నీయింటిని వాఁకిలిని విడిచి పెట్టరాదు. మఱియు నిప్పుడు సేద్యమువిషయమునఁ గృషిచాలఁగఁ జేయవలసియున్నది. అదనుదప్పిన నేలఫలింపదు. కావున నీవు రేవు బయలుదేఱివెళ్ళుము. మనయరవింద నాతోనున్న నాకుఁ జక్కఁగాఁ గాలక్షేపమగునుగాని, నీవొక్కఁడవేయుండుట కియ్యకొనను. ఆమెనుగూడఁ దీసికొనిపొమ్ము. నేను రమ్మనినపుడును, నీకుఁ దీరుబడియైనపుడును, దప్పక యరవిందతో నిచ్చోటకురమ్ము. క్షేమోదంతమును దఱచు తెలుపుచుండుము. నేను గొంతకాలము నారాయణరాజాదులతో వినోదించుచుండెద. అప్పుడప్పుడు నేనుం జంద్రమపాలెము వచ్చుచుండును. అని చెప్పెను. నరసింహరాజు 'చిత్తమటులేయొనర్తు' నని చెప్పి 'అన్నా! మీరునాయింట నాలుగునెలలుండియు నొక్కనాఁడేని మీసత్యవృత్తాంతమును జెప్పి నాహృదయము నేలయనిర్వాచ్యానందరసముచే నింపకపోయితిరి' అని యడిగెను. అతఁడు 'తమ్ముఁడా! ఈనాల్గునెలలు నీమైత్రి ననుభవించితిని. నీయొక్కయు నీకొమార్తెయొక్కయు హృదయపారిశుద్ధ్యములను గ్రహించితిని. ఇతరుల నడవడులును గనిపెట్టితిని. మతత్యాగముఁ జేసితినని పరితాపమొందుచున్న నేను మీప్రేమరససిక్తహృదయుఁడనై యుపశాంతిని బొందితిని. ముందే నాచరితమంతయుఁ జెప్పితినేని మీనడతలు నాకుఁ దెలియవు. నాహృదయతాపము చల్లాగదు. అందుచేత నట్లుచేసితి' నని మాఱువల్కెను.

మఱుసటిదినమున నరవిందానరసింహరాజులు చంద్రమపాలెమునకై ప్రయాణమైరి. మహాజవసంపత్తిగల యశ్వశకటమొకటి వారికొఱకుఁ దేఁబడెను. భూపతిరాజరవిందను గాఢాలింగనముంజేసికొని ముద్దుపెట్టుకొని 'అమ్మా! తఱచువచ్చుచుండుమీ' యని యామె తనపాదము

లకెఱుఁగఁగా నిండుమనంబుతో దీవించెను. తమ్మునిగూడ సాదరముగ నాశీర్వదించి యిరువురను వీడ్కొలిపెను.

అరవింద యింటికిఁ జనినతరువాత నొక్కరుకయుఁ దోఁటలో నికిఁబోయి కాండేగ్రిగులఁకోటలో జరిగిన సంగతులంగూర్చి తలపోయ సాగెను. అదంతయుఁ గలగా నామెకుఁదోఁచెను. 'ఏమి? కడుఁబేదయగు ముసలివాఁడు, పరుఁడు, పెద్దతండ్రి యయ్యెనా? మహారాజ్యరమాధు రంధరుఁడయ్యెనా? అంతయుఁ జిత్రకథవలెఁ గాన్పించుచున్నది' అని తనలోఁ దాననుకొనెను. నాఁటి సోదెవృత్తాంతము జ్ఞప్తికివచ్చెను. దా నినెన్ని విధముల మఱచిపోవలెననిన మఱపునకువచ్చుటలేదు. పితృవ్యుఁ డు పలికినరీతి నాపద్రిబోధవాక్యము లీడేరునేమోయను నాస పొడము చుండెను. వెంటనే మనకట్టి యాశలు తగవనుకొనుచుండెను. అట్టితఱిఁ జెట్లయాకుల గలగలధ్వని వినవయ్యెను. ఆమె భయమందెను. బెదరు తో నలుదిక్కులఁ జూచుచుండెను. ఒక్కనిమేషమునకు వెంకటపతిరా జామెకు లోచనగోచరుడయ్యెను. ఆమె నిశ్చేష్టురాలయ్యెను.



## పదుమూఁడవ ప్రకరణము.



### సమాగమము.

వెంకటపతిరాజు మొగము చిన్నఁబోయియుండెను. అతఁడు దుః ఖములో నున్నాఁడని చెప్పక చెప్పుచున్నది. వాని నుదుటియందు మై లబొట్టుకూడ స్పష్టముగాఁ గాన్పించెను. అరవిందకు వానిఁజూచినతో డనే యమితమైన క్రోధ ముదయించెను. దేహము కంపించెను. నిర్ఘాత ముపడినదానివలె నిలువఁబడిపోయెను. అతఁడామెను సమీపించి మోఁ

కరించి ‘ అరవిందా ! క్షమింపుము. నాతప్పులు క్షమింపు ’ మని వేఁడెను. అరవింద చెదరినహృదయమును గుదురుపఱచికొని ‘ బావా ! నీవుచేసిన తప్పునకు నిన్ను క్షమించితిని. కాని యంతమాత్రమును నీకును నాకును గల స్నేహము పునర్జీవముకొందఁగలదని భ్రమపడకుము. నీవెంత దోషివైన క్షమింపఁ గోరుచుంటివి గావున నిన్నేమియు ననను. ఇఁక నీవుమాత్ర మెన్నఁడు నాయెదుటికి రావలదు. ’ అని వచించి గిరుక్కున మరలిపోవుచుండెను. వెంకటపతి యాతురముతో ‘అయ్యో ! అరవిందా ! నాగతి యింతియేనా ? ఈ దీనుని మాట యొక్కటివిని వెళ్ళఁ గోరుచున్నాను. కోరుటయేకాదు వేఁడుచున్నాను, ప్రార్థించుచున్నాను. ’’ అని యఱచెను.

అర—నీ కేదైనఁ జెప్పుకొనవలసినదున్న నాజనకుని సమక్షమునకు వచ్చి చెప్పుకొనుము—అని మెల్లగాఁ బోవుచుండెను.

వెంక—అయ్యో ! పోకు. పోకు. నీతండ్రి యెదుటికి వచ్చుటకు నాకు మొగము చెల్లదు.

అర—అతని యెదుటికే నీవు రాలేనప్పుడు, నాయెడ నపచార మొనర్చియు నెట్లు నా సమక్షమునకు రాఁగల్గితివి?—అని యించుక వడిగ నడవ మొదలిడెను.

వెంక—అయ్యో ! నామొఱాలింపవా ? నే నాత్మహత్యఁ జేసికొనవలసినదే ?—ఆపలుకులు ములుకులవలె నామెచెవులకుఁ దగిలెను.

ఆమె నవనీత హృదయయని యిదివఱకుఁ జెప్పియే యుంటినిగదా. ఇప్పుడామెకుఁ గారుణ్య ముదయించెను. ఆగిపోయినది. ముందునకడుగుపడలేదు. మరల వెంకటపతి యామెను సమీపించెను.

వెంక—అరవిందా ! ఇఁక బ్రతుకఁజాలను. పాపకార్యములు నాచో మనస్సును దినివైచుచున్నవి. మరణమే శరణము—అని వాపోయెను.

అర—ఓయీ! నీకట్టి నిశ్చయమైన పశ్చాత్తాపమే కలిగినయెడల నీవే ల దీనావన దీక్షా పరతంత్రుఁడగు లోకరక్షకుని శరణువేఁడవు? పశ్చాత్తాప మనఁగాఁ జేసిన దోషమునకు వగచుటమాత్రమే కాదు. సాహసించి యాత్మహత్యఁ గావించుకొనినను పాపము పోఁ జాలదు. నీవు పరితాపపడుచు, నిఁక నెన్నఁ డట్టియకృత్య మును జేయకుంటకుఁ గృతి నిశ్చయుఁడవై, క్రియలలో నీ మంచితనమును గనఁబఱుపవలెను. అంతఁ గ్రమముగా నీదోష ములను లోకులు మఱచిపోవచ్చును.

వెంక—అరవిందా! నీపలుకులు నాపీనుల కమృత ధారాపాతములువ లె నున్నవి. నాయందు నీ కెంత యనహ్యము కలిగినను నేను నీ కన్యుఁడనుగాను. నన్నుఁ ద్రోసిపుచ్చఁగలవుగాని మన బాంధ వ్యమును బోఁగొట్టఁగలవా? నీ వశముకాదు. కావున నాకు సద్బుద్ధులను గఱపి నన్ను నీతిమంతునిగాఁ జేయుము. నా పా ట్లన్నియు వింటివేని నీకు జాలి కలుగక పోదు. నాప్రారబ్ధవిశేష ముచేత నాకా మాలతితో సంబంధము తటస్థించినది. నేను దాని టక్కరి మాటలలోఁబడి మోసపోయితిని. కాని యది యు నీమధ్య చనిపోయినది. ఈమైల బొట్టదియే.

అర—(ఆశ్చర్యముతో) ఆలాగునా? పాపము చనిపోయినదా!—అని రెండునిముసము లాలోచనలో మునిఁగియుండె. వెంకటపతియొ క యన్యజాతిదానిని, కులటాంగనను వివాహమాడితి ననుటయు నది మరణమొందిన నతఁడు మైలఁబట్టుటయుఁ దలఁచుకొని వా ని యవివేకమునకుఁ జింతించుచు నిలిచెను.

వెంక—అవును. మరణించినది. అదెంత దుర్మార్గురాలైన నేను పెం డ్లియాడిన దగుటచే లోకులకు వెఱచి మైలమాత్రము పట్టు చున్నాను.

అర—సరే. ఏమందువు ? ఇఁక వెడలిపొమ్ము.

వెంక—ఒక్క మాట. ఒక్క మాటయే. వినుము. నాదుఃఖమువాపసమర్థురాలవు నీవే. నేనింత రహస్యముగా నిచ్చట కేందుకు వచ్చితినో నీతోఁ జెప్పలేదు. నేను—

అర—ఓయి ! నీవు నారక్తసంబంధుఁడ వగుటచే మరల నీతో మాటలాడుచుంటిని. నీకు బుద్ధులను గఱపుచుంటివి, లోకజ్ఞాన మంతగా లేనిదానను. పల్లెటూరిదానను. అఁడుదాన. నీకు బుద్ధులు గఱపుట కెంతదాన. అది నావల్లగాదు. కొన్నిదినములు నీతో స్వప్నానందము నొందితిని. అకల కల్లయైనది. అది మరల రాదు. నామాటలుశ్రద్ధతోవినుము. నీయుంపుడుకత్తెయో—భార్యయో—ఆమె నేమందువో—గతించినదని నేనేమైన జాలిపడి క్రమ్మఱ నిన్నుఁ జేకొందు ననుకొంటివేమో? ఎన్నఁటి కట్లు చేయును. నీ వాయాసను వదలుకొని పలుకఁదలఁచినదేమైన నున్నఁ బలుకుము.

వెంక—అరవిందా ! నాకునాహ్లాదముం గల్గింతువా? మన స్నేహమింతేటిదేనా ? నిన్నెంతగాఁ బ్రేమించితినో భగవంతునకే యెఱుక.

అర—ఆ విషయమై నోరెత్తవలదని చెప్పితిఁగదా. నీవు వెంటనే నా యెదుటినుండి పొమ్ము. పోకుంటివేని నేనే లోనికిఁ బోయెదను.

వెంక—పోకు. పోకు. ఒక్క నిముసమే. మఱొక్క మాటయే.

అర—చెప్పు. కాని నీ ప్రేమవిషయమై యొక్కపలుకైనఁ బలుకుటకు నీ కధికారము లేదు.

వెంక—నీ సదుపదేశము ననుసరించి, పశ్చాత్తాపమునొంది, యిఁకముందు పూతచరిత్రుఁడనై, పావిత్ర్యమునకు జగమునఁ బేరువడసితినేని, రెండు మూఁడేండ్లయిన పిమ్మటనైన నన్ననుగ్రహము తోఁ జూతువా ?

అర—అనుగ్రహమున కేమి ? నిన్ను సన్నిహిత బంధువునిగ నాదరింతు
ను. అంతకంటె నావలన నీ కేమియుఁ గలుగనేరదు.

వెంక—అరవిందా ! న్యాయమా ? నాఁ డిచ్చటనే కదా నాప్రేమకు
సమ్మతించితివి ? నాఁ డట్టియనురాగాంగీకారసూచక దృష్టు
లేమి ? నేఁ డిట్టి సక్రోధరూక్ష వీక్షణము లేమి? నాఁ డట్టియ
మృతప్రాయ వచనములు పల్కుటేమి? నేఁడిట్టి విషతుల్యవా
క్యము లాడుటేమి ?

అర—అప్పుడజ్ఞానాంధకార నిమగ్ననై యుంటిని. సులువుగా నీమా
యాజాలములోఁ దగుల్కొంటిని. ఇప్పు డట్లుగాదు నీపలుకులిఁ
క నాతల కెక్కవు. మాఱుమాటాడక పొమ్ము.

వెంక—పోనీ. ఇంతే నాభాగ్య మనుకొందును. కాని యొక్కవరము
మాత్రము కృపసేయకుము.

అర—అది యేది ?

వెంక—శోభనాద్రిరాజు పెద్దమామయే యని తెలిసినది. అతఁడు న
న్ను నీచులలో నీచునిగాఁ దలఁచుచున్నాఁడు. ఇప్పుడు నన్నతఁ
డే పోషించుచున్నాఁడు. అతఁడు నానడతనుగూర్చి చెడ్డనువినిన
నాకొంప మునిఁగిపోవును. నీయొద్దకు రాననియు నీయాస వద
లుకొనియెదననియు నేను వాగ్దానము చేసియున్నాను నేఁట్లు
నీకడకు రహస్యముగా వచ్చుటతనికి దెలిసెనేని కోపమువచ్చి
నాకుహానిచేయును. కావున దయయుంచినీవు నారాకమాత్రమా
తనికిఁ దెలియనీయవద్దు. అదే కోరిక.

అర—నీవు మరల నేకాంతముగా నీరీతి నాయొద్దికి రానని ప్రమాణ
పూర్వకముగా నొప్పుకొంటివేని, నీరాక మాపెదతండ్రికె
ఱింగింపను.

వెంక—సరే. పోయివచ్చెదను. దయమాత్రముంచు.

అని వాఁడు పెరటిదారినే వెనుకకుఁ బోయెను. అరవింద చిరా కుగానున్న మనసుతో లోపలికిఁబోయెను. కష్టముమీఁద నా మెకు మనశ్శాంతి గలిగినది. అరవింద కాండ్రేగులనుండి వచ్చి మూఁడు దినములయ్యెను. నరసింహరాజుగారి కోఁటమాలి నారాయణస్వామి కొ మకునకు బాలరోగమువచ్చినట్లామెకుఁ దెలిసెను ఆమె వెంటనే తం డ్రితోఁజెప్పి గురులింగము కొఱకుఁ బిఠాపురి కొక మనుజుని బంపె ను. అంతటితోఁ దృప్తినొందక తాను స్వయముగా నాకాఁపువాని యిం టికిఁ జూడఁ బోయెను. వానియిల్లూరిబయట నరసింహరాజు పొలము దగ్గఱనున్నది. ఆమె యక్కడికేగుసరికిఁ బిల్లవాని మొగముమీఁదఁ బొగాకుచుట్టతోఁ గాల్చిరి. బిడ్డకు స్మృతి వచ్చెను. నారాయణస్వామి భార్య వెంకమ్మ యరవిందనుజూచి ' యిదిగో అమ్మగారే వచ్చుచు న్నారు. ' అని యెదురుగఁబోయి తీసికొనివెళ్లి యొక యీతాకులచా పమీఁద నామెను గూరుచుండ నియమించెను. అరవింద పసివాని క్షే మమరసి, నెమ్మదిగానుంట యెఱింగి సంతసించి, త్వరలో గురులింగము ను రాఁబోవుచున్నాఁడని వచించెను. అప్పు డరవిందయు వెంకమ్మయు నిట్లు మాట్లాడుకొనిరి.

వెంక—అమ్మా! తమరు స్వయముగా రానేల? ' నౌకర్ల ' యం దింత దయగల తల్లివి, నీకెట్టి యదృష్టము పట్టునో?

అర—ఓసీ! మీరును మావంటివారే. సుఖదుఃఖములు మనకు సమా నములే. ఐశ్వర్యమున్నంతమాత్రముచేత విఱ్ఱవీఁగనేల? అది స్థిరముగానుండునా? మనమందఱ మొకతండ్రిబిడ్డలమే. మన మన్యోన్యమును బ్రేమించితిమేని యతఁడు మెచ్చును. అదియు నుగాక భృత్యులు సుఖదుఃఖముల నరయని యజమానులేల?

వెంక—తల్లీ! నీకు నీవే సాటి. నూకాలుతల్లికృపవలన నీవు చల్లఁగానుండ వలెనమ్మా. అమ్మామీకాఁ పొకమాట చెప్పినాఁడు. అది నిజమా?

అర—ఏమని చెప్పినాఁడు?

వెంక—మన యింటిలోనున్న ముసలయ్య బాబుగారి యన్నయంటకా దా? ఆయన గొప్పరాజ్యము కొన్నారంటకాదా? అదంతయు నిజమేనా? చిన్నప్పుడు మాయమ్మ నాకుఁ గతలు చెప్పుచుండెడిది. అట్టికత యేమో యనుకొన్నాను.

అర—నిజమే. అతఁడు మా పెద్దతండ్రియే. వానిదంతయుఁ జరిత్రకథయే.

వెంక—అమ్మా! ఆయన యొకనాఁడు మాయింటికివచ్చి తాగుటకు మంచి పాలిమ్మని యడిగినారు. నేనప్పుడే పితికిన మా పుల్లావు పాలు సోలెఁడు తెచ్చి యిచ్చినాను. వానిని బుచ్చుకొని మా పిల్లలచేతులలోఁ దలకొక రూకయుఁ బెట్టినారు. బాబూ! ఇంతటి కానుకకుఁ దగమని నే నన్నాను. 'అమ్మా! మీరుబీదలే. పుచ్చుకొని యేమైనఁ జేసికొనుఁడ' ని చెప్పినారు.

అర—అవునతఁ డట్టివాఁడే.

వెంక—అమ్మా! ప్రభాకరుఁడుగారు మరల రానేలేదా? ఆయన వెళ్లిపోవునపుడు మాయింటికిఁ వచ్చిచెప్పి మఱిపోయినారు.

అర—అతఁడు మీగృహమునకు వచ్చెనా?—అని వానిసిగూర్చి తలపోయసాగెను. వాని రూపగుణము లామెకన్నులకుఁ గట్టినట్లుండెను.

వెంక—వచ్చెను. అమ్మా! మీ కెఱిఁగియే యుండునతనికత. మీ కాఁపు తండ్రి యొకనాఁడు ప్రొద్దునలేచి బయటికిఁ బోవుచుండఁగా దారిలో నొకచేనిగట్టుమీఁద మూఁడు నెలల పిల్లవాఁడు, చందమామవంటి మొగముగలవాఁడు, మంచి చొక్కా తొడిగికొన్నవాఁడు, కనఁబడినాఁడఁట. అతఁడు కాలుసేతు లాడించుచు, గలగల నవ్వుచుఁ బండుకొనియున్నాఁడఁట. గొప్పయింటి

బిడ్డలాగున నున్నాఁడఁట. అట్టి బాలుని దలిదండ్రులు వదలిపె
ట్టుటకుఁ జేతులెట్లాడెనో ? ఆబిడ్డను మామామ యెత్తుకొని
వచ్చుచుండ మనయూరి వెంకటరాజుగారు చూచి యీ పిల్ల
వానిని దమకిమ్మని యడిగి పుచ్చుకొని మంచి పంచెలచాపు
బహుమాన మిచ్చిరంట. ఆ పిల్లవాఁడు వారి యింట నాతేం
ట్లు పెరిఁగినాఁడు. తరువాత వారి సంసారము చితికినది. దినము
గడచుటే కష్టముగానుండి మీనాన్నగారి కాబిడ్డ నప్పగించి
నారు. అప్పటినుండియు నాతఁడు మీయింటనే యున్నాఁడు.

అర—(అంతయు విని తలయూఁచి, పాపము అని మెల్లగానని) ఓసీ !
అతఁడు వెడలునప్పుడు మీతో నేమని పోయెను ?

వెంక—అతఁడు మాగుడిసె దగ్గఱ నిలువఁబడి కొంతసేపుదాఁక మాట
లాడక నిలిచెను. ‘ ఏమి బాబూ ! ఈలాగున వచ్చినా ’ వని
మీకాఁ పడుగఁగా నతఁ డిట్లు చెప్పెను. ‘ఓరీ! నారాయణస్వా
మీ ! నేను నరసింహరాజుగారి యిల్లు విడిచిపెట్టుచున్నాను.
నాకు వారితో నేమియుఁ గలహము రా లేదు. పరదేశమునకుఁ
బోయి నాయంతట నేనే సంపాదించుకొని బ్రతుకవలెనని పో
వుచున్నాను. అంతియే. నన్ను మఱవకుఁడు. ’ అతనిమొగము
మాత్రము దీనముగానున్నట్లు కనుపించెను. ఆవల నొక్క ని
ముసమాగి ‘ ఓరీ ! మా యరవిందనుమాత్ర మడిగితిననియా
మె యొక్కతెయే యున్నప్పుడు చెప్పుము. ’ అని పలికినాఁడఁ
ట. మీ కాఁపు మీతో నామాట చెప్పనేలేదు కాఁబోలు.

ఈ నుడులు విని యరవింద గుండెకరఁగి కన్నుల నీరునించెను.
వెంకమ్మ యామె మోమువంకఁ జూచి ‘ అయ్యో ! అమ్మా మీకూ
రక విచారముఁ గలిగించితినే ’ యని నొచ్చుకొనెను. అప్పు డొకని చె
ప్పులజోడుకిఱ్ఱు వినిపించెను. అరవింద వేవేగఁ గన్నులు దుడిచికొనియె

ను. వెంకమ్మ తోటుప్రాటుతో నిటునటు చూచెను. అంత గురులింగ ము వచ్చెను. అరవింద యతనితో ' ఓయి ! నీ వీపిల్లవానిని జూచి తగిన మందిమ్ము. బిడ్డఁడు కొంచెము స్వస్థపడి పండుకొన్నాఁడు. ' అని చెప్పెను. అతఁడు పసివానినాడిని బరీక్షించి మూఁడుమాత్ర లిచ్చి యరవిందవద్ద సెలవుగైకొని పోయెను. అరవింద బరువైన మనసుతో మందమైన నడకతో వెంకమ్మను దోడుగా నుంచుకొని గృహమునకుఁ జనెను.



## పదునాల్గవ ప్రకరణము.

### నారాయణ కృష్ణమరాజులు.

కాంగ్రెసుల కోటకు నారాయణ కృష్ణమరాజులు వచ్చి నెలకావచ్చెను. ఈ లోపల నరసింహాగా జరవిందతో నన్నుజూచుటకు రెండు సారులు వచ్చెను. వచ్చినప్పుడెల్ల నన్నదమ్ములు కష్టసుఖములు చెప్పుకొనుచు, వినోదముల నానందించుచుఁ గాలముఁ గడపుచుండిరి. వారి యైకమత్యమును జూచి తోడియల్లుండ్రు తమకు ముందు గలుగనైయున్న లాభమునకు భంగము వచ్చునేమోయని భయపడసాగిరి. నరసింహారాజునందు మునుపటికంటె నెక్కువ ప్రేమను నటించిరి. భూపతిరాజిదివఱకే యరవిందా నరసింహారాజుల ప్రవర్తనమును గ్రహించియున్నాఁడు. ఈ మాసములోఁ దన చెలియండ్ర మంగలయొక్కయుఁ గూఁతులయొక్కయు నడవడికలను శోధన చేయుచుండెను. అతఁ డొకతఱి మేనగోడండ్రను దీసికొని యుద్యానమునకుఁబోయి వారితో ముచ్చటించుచు వారి యభిప్రాయములఁ గనుగొనను. మఱియొక సమయమున

వారిచేఁ బాడించి చూచును. వారు కేవల శృంగారరసమును జిప్పిలఁజే
యు జావళులనే పాడుచుండుటయు భక్తిరసమైన గీతముల నెన్నఁడుఁ
బాడకుండుటయు నతఁడు గ్రహించెను. ఇంకను వారి కేయేవస్తువుల
యందు నాటలయందుఁ బుస్తకములయందు నభిలాష కలదో వారి
తో సంభాషించి తెలిసికొనెను. ఒకనాఁడు సంజతఱి షడ్డకు లిరువురు
కోటయావరణ మందలి పూలవనములోనికిఁ బోయి యొక మందారని
కుంజము చాటునఁ గూరుచుండి యిట్లు మాట్లాడఁ దొడఁగిరి—

కృష్ణ—తమ్ముఁడా! మన మిక్కడనుండి బయలుదేఱు దినము సమీపిం
చుచున్నది. బావగారు మనల నింక నిటనుండుటకు బలవంత
పెట్టుదురని నాకుఁ దోఁపదు.

నారా—మనల నుండుమని బలవంతపెట్ట నక్కఱలేదు. యాస్తిలోనెం
త మనకీయఁ దలఁచెనో చెప్పిన బాగుగ నుండును. కాని యేమి
యుఁ దెమల్చి చెప్పఁడు ముసలిముండకొడుకు—వానికి మధ్య
మధ్య గుండెలో బాధ యుండునఁట. ఎప్పుడు చచ్చునో. ఈ న
డుమ నొకనాఁ డాబాధచేఁ బీడింపఁబడుచు ‘బావా! నా కె
ప్పుడో హఠంబున మరణము తటస్థించును. దుర్వ్యాధి నాకు
సంభవించినది’ అని చెప్పినాఁడు.

కృష్ణ—అట్లు నాతోఁగూడఁ బలికినాఁడు కాని యతఁడు మన కేమైన
నిచ్చునను నాశ నీకెట్లు కల్గెను ?

నారా—ఈ యుదయమున నతఁడు నా స్థితిగతులనుగూర్చి యంతయు
నన్నడిగి తెలిసికొన్నాఁడు.

కృష్ణ—నాతోఁగూడ నీ మధ్యాహ్నమే మాట్లాడి, నన్ను నటులే ప్ర
శ్నఁజేసెను. నీస్థితి యెట్లున్నదని నీవు పలికితివి ?

నారా—గంజికైన గతిలేనట్లు మాట్లాడితిని. నేనింద్రభోగ మనుభవిం
చితినని యు, నాభార్య దానధర్మములకు, నగలకు, నాఁడు బి

డ్డలకు, ముద్దు ముచ్చటలకు నమిత్తమైన ధనము వ్యయముచేయు టచేత నాకు ఋణము పెరిగినదనియుఁ జెప్పితిని. నీవు చెప్పిన నమ్ముదువో లేదో కాని ( పకపక నవ్వుచు ) తంటాలుపడి కంటినుండి రెండు మూఁడు నీటిచుక్కలను గూడ రాల్చితిని. వాఁడు వృద్ధుఁడు. మఱియు వానికిఁ దెలివిదేటలు సున్న. నాదంతయు నిజమైన యేడుపేయని నమ్మి చాల జాలిపడినాఁడు.

కృష్ణ—(మందహాసముతో) ఆశ్చర్యముగా నున్నదే! మన కిద్దఱకు నన్నిఁట నొక్క యుద్దేశమే కలుగుచుండును. కొంచె మెచ్చుతగ్గుగా నేను నటులే సంభాషించితిని. నేను గూడ నాయప్పులు ముప్పులు కలుగుటకుఁ గారణము గతించిన నాభార్య మీఁదనే తోసివైచితిని. నీవలెఁ గపట బాష్పములు విడువకపోయినను నేనును వాని గుండె నీరై పోవునట్లుగా భాషించినాను. నామాటలు వినినతరువాత సతనిహృదయములో నాకుఁ దగిన సాయముఁచేయవలెనను బుద్ధి పుట్టకమానదు. తన యాస్తిలో విశేష భాగము నాకిచ్చు ననుకొనెదను.

నారా—ఓ. తప్పక యిచ్చును. తన సంస్థానముమీఁద సంవత్సరమునకు రెండు లక్షలు వచ్చుననియుఁ దనయొద్ద నిరువదియైదు లక్షలు నిలువయుండెననియు నాతోఁ జెప్పినాఁడు. ఆ యాస్తియంతయు నెవ్వరెవరికిఁ బంచిపెట్టునని తలంచెదవు ?

కృష్ణ—నేనతని పెద్ద చెలియలి మగఁడ నౌటచేఁ గాండ్రేగుల సంస్థానము నాకే యిచ్చునని తలఁచెదను. రొక్కము తక్కినవారికిఁ బంచి యిచ్చుననుకొందును.

నారా—సరే నీకు రాజ్య మిచ్చుననుకొందము. నిలువయున్న సొమ్ములో సగమైన నాకిచ్చి, మిగిలిన సగము తమ్మునకు, వాని కూఁతునకు నిచ్చును.

కృష్ణ—బాగుగా నున్నది. పల్లెటూరిబడుగునకంతకంటె నెక్కువ యెందుకు? అయినను ముసలివాఁడు చాలనాలోచనగలవాఁడులే. నరసింహరాజుయొక్క పప్పు వానియొద్దనుడకదు— (అంత నులికిపడి యిటు నటు చూచి) ఆసద్దేమి? ఇచ్చట నెవ్వరును లేరుగద?

నారా—మరేమియును లేదు. చెట్ల యాకులు గాలికిఁ గదలి గలగలమనుధ్వని చేసినవి.

కృష్ణ—ముసలివాఁడు మంచి టక్కరి.

నారా—వాఁడు దొంగ. ఎట్టివాఁడును గాకపోయిన ధనముకొఱకు మతమును విడిచిపెట్టుకొనునా? వాని మతముజోలి మనకేల? మనకేదో పదిలక్షలు పాఱవైచిన నదే చాలును ఆవల వాఁడు మన్నుగొట్టికొనిపోయినను మనకేమి?

కృష్ణ—అవును. అంతకన్న మనకేమి కావలెను?

నారా—ఓహో! వెంకటపతిరాజొకఁడున్నాఁడు. అన్నా! వానిమాట మఱచితిమే!

కృష్ణ—నీవు మఱచిపోయితివేమో కాని, నేనుమాత్రము మఱవలేదు. వాఁడు లెక్కయేలేదు. ఏలయన వానిమీఁదనే ముసలివానికిఁ బ్రేమయుండిన మనతోఁబాటు వానిని గూడ నేల పిలువలేదు? వాని దుష్టచర్య యంతయు నతనికిఁ దెలిసినది. ఈనడుమ నేనును వెంకటపతినడతనుగూర్చి కొన్ని సమిధలు వైచితిని.

నారా—ఆసమిధల నేనెగఁద్రోసెదనులే.

కృష్ణ—ఎందునకైన మంచిది. కీడెంచి మేలెంచవలెను. ముసలివాఁడెవ్వరికేమియు నీయక చచ్చిపోయినయెడల శాస్త్రప్రకారమాస్తియంతయు నరసింహరాజునకుఁ బోవును. వానికిఁ బురుషసంతానము లేదుగదా. అతఁడు తప్పక కూఁతునకే యిచ్చును.

వ్యర్థముగా నింత యాస్తి పరాధీనమై పోవును. కావున మన ము వృద్ధునితో నుంచి చెడ్డలన్నియుఁ జెప్పి నుతిపోవుట మన ముఖ్యవిధి.

నారా—నీవు చెప్పినమాట సత్యమె. ఆలాగుననే చేయుదము. చీఁకటి పడుచున్నది పోదము రమ్ము.

వారు రయమున బసకుఁ జనుచుండిరి. దారిలో వారికి భూపతి రాజు కనుపించెను. వారి మనస్సులు కళుక్కుమనియెను. భూపతి వారి వెఱపులు దీర్పనెంచి 'ఓహో! బావగారులా? ఇంతవఱ కెచ్చట నుండిరయ్యా?' యని యడిగెను. వారతఁడు తమ్ము నామునాడు పాన పనుకడఁ జూడలేదని నిశ్చయించి మనశ్శాంతిఁ బొందిరి. అంత కొంతది దినములు జరగెను. ఒకనాఁడు భూపతిరాజు మఱఁదులతోఁగూడి భుజిం చి తమ్ములము వైచికొనుచు తన రహస్యాగారమునఁ గూరుచుండి యుండెను. కొంతసే పెవ్వారలు మాటలాడక నిశ్శబ్దముగనుండిరి. భూపతిరాజే యిట్లు ప్రసంగము మొదలిడెను.

భూప—ఓయి! మీతోఁ గొన్ని ముఖ్యవిషయములు మాటలాడవల సియున్నది. మీకిప్పుడు తీఱికకలదా?

కృష్ణ, నారా— తీఱికలేకేమి? మీసెలవున కెదురుచు బద్ధులమే— అని యొకరివంక నొకరు ముసిముసి నవ్వులు నవ్వుచుఁ జూచి కొనసాగిరి.

భూప—మూఁడువారములనుండి మీసాంగత్యమున మెలఁగుచుంటిని. మీకు నాయందుఁగల ప్రేమ వినయము మున్నగునవి బోధప డినవి. మీ హృదయము లమలినములు. మీరు పుణ్యజనాగ్ర గణ్యులు. మీరు ముఖ్యతములు గాన నాకు సదుపదేశము చేయఁ గోరెదను.

కృష్ణ—(వెల్లుబ్బి) బావా! నీకు మాయందట్టి సదభిప్రాయము గల్గి నందులకు మిగుల నానందముగా నున్నది. నా సంతసమును వెల్ల డించుటకు మాటలు చాలకున్నవి. నీకుం గావలసిన సంగతులు నాకు ఖదులు నాతమ్ముండు చెప్పను.

నారా—ఏపనిం జేయుమనిన నడుము గట్టుకొని సిద్ధముగా నున్నాను.

భూప—అట్టివారని నే నెఱుంగనా? నాకు గుండెలో జబ్బుగలదని మీకును దెలిసినయంశమే.

నారా—(దుఃఖమునటియించుచు) అయ్యో! పాడురోగము వచ్చినదే. అని యొక్క నిట్టూర్పువిడిచెను.

భూప—చేసికొనిన కర్మఫల మనుభవింపక తీఱునా? ఈలోకమును విడి చిరమ్మని భగవదాజ్ఞ నాకుం గాకపూర్వమే నాయాస్తి నర్హులకుం బంచిపెట్టవలసియున్నది. భోగరాజు కామేశ్వరరావుగారినిగూడ నిందునిమిత్తమే రమ్మని జాబువ్రాసినాను. అతండు నేండో రేపో రాంగలండు. నాకుం గడుపునంబుట్టినవారు లేరుగదా. తోబుట్టినవారల కొమార్తెలున్నారు. మానరసింహారాజున్నకైన నొకపుత్త్రుండు లేండు. మీరిరువురును, మాతమ్ముండు నాతోం బాటు లుండ్లుమీఱినవారలే. మేనల్లుండొకండు దగపడుచున్నాండు. వానివిషయమున మీయభిప్రాయ మేమి?

కృష్ణ—బావగారూ! మనవాండని యభిమానము లేనివాండనుగాను. కాని వానినడత యేమియు బాగులేదు. వాండెందునకును నర్హుండు కాండు.

భూప—నిజమే. కాని నాకుందెలుచు భోగరాజు కామేశ్వరరావుగారు వానినిగూర్చి లేఖలు వ్రాయుచునేయున్నారు. వానికిం బదివేల రూప్యములనిచ్చి వానియిచ్చవచ్చినతెఱంగున దానిని వృద్ధి నొందించుకొని బ్రతుకుమని యిచ్చితిని. అతండాసొమ్ముతో

ధాన్యపువర్తకము చేయుచున్నాఁడఁట. మంచిలాభము వచ్చుచున్నదఁట. మఱియు నాల్గయిదువారములక్రింద వానియధర్మపత్ని చనిపోయెనఁట. ఇఁకవాఁడు మంచిదారినిబడునని తోఁచుచున్నది. నాయాస్తివిషయమై యొక మరణశాసనమునువ్రాసియుంచు వానికిఁ గొంతయిచ్చునట్లేర్పఱుపవలెననియున్నది.

కృష్ణ—అవశ్యమీయవలసినదే. వాఁడు బుద్ధిమంతుఁడై బ్రతికిబాగుగనుండుటకంటెఁ గావలసినదేమున్నది? తమయొద్దనున్న రొక్కములో నైదులక్షలువానికిచ్చుట మంచిదని నాయభిప్రాయము.

నారా—చాలును. అంతకంటెనెక్కువ యీనక్కఱలేదు. విశేషమైన ధనముండినను మఱల దుస్సహవాసములఁజేసి సౌఖ్యము వమ్ముచేయును.

భూప—మీరీపలుకులు హృదయపూర్వకముగాఁ బలికినవే. నాకు నమ్మికగలదు. ఇఁక వెంకటపతివిషయము తేలినదనుటయే. తరువాత మాతమ్మునిగూర్చి మీయుద్దేశమేమి?

కృష్ణ—అతఁడుత్తముఁడు. సమస్తసద్గుణసంపన్నుఁడు.

నారా—వాస్తవమే. సర్వోత్తముఁడు. అతనిని మీరు కదల్పవద్దు. అతఁడు వ్యవసాయముఁ జేయుచుఁ దనధనమును బీదసాదులకు దానముచేయుచు సత్కాలక్షేపముఁ జేయుటకే తగినవాఁడు కాని యపరిమితధన మాతనికడనున్న నుపయోగము లేదు. అతనికిని భూపతినేమియు నీయక కొమార్తెపెండ్లికి నరణమునకు సర్వమునకు నైదులక్షలిచ్చిన ఘనముగానుండును. అంతకంటె నధికమువసరము లేదని నాయూహ.

భూప—నీయుపదేశము నాకునచ్చినది. మాతమ్ముఁడు రాజ్యమేలుట కర్హుఁడుకాఁడు. ముక్కుమూసికొని యొకపల్లెలోనుండుటకే తగినవాఁడు.

కృష్ణ—మీారు రాజ్య మతనికిసమర్పించిన నతఁడు స్వీకరింపఁడు. అరవిందయు నిరాకరించును. వారట్టియుత్తములు. అదియునుంగాక యైశ్వర్యమనుభవించినవారే మరల దాని ననుభవింపవలెనుగాని సాధారణపుసంసారుల కది యలవడిన ముప్పగల్గును.

భూప—మీారిరువురును నామనంబునఁగనిపెట్టి యిచ్చిన యుపదేశము నకుఁ గడు సంతసించితిని. ఇట్టి పవిత్రహృదయముతో మీారు పల్కిన యుపదేశవాక్యములకుఁ దగినఫలమే నామరణశాసన మందు మీారును బొందుదురుగాక. నేను సాంతవని జూచికొన వలెను. కొంచెముసే పావలకుఁ బోయివచ్చెదరా?

కృష్ణమరాజునారాయణరాజులు చిత్తమని భూపతిరాజునకెదురు గనున్నద్వారముగుండ నావలకుఁబోయిరి. పోవునప్పుడు నారాయణరాజు పండ్లుబిగియఁబట్టి, చూపుడువ్రేలినిగదల్చుచు నన్నతో 'ఈముసలిముండ కొడుకును బాగుగ వలలో వైచికొంటిమి. ఇఁక మనరొట్టె నేతిలోఁబడినదన్నమాటయే' యని మెల్లగననెను. వారి మొగములుమాత్రము భూపతికిఁ బొడగట్టలేదని వారనుకొనిరి. కాని యెదుట నొకనిలువుటద్దముంకుటచే వారివికారచేష్టలు స్పష్టముగా నతనికిఁ గాన్పించెను. అతఁడు తలుపుచేరవైచికొని తాళపుఁగన్నముగుండ వారిచేష్టలఁ బరికించి చూచెను. కృష్ణమరాజుకూడ నటులే వెక్కిరించుచుఁ గేళిసేయుచుఁ బల్కెను. భూపతి యంతయుఁ గనిపెట్టెను.



## పదునైదవప్రకరణము.



### మరణశాసనము.



భూపతిరాజుచుట్టములెల్లఁ దమస్వగ్రామములకుఁబోయిరి. తరువాత నతనికొకసారి తమ్మునికడకుఁ బోవ బుద్ధిపుట్టెను. మునుపటి జీర్ణ

వస్త్రములతోఁగాక యిప్పుడు తనస్థితికర్హమైన యమూల్యదుకూలములను గట్టి సేవకబృందము వెంటరా, రాజవీథిలో బయలుదేఱి చంద్రమపాలెము వచ్చెను. పూర్వ మరవిందతో నచ్చట నెట్లుమెలఁగెనో యట్లే యిప్పుడును నతఁడు ప్రవర్తింపఁజొచ్చెను. వారుకలసి వాహ్యాళికై పోవుటయు, నారామములో విశ్రామవేదికలపైఁ గూరుచుండి వేడుకకతలఁ జెప్పుకొనుటయు, మున్నగునవి యనుపటివలెనే చేయుచుండిరి. ఇట్లొకవారము గడచెను. కామేశ్వరరావు విశాఖపురినుండి యామరునాఁడువచ్చెను. అతనితో మాట్లాడి కొన్ని రాజకార్యములు చక్కఁబెట్టుకొనవలసినపని కాండ్రేగులప్రభువునకుఁ గలదు. అందుచేత నతఁడు చంద్రమపాలెము నువిడిచి వెంటనే తనకోటకు విచ్చేసెను. అనుకొనినట్లు కామేశ్వరరావుగారువచ్చిరి. ఆయనయు రాజుగారును నొక రహస్యమందిరమున నుచితాసనములపైఁ గూరుచుండిరి.

భూప—అయ్యా! వెంకటపతి యెటులున్నాఁడో మొదటఁదెలుపుఁడు.

కామే—తమరు నాతోఁజెప్పినదిమొదలు వానిప్రవర్తనమును జక్కఁగాఁ బరిశీలించుచుంటిని. నెలనుండి చూచుచున్నానుగదా! వానియందేలోపము నున్నటులఁగాన్పింపదు అతఁడు కొలఁదిబాడిగకొకయింటిని దీసికొనినాఁడు. ఒకభటునిమాత్రము దగ్గఱనుంచుకొన్నాఁడు. తమరిచ్చిన ధనమేమియు దుర్వ్యయముచేయుచుండుటలేదు. దానితో ధాన్యపువర్తకము చేయుచున్నాఁడు. ఎవరినినమ్మక తానే వ్యవహారములన్నియుఁ జూచుకొనుచున్నాఁడు. వానికి వ్యాపారములో మంచిలాభముకూడ వచ్చినది అతఁడు వెనుక నెట్లుచరించిన నిప్పుడు బాగుపడినాఁడని నాకుఁ దోఁచుచున్నది.

భూప—నాకుఁ బరమసంతోషముగానున్నది. మీరుపయోగించిన శోధనౌషధము వాని దురాచారరోగముయొక్క యాథార్థ్యము

నించుక మాన్పినదనుటయే. సరే. వాని యుంపుడుకత్తె మరణ
మునుగూర్చి యేమి?

కామే—నే నామెమరణమును విన్నతత్క్షణమే రోగపీడితయై యామె
వసియించినగృహమునకుఁ బోయి యామెనుగూర్చి 'వాకబు'
చేసితిని. ఆమెకు విషమజ్వరమువచ్చి చనిపోయినదఁట. వాసుదేవ
య్యయను నొకబ్రాహ్మణుఁడు వైద్యముచేసినాఁడఁట. అతఁ
డుకూడ నంతయు నిక్కువమేయని నాతో వచించినాఁడు. వెంక
టపతియే దహనాదికర్మములను జేసినాఁడఁట. అది మృతినొందు
టయు మనవానిమేలునకే వచ్చినదియని సంతసించితిని. అతఁడు
ముందుముందింకను బాగుపడుననియే నాయభిప్రాయము.

భూప—సరే. ఆమె యెప్పుడుచనిపోయెను?

కామే—తమకు రాజ్యమప్పగించుటకై నేను గాండ్రేగుల వచ్చిననాఁ
టికొకవారము పూర్వమున నొకదినమున నామె కథావశేషయై
నట్లు వింటిని. తమయొద్ద సెలవుఁగైకొని నేను మాయూరికిఁ బో
యినతోడనే నేనువిన్న దామెమరణవార్తయే.

భూప—ఇఁకమనము మఱియొకముఖ్యవిషయమును గమనింపవలసియు
న్నది. నాకుఁగలరుగ్ణత మీరెఱిఁగినదే. ఉన్నటులేయుండి య
ది పిడుగువలెవచ్చి హఠమునఁ బ్రాణములుతీయును. నేను చిర
కాలము బ్రతుకనను విచారము నాకులేదు. జగదీశుని కృపచే
మరల నాదేశమునకువచ్చి నావారలనుజూచి యానందింపఁగల్గి
తిని. మఱియు నదృష్టదేవతకు నాయందుఁ బూర్ణానుగ్రహముం
టచే నమితమైనద్రవ్యమునుం గడియింపఁగల్గితి. సంతానములేక
పోయినను నానోటికిఁ గొనీళ్ళు పోయువారు లేకుందురను విచార
ము నాకులేదు. పున్నామనరకభయము నాకులేదు. నాయాస్తి
యెవరికిఁ జెందునో వారు నాకు బిడ్డలేయగుదురు. మనస్సాక్షికి

సమ్మతముకానిమతమును స్వీకరించితినను విచారముతప్ప నా కన్య
చింత లేదు. అదియైనను విధి లేక తటస్థించుటచేతను, నేనందును
గూర్చి హృదయపూర్వకమైనపశ్చాత్తాప మొందుటచేతను భ
గవంతుఁడు నాతప్పు క్షమించునని నాకునమ్మికగలదు. ఏమతము
స్వీకరించినను పాపములేదుగాని, పలలభోజనము, జంతుహిం
స, వ్యభిచారము మున్నగుదోషకృత్యములాచరించి, భగవదుప
కారస్మృతి యేమియు లేక పామండునివలె వర్తించుటతగదు. నేనట్టి
కృత్యములఁ జేయకపోయినను జేయుచున్న వారినడుమ ముప్పది
యైదుసంవత్సరములు మనస్సాక్షినిజంపుకొని చరించుటచేఁ బం
చమహాపాతకులలోనొకఁడనై తినని పశ్చాత్తాపమొందితిని. నా
నిష్కాపట్యవృత్తి నిగ్రహించి పరమపిత నన్ను మన్నించుఁగాక! ఇ
ప్పుడు నేనొకమరణశాసనము వ్రాసి నాయాస్తి నెవరెవరికెంతెం
త యీయవలెనో స్థిరపఱుపవలెననియున్నది. నేను శోభనా
ద్రిరాజనుమాఱుపేరును వహించి నేనుజన్మించినగృహమందే,
నాతోడఁబుట్టినవానికడనే నాలుగునెలలుండుట నాతమ్మునియొ
క్కయు నతనికూఁతుయొక్కయు గుణావగుణములనుగనిపెట్టుటకే
యని మీకుఁదెలిసియేయుండును. అప్పుడే వెంకటపతినిగూడ
శోధింపఁగల్గితి. ఈనడుమ నెలదినములును నామఱఁదులయొ
క్కయు వారిసుతలయొక్కయు నడతలనుబరీక్షించితిని. ఇఁక
నాకుఁదోఁచినరీతి నాస్తి నిబంచిపెట్టెదను. కావున మీరు కాగిత
మునుగలమును దీసికొని యందు నేనుజెప్పినచొప్పున వ్రాయుఁడు.
కామేశ్వరరావట్లుచేసి చిరునామను వ్రాసియుంచెను. ఆవల
భూపతి యీవిధమునఁ జెప్పనారంభించెను.

"కృష్ణమరాజు నారాయణరాజులు:— వారిప్రవర్తన
మంతయుఁ గనిపెట్టితిని. వారు నావానప్రస్థముతోఁ బరిహాస

ములాడుటయు, రాత్రులు చాలసేపు జూదమాడుచునో, మ
ఱియొకవిధముననో మేలుకొనుటయుఁ జూచితిని. ఆయమును
మించినవ్యయము చేయుచుందురు. విషయలంపటులు. గర్వ
పూరితులు. అసూయాపరులు నిర్దయులు. నేను వినలే
దనుకొని యెన్నిసారులో నన్ను నిందించిరి. నేను సంస్థానాధి
పతినిగా ననుకొని నాయెదుటనే నాయందేవఁజూపిరి. అద్దము
లోఁ దమవికారచేష్టలు కనఁబడుచున్నవనియు నేనద్దమున కెదు
టనేకూర్చుంటిననియు నెఱుఁగక నన్ను వెక్కిరించిరి. నాతోఁ
టలో మందారపుఁబొదమాటున నాసీనులై తమస్వార్థపరత్వ
మును, ఆత్మస్తుతిపరాయణత్వమును, నాయందుఁ గపటప్రేమ
యు స్పష్టముగాఁజూపి నన్ను నోటికిరానిమాటలాడిరి. ఆస్తిపం
పకమునుగూర్చి వారియభిప్రాయమడుగఁ దమదుష్టస్వభావము
లఁ దేటతెల్లముగఁదెల్పిరి. అట్టిదుర్మార్గులు నాయాస్తిలో నే
మాత్రమును బొందుట కర్హులుకారు. కావున వారికేమియు
నీయఁబడలేదు ”

తాను వృద్ధుఁడగుటచే నించుకసే పాయాసముదీర్చుకొనుట
ంగి మరల నిట్లు చెప్పదొరకొనెను.

“ రాగమ్మసుబ్బమ్మలు:—దంభవ్యాపారమునకు. బు
ట్టినిల్లయిన నారాయణరాజుతనూజలగుటచేఁ దండ్రికొనములే
చాలవఱకుఁ బొందియున్నారు. కావున వారి యవగుణముల
కు వా రంతగానింద్యలుగారు. అనుకంపనీయులు. గరువము వా
రికుగ్గుఁబాలతోఁగలిపి యీయఁబడెను. నాఁడు మాతమ్ముఁడు
వారియం దవ్యాజవాత్సల్యముచేఁ బ్రేరితుఁడై యాదరమును
జూప దగ్గఱకురాఁగా వారు మొగము ముడిచికొనిరి. అర
విందకుతూహలముతో నాలింగనముఁ జేయఁబోవగా నావలకు

మెల్లఁగాఁజూచిరి. నావిషయములోఁగూడ గుసగుసలాడిరి. విసుగు, అసహ్యము బాగుగనగపఱిచిరి. నేనే రాజునని తెలిసిన పిమ్మట వారు వినయమునునటించిరి. పాపము! నేనాకపటవర్తనమునకు సంతసింతునని తలఁచిరికాఁబోలు. గాలిలో నెగయఁజేసిన గడ్డిపోరక వాయుప్రసారమే వైపునున్నదో తెలుపఁగలదు. అటులే యొకరినడవడిలోని యల్పాంశములే వారిప్రవర్తనమును జక్కఁగాఁ దెలుపఁగలవు. అన్నము ఉడికినదో లేదో చూచుటకొఱకు మెతుకు పట్టిచూడవలెనుగదా? ప్రతివిషయములో జోక్యమును గలుగఁజేసికొనుచుఁ బ్రతివస్తువును జూచుటయందు నాత్రమునొందుచు నెవ్వరుందురో కనుఁగొనుటకే, నే నింద్రమందిరమునం దొకచక్కని విగ్రహముపైఁ దెరను బఱపించితిని. నాబంధువులనందఱ నచ్చటకుఁ దోడ్కొనిపోయి యేరాజవనికనెత్తి లోపలివస్తువును దిలకించుటకుఁ దొందరపడియెదరోయని చూచియుఁజూడనట్టు లొకపటమువంకఁ జూచుచు నిలిచితిని. ప్రప్రథమమున వీరిచేతులే దానిమీఁదఁబడినవి. ఆయంశములనుబట్టి వారిచపలచిత్తములను గ్రహించితిని. ఇంకను వారికేయేపాత్రములుచదువుటయం దాసక్తికలదో, యేయేయాటలయందుఁ గోరికగలదో, యేయేపాటలయం దభిలాషకలదో పరీక్షించిచూచితిని. వారిభావములనుబట్టి వారియం దేమియు విలువయున్నటుల నాకుఁ బొడఁగట్టలేదు. వారియం దెన్ని యవగుణములున్న ననుకంపనీయులని మొదట వచించియేయుంటిని. కావునఁ దండ్రిప్రసక్తి యేమియు లేకుండఁ దమంతఁ దామ వాదుకొనుటకును, సాధ్యమైన నాభావములను గ్రహించి సద్బుద్ధినొందుటకును, నేఁబదివేలరూపాయలు వారిలో నొక్కొకరికిచ్చుటకు నిశ్చయించితిని. నాయనంతరమట్లు

జరగించవలెను." మరల నిచ్చటగొంతవడియాగి కొంచెమునే పాలోచించి యిట్లు వచింపమొదలు పెట్టెను.

"లక్ష్మీనరసమ్మరత్నమ్మలు:—వీరినడవడి యంత చెడ్డది కాదు. వెనుకవచింపఁబడిన వారికంటె వీరెక్కువకరుణఁజూపఁదగి నవారు. వీరు నైజముచే మేల్గొనములు గలవారలు. ఆదర్శముగా నున్న వారితండ్రియే మంచివాఁడయ్యేనేని వారిచరిత్రము నిష్కళంకమైనదై యుండును. అదవిందానరసింహరాజులను గనుఁగొనినతోడనే వీరత్యంతప్రీతినిజూపిరి. కాని జనకుఁడేమనునోయని భయమందిరి. వీరినిం బరిపరివిధముల శోధించితిని. వీరియభిలాషలు, భావములు, చేష్టలు ఘనతరములుగాఁ గాన్పించినవి. వీరు కాఁగలవారని నాకుఁ దోఁచుచున్నది. కావున వీరిలో నొక్కకరి కొక్కకలక్షచొప్పున నిచ్చుటకుఁ గృతనిశ్చయుఁడనైతిని. నామరణానంతర మటుల జరగించవలెను."

పదవడి యూపరిఁదీసికొనుట కొకింతసేపూరకొనెను. ఈపర్యాయ మెక్కుడుకాల మాలోచించెను. మరల నిట్లు చెప్పనారంభించెను.

"వెంకటపతిరాజు:—వానినిగుఱించి నాకిట్టియభిప్రాయముకలదు. వాఁడు విశాఖపురిలోఁ గర్ణాకర్ణిని దన పెద్దమేనమామ మరల స్వదేశమునకు వచ్చినట్లు విని యదెంతవఱకునిక్కమో తెలిసికొనుటకుఁ జంద్రముపాలెమునకువచ్చెనని నే నెఱుఁగుదును. మొదట నన్ను నిరాదరభావముతోఁ జూచినాఁడు. తానువచ్చి నమఱునాఁడు నరసింహరాజుతో నన్నుఁగూర్చి సంభాషించుచు నే నరవిందకు మణిహారము లీయఁబోవుట మున్నగునంశముల ను విని శోభనాద్రియనుపేరితోనున్న నేనే తన జ్యేష్ఠమాతులుండ నని యనుమానించెనని నాకుఁదెలియును. మఱియు నేనశ్రద్ధచే నాదినచర్యపుస్తకమును విడిచిపెట్టి నిదురపోవఁగాఁ దాను సద్దు

చేయక లోపలికివచ్చి యందలి విశేషములను జదివి తెలిసికొని నట్లు నేను గ్రహించితిని. వాఁ డెంతజాగ్రత్తతోఁదిరుగ నాపత్త్రిములను సర్దిన నవి పూర్వపురీతి నుంపఁబడకపోవుటచేత వాని నెవరో కదల్చిరని తెలిసికొంటిని. అరవింద యట్టిపనులఁ జేయదని యెఱుంగుదును. వాఁడేయైయుండునని నిశ్చయించితిని. అందున కుదాహరణముగా నాతనివైఖరియు మాఱినది. నాయందలి నిరాదరమంతయు నెగిరిపోయినది. ఎక్కడలేని యాదరముం జూపట్టనారంభించినాఁడు. మఱియుఁ దానొకదానిని గట్టుకొనినట్లు లోకమునకు వెల్లడించి దానికూఁడు దినుచుండియు దుర్బుద్ధితో నరవిందపై మోహమునునిలిపి యామెను దనవలలో వైచికొనవలెనని యత్నించెను. కాని వాఁడును మాలతియు సంభాషించినమాటలను వినియున్నవాఁడనౌటచే వాని దుశ్చరితమంతయు గ్రహించి వానికిని నరవిందకును బునస్సమాగమముఁ గానీక కాపాడితిని. నాయాస్తియంతయు నరసింహరాజునకుఁ జెందుననియు, నతఁడు తప్పక తనకొమరితెకే యిచ్చుననియుఁ గావున నామెను బరిణయంబైనఁ దనకంతయు లభించుననియు నూహించి దురుద్దేశముతో నట్టిజతనములు సల్పినాఁడు. అట్టి దార్ష్ట్యముకలవాఁ డెంతటిశిక్షకైన నర్హుఁడే. కాని యిప్పటికి వానికిఁ బశ్చాత్తాపముదయించి యుండవచ్చును. ముందు బాగుపడునేమోచూతము. కనుక వానికిఁగూడ నేఁబదివేలరూప్యములే యీయనుద్దేశించితిని. నేను మృతిఁజెందినతర్వాత నాముఖ్యాస్తికర్త యట్లు చేయునుగాక. ”

తిరుగఁ గొంతతడవువిశ్రాంతినొంది యిట్లువ్రాయఁగడంగెను.

“నరసింహరాజు:—ఇతఁడు నాతమ్ముఁడని నేనితనియందుఁ బక్షపాతమును వహించియుండలేదు. ఇతఁడు బంధుకోటిచేత

ను, మిత్రబృందముచేతను, ఆశ్రితవర్గముచేతను ప్రేమింపఁబ డువాఁడు. ఇతనికి శత్రువులు లేరనియే చెప్పవచ్చును. కావున నితనికిఁ బదిలక్షలరూప్యముల నీయఁదలఁచితిని. ఆధనమతఁడు త న కిచ్చవచ్చినవారికిచ్చి తనకుఁదోఁచినరీతిని వినియోగింప వ చ్చును. నాయనంతర మట్లుజరగింపవలెను."

"అరవింద:—ఈమె సత్స్వభావమునుగూర్చి యించుక వక్కాణింపఁ దలఁచుచున్నాను. శరీరానారోగ్యస్థితినిబట్టి నేను కోపమును నిర్వేదమును గనఁబఱుపఁగా నామె భూదేవియొక్క క్షమను వహించి ముదముతో నన్నాదరించినది. నేను బెఱవాఁ డనని నమ్మియు నన్నివిధములనాదరముంజూపుట శ్లాఘ్యము. ఒ కనాఁ డామెయుఁ దండ్రియు మాటలాడుకొనుమాటలను నేను వింటిని. జనకుఁ డామెను బ్రభాకరునిభర్తగాఁ దలంపుమని యా జ్ఞాపించుచుండెను. ఆమె వానియందు సోదరప్రేమమాత్రమే వ హించియున్నను బితృవాక్యపరిపాలనాశీలగావున వెంటనే మా ఱుమాటాడక వల్లె యనెను. కన్నులు మిఱుమిట్లుగొలుపు తేజ ముఁగల భూషణము లామెకిచ్చి యామెనుబరిశోధించితిని. ఆమె నిశ్చలచిత్తముతో వాని నిరాకరించెను. స్నేహభావముచే నెవ్వ రే 'సలహా' యిచ్చిన దానిని గౌరవముతో గ్రహించి తనపొర పాట్లను దిద్దికొనును. ఆమె కొన్నాళ్ళు మూలపేటచాకలివాం డ్రిచ్చిన రంగులుగల బట్టలను ధరించుటయందుఁ గుతూహ లయై యుండెడిది. బట్టలమీఁద నభ్రకపుగేకులపొడి జల్లుచుం డుమని రజకున కాజ్ఞయిచ్చుచుండెడిది. నేనామెతో ' అ మ్మా! అందమైనబట్టలు కట్టుకొనుట మంచిదేకాని డంబముగా నుండుటమాత్రము తగదు.' అని చెప్పినతోడనే గ్రహించి నా యుపదేశమున కనుకూలముగఁ బ్రవర్తించినది. ఎట్టివేళలందైన

నామె సహజసౌశీల్యము ను వీడలేదు. అట్టి సకలసద్గుణ నికురం
బయగు లలనామణి మాకుటుంబములో జనించినందులకు నే
ను గడు గర్వపడుచున్నాను. అట్టి సుశీలకు సాధనమంతయు
నిచ్చిన నది రిత్తవోదు. ఆమె పాత్రులకు దానముచేసియు, రు
గ్ణుల కౌషధాలయము లేర్పఱచియు, ననాథశరణాలయముల
గట్టించియు, సమస్తకళల నభివృద్ధిగావించియు, సంఘసంస్కార
ణోద్యమముల బురికొల్పియు ద్రవ్యము ను సద్వినియోగము
చేయును. సందియములేదు. కావున బైన బేర్కొనబడిన ధన
ముకాక శేషించినసాధనాగారములోనుండు రొక్కమును, నాసం
స్థానమంతయు, నందలిచరాచరరూపకమైన వస్తుజాలమును, సర్వ
మును నేనీలోకమును విడిచిపెట్టిన గడియనుండి యామెయధీన
ము చేయవలసినది. ఆమెగాని నరసింహరాజుగాని తమకీయబడి
న ధనము నెట్లువినియోగపఱచికొనదలచిన నట్లు చేయవచ్చు
నుగాని యనవసరమైనకారుణ్యమునుజూపి పైన బేర్కొనబడిన
బందుగులకుమాత్రము నియమితద్రవ్యముకంటె నధికముగా
నీయరాదు. నాప్రాణము పోయిన నిముసమునుండి యరవింద
కాండ్రేగులకోటలో నివసింపవలెను. మఱియు నరవింద నొక్క
కోరికగోరి ముగించుచున్నాను. ఆమెకు బదునెనిమిదవయేడు
వచ్చువఱ కామె యుద్వాహమాడకుంటయే నాకోరిక. ఇందును
గూర్చి నేనేమియు విధించుటలేదు. ఆమె చిత్తవృత్తినిబట్టియే
చేయవచ్చును. కాని నా మనోరథ మదియనిమాత్ర మందుదె
లుపుచున్నాను. నాయభిలాషయొక్క పావిత్ర్యము నామె నిలుపు
ననియే నానమ్మిక.

పైనవివరింపబడిన యంశములన్నియు సరళముగానెఱ
వేఱునట్లు చేయుభారము వత్సవాయ నరసింహరాజు, భోగరాజు

కామేశ్వరరావుగారిపైఁ బెట్టితిని. వారినే మధ్యవర్తులనుగా నే ర్పఱచితిని." అని వచించి భూభారమునుండి విముక్తుఁడయిన శేషుఁ డెట్లు సుఖియగునో యటులే పరమసౌఖ్యము నొందెను. హృదయము చులకనప డెను. కామేశ్వరరావు ప్రభువునాజ్ఞనుబట్టి యాతనిచే నాపత్రమం దుఁ జేవ్రాలు చేయించి తగిన మర్యాదగలవారిచేత సాక్షివ్రాళ్ళను జేయించెను.



## పదునాఱవ ప్రకరణము.

### ముద్రిత పత్రము.



పని ముగిసినపిమ్మటఁ గామేశ్వరరావు విశాఖపురికిఁ బోయెను. అతనిఁబంపినమఱునాటి దినమే భూపతిరాజు మరలఁ జంద్రమసాలెము న కేతెంచెను. సాయంతన మన్నదమ్ములు దక్షిణపువసారకడఁ గురి చీలపైఁ గూర్చుండియుండిరి. అరవింద యింటిపనులను జక్కఁబెట్టుకొ నుచు లోపలనుండెను. వసారకున్న తెక్కల తలుపులను దగ్గఱబెట్టించి వారిట్లు భాషింపఁదొడఁగిరి.

భూప—తమ్ముఁడా ! నా శరీరస్థితిని గమనించి నాయాస్తివిభాగమును గూర్చి యేదోయొక యేర్పాటు చేయుట మంచిదని తోఁచి నిన్ననే యొకమరణశాసనమును వ్రాసితిని. నీవు, కామేశ్వరరా వు మధ్యవర్తులుగా నుండుటకు నియమించితిని. ఇప్పు డాశాస నమును నీ చేతులలోఁ బెట్టనై యున్నాను. నీవు దానిని సమ గ్రముగఁజదివి, నన్నందు మార్పులేమియుఁ జేయుమనక, దాని నట్లు వ్రాయుటలో నా యభిప్రాయ మేమో తెలిసికొన య త్నింపక, దానియందలి ప్రత్యక్షరమును గౌరవించి నన్నుఁ

గృతార్థుని జేయుము. నీవిందుల కియ్యకొందువేని నేను నాశే
షకాలమును శాంతచిత్తముతోఁ గడపెదను. ఇదే యాపత్త్రి
ము—అని వాని చేతిలోఁబెట్టి తాను లోపలికిఁబోయివచ్చెద
ననిచెప్పి వెడలెను. ఈలోపున నరసింహారా జంతయుఁ జదివికొనెను.
వానిముఖ మాశ్చర్యము, విషాదము, నించుకసంతోషమును దెలు
పుచుండెను. ఒకగడియలో భూపతిరాజు మరలివచ్చెను.

నర—అన్నా! మీా రిట్టిపనిని జేయుదురని నేనెన్నఁ డనుకొనలేదు.
ఇందుఁగూర్చి నాకెప్పుడు తలఁపే పాఱలేదు. నాకు నిశ్చ
యముగా—

భూప—నరసింహా! నేను మొదటనే కోరితినిగదా. నీవేమియుఁ బ్రి
శంసింపకుము.

నర—చిత్తము. మీా యాజ్ఞను దలఁదాల్చెదను. మీాసెలవు ప్రకార
ము ప్రత్యక్షరమును గొనసాగఁజూచెదను.

భూప—అరవిందకుమాత్రి మిందునుగుఱించి యేమియుఁ దెలుపవలదు.
అది క్రమముగా నెఱుఁగవలయునని నాయుద్దేశము. ఆయొఱిఁ
గించుటయు నేనే చేసెదను. ఇక్కడ నీతోఁ గొన్నిదినములు
సుఖముగాఁ గడపవచ్చితిని. నీ వీశాసనమునుగూర్చి యెక్కడ
నైనఁ బలుకకుము. నీబాహ్యాచర్యలయందైనఁ గనుపఱుపకు
ము. ఈవిషయమై నీవేమియు నెఱుఁగనటులే ప్రవర్తింపవలెను.

నర—చిత్తము. కాని యీశాసనమందలి యొకభాగమున నేను వినని
క్రొత్తసంగతి కలదు. అది—

భూప—నీయభిప్రాయము నాకు ద్యోతకమైనది. మనవెంకటపతి
యేకాంతముగా నొకదానిని బెండ్లియాడియు సాహసించి మన
యరవిందపాణిని గ్రహించుటకు యత్నించెనని తెలుపుమాట
లందు వ్రాసితినిగదా. అది నిశ్చయము. వాని దౌరాత్మ్యము

ను నేను గనుగొంటిని. నాయుపదేశమును బట్టియే యరవింద నీతోఁ దద్విషయముంగూర్చి యేమియు ముచ్చటించి యుండ లేదు. ఆయంశమును గుఱించి నీవును విననట్లు నీకూఁతునకుఁ దెలియఁజేయ నక్కఱలేదు. ప్రభాకరుని వరింపుమని నీవిచ్చిన యానతి నతిక్రమించితినని యామెపొందినపరితాప మేమనిచె ప్పుదును ? తనదోషమును నీకడ నొప్పుకొనుటకై పోవుచుం డ నేనే యడ్డుపెట్టితిని. అప్పుడే యామె తన యుప్రతిమానస్వ భావమును జూపినది.

నర—మఱొక్క సంగతి. మీరిచ్చట నుందురను ననుమానముతోనే వెంకటపతి మొదట నిక్కడ కేగుదెంచినటులు మీ కెట్లు తెలిసెను ?

భూప—వాఁ డిచ్చటికివచ్చినమఱునాటిదినమున మీయిద్దఱకు జరగిన సంభాషణములో నామరణము సత్యమని నీవెట్లు నమ్మితివని వాఁ డు నిన్నడిగెను. నీకుఁ దెలియున దంతయు నీవు చెప్పితివి. వాఁ డప్పుడు “ ‘ఆలాగునా ? ‘ అయితే ’ నా వదంతి యేమి ? ఆ శ్చర్యముగా నున్నదే ” యని మెల్లగ గొణఁగుకొనెను. ‘ ఏమ నుచున్నావు ? ’ అని నీ వడిగినను సరియైన ప్రత్యుత్తర మీయ క నైపుణ్యముతో సంభాషణమును మార్చివైచెను. నేను బ్రచ్ఛన్నముగా నిలచి యానుడులన్నియు నాకర్ణించితిని.

నర—సరే. ఆవదంతి వాని కెట్లు తెలియవచ్చెను ?

భూప—నేను విధిలేక భోగరాజు కామేశ్వరరావుగారితో నా చరిత్ర యంతయుఁ జెప్పితిని. అతఁడు తనభార్యతోఁ దక్క నితరుల తో నన్నుఁగూర్చి వచింపలేదఁట. స్త్రీనోటిలో నువ్వుగింజ దా గదని లోకప్రసిద్ధమే కదా ! ఆమెవలనఁ గొంచెము వ్యాప్తి యై యుండనోపు. క్రమముగా నావార్త వాని చెవులలోఁబడి

యుండవచ్చును. ఆనాఁడు మీసంభావణమునుబట్టి శోభనాద్రి
యను నామముతో నేనే యిచ్చట నున్నానని గ్రహించి తత్
క్షణమే నాయెడ సద్భావముతో నుండ నారంభించెను. తాని
క్కడ నున్నంతకాలము నన్నెఱిఁగియు నెఱుఁగనట్లు నటించినాఁ
డు. నే నెవఁడనో తనకుఁ దెలియకపోయినను, స్వభావముచేత
నే మంచివాఁడగుటచే నన్నారీతిని గౌరవించినాఁడని నాకు బో
ధపడవలెనను కపటాంతరంగికోద్దేశముతో నట్లు చరించినాఁడు.
కనుపు చింపుకొనినఁ గాళ్ళమీఁదఁ బడునన్నట్లు మనవాని నిం
దించిన మనకే కష్టముగాఁ దోఁచును. ఇఁక నాప్రసంగముఁ
గట్టిపెట్టుము.

కొన్నిమాసములు గతించెను. మకరసంక్రాంతిదినములు స
మీపించినవి. ప్రతివారు నిండ్లకు వెల్లలు వైచికొనిరి. హిందూయువ
తులు తమచిత్రకళానైపుణ్యమును వెల్లడింపఁ దమతమగృహప్రాంగణ
ముల ముగ్గులు పెట్టుచుండిరి. కన్నెలు శృంగారముగా గొబ్బి
ళ్ళను బెట్టుకొనుచుండిరి. వఱువాతలేచి దేవాలయములోఁ బూజారు
లు మంగళతూర్యారవములతోఁ బూజల సల్పుచుండిరి. వైష్ణవులు బా
లభోగమునందుఁ బెరుమాళ్ళకు నివేదింపఁబడిన దధ్యోదనము, పులి
యోగిరము, చక్కెరపొంగలి మున్నగువాని నారగించుచుండిరి. తె
ల్లవాఱుజామున బొందిలివాండ్రలో బుడబొక్కలవాండ్రు భగవతిని
బిల్చి చెట్టులలోను బుట్టలలోనున్న పిశాచములను బాఱఁదోలుచు
నింటింటికిఁబోయి ప్రాతబట్టల నడిగికొనుచుఁ బిక్కను వ్రేలాడఁగట్టుకొ
న్న గంటను మోయించుచుఁ దిరుగుచుండిరి. వృద్ధులు భూపాలరాగ
ముతో శ్లోకరూపకమైనభగవన్నామసంకీర్తనమును బాడుచుండిరి.
సంగీతవిద్యను నేర్చుకొనువారు చలిగాలి తాఁకుచోటులఁ గూరుచుం
డి కంఠములను స్వాధీనము చేసికొనుచుండిరి. ఉదయమున మంచున

ట్టముగానుండి పాంథుల కెదుటనున్న మనుష్యులు కనఁబడకుండెను. ఖ రకరుఁడు జననిందను బొందిపొంది పదపడి వారియనుగ్రహసంపాదన మున కేమో యనునట్లు తన సహజతైక్ష్ణ్యము నువీడి సౌమ్యముగాఁ బ్ర కాశించుచుండెను. సాయంకాలమున సాతానిపిండు బిక్షమెత్తఁ దిరుగు చుండెను. వృద్ధులు దుర్భరమైన హిమబాధకుఁ దాళఁజాలక 'ఓచలీ! మమ్మేల యేఁచెదవు? పరస్పరగాఢాలింగన సౌఖ్యముచే మదించి చొక్కి యున్న నూతనదంపతులకడ నీయుంగురాటములు సాగవుకాఁబోలు' నని నిందించుచున్నారు. అట్టిసమయమున మనయరవిందానరసింహ రాజులు భూపతిరాజునాజ్ఞమీఁదఁ గాండ్రేగులకు వచ్చిరి. వారు ని రంతర వినోదములం దేలుచుఁ గాలక్షేపము చేయుచుండిరి. పండుగుది నము లారంభమయ్యెను. అల్లుండ్రత్తవారియిండ్లకుఁ బిలువఁబడి కొం చెముసేపు పెక్కులను జూపి వచ్చిరి. ఇంటింటఁ బిండివంటలు వివిధములై నవి వండికొనుచుండిరి. ఆబాలవృద్ధ మభ్యంజనస్నాన మా చరించి నూ తన వస్త్రధారణముం జేయుచుండిరి. ఏనాఁడును దానమునుజేసి యె ఱుఁగనివారు సైతము కొంచెము వరిధాన్యమో, బియ్యమో చేర్చిపె ట్టుకొని భిక్షుకులకు బిచ్చము పెట్టుచుండిరి. పేదవాండ్రు కాకుండ నా త్మగౌరవములేనిధనికులుసయితము మూయవారమునకు బయలుదేఱి మూ టలతరువాత మూటల నిండ్లయొద్ద దింపుచుండిరి. గొల్లలాలఁబోతులను శృంగారించి రామకథను బాడుచుఁ దిరిపమెత్తుచుండిరి. మంగళ్ళు తమ తమవాద్యముల మ్రోయించుచుఁ బ్రతిగేహమునకుం జని భిక్షమెత్తు చుండిరి. కోడిపుంజులు, గొఱ్ఱెపొట్టేళ్ళు పెక్కులు పందెములకు డీకొ ల్పఁబడుచున్నవి. ఇట్లు లోకమంతయు వేడుకలవెల్లియందు మునిఁగి యుండెను. కాండ్రేగులకోటలోఁ గూడ నర్థులకు సమస్తదానములును జేయఁబడుచున్నవి. రాజకీయోద్యోగస్థులందఱు రాజదర్శనముంజేసి బహుమానము లందుచుండిరి. పెదతండ్రి ప్రోత్సాహముపై నరవింద

యు గ్రామమందలి మహిళలను రావించి, స్త్రీలముఖ్యావిధులను గూర్చి యుపన్యసించియుఁ, గలకంఠనిస్వనముగల కలకంఠులచే శ్రావ్యముగాఁ బాడించియు, దనప్రస్తుతపుఁ బదవి కర్హమగు రీతిని వారికిఁ బూలదండలు, కుంకుమ, పసపు, మేలిబట్టలు, గంధము, తమ్ములము మున్నగునవియిచ్చి బహూకరించియు నందఱను దనిపెను. ఇప్పుడుభూపతిరాజామెను శుద్ధాంతకాంతానివహములు దాల్చు నమూల్యదుకూలములను ధరింపఁజేసెను. అతఁడు నేర్పుతో నామెకు ముందుఁగలుగఁబోవు రాజ్యప్రాప్తి నిగుఱించి యించుక సూచనగా మధ్యమధ్య పలుకుచుండెను. తాను దలఁపనితలంపుగా శోభనాద్రి తనపెదతండ్రియగుటయుఁ, బ్రాజ్యరాజ్యాధిపతియగుటయుఁ దలపోసి యరవింద యెఱుకత పలుకులన్నియు నెఱవేఱునని పూర్ణముగా నమ్మెను. ఒకప్పుడు “ నేను రాణినైన రాజకార్యములు చక్కఁగా నిర్వహింపఁగలనా ? అందెన్నియో చిక్కులు గలవే ! ” యనును. మఱియొకప్పుడు “ నేను జిన్ననాటినుండియుఁ బల్లెటూరిలోఁ బెరిఁగితిని. ఇప్పుడు నాపెదతండ్రి నన్ను. రాజ్యరమాధౌరంధర్యమునకుఁ దగినచందమునఁ గ్రమశిక్షలోనుంచుచున్నను, మునుపటినుండియు నలవాటు పడిన మార్గమందే చరించుచు నావిధికృత్యములయందు లోపము చేయుదునేమో ’ యని యనును. భూపతి యామె యభిప్రాయము లన్నియు జాగ్రత్తతోఁ గనిపెట్టుచు స్పష్టముగా “ నాయనంతరము నీవే రాజ్యమేలవలె ’ నని మాత్రము చెప్పక కాలముఁ గడపుచుండెను.

హేమంతము గడచెను. భూపతిరాజునకు రాజ్యలాభము కలిగి యాఱునెలలయ్యెను. ఈలోన నతఁడు కృష్ణమరాజు నారాయణరాజుల నొక్కసారియైన మరలఁ బిలిపింపలేదు. మునగోడండ్రకు మాత్రము తఱచుగాఁ గానుకల నంపుచుండెను. వానిలోఁ గృష్ణమరాజుకూఁతుల కెక్కువ విలువయైనవి పంపుచుండెను. లోడియల్లుండ్రిరువురును

బావకుఁ బెక్కుసార్లు జాబులను వ్రాసిరి. వానిలో వారి ప్రేమను బరి పరివిధముల వెల్లడించిరి. కాని పాపము వారి క్షీమరణశాసనముంగూర్చి యేమియుఁ దెలియలేదు. భూపతిరా జరవింద నేల యేలుటకుఁ దగిన నేర్పుగలదిగాఁ జేయుచున్నాఁడనియు వా రెఱుఁగరు. అతఁడు నడుమనడుమ వారికిఁ బ్రత్యుత్తరము లిచ్చుచున్నాఁడు. కాని వానియందు క్షేమసమాచారములకు మించి యేమియును లేవు.

భూపతిరాజు దేశముల దిమ్మరియై మరల నింటికివచ్చి నేటికేఁడాది యయ్యెను. అతఁ డీపవిత్రదినమును జ్ఞప్తియందుంచుకొనుటకు సాంవత్సరికోత్సవము చేయ నిశ్చయించి స్నేహితులను రావించి విందులఁజేసి వినోదములు గల్పించెను. అతఁడు తాను మార్గాయాసముచేఁ జంద్రమపాలెము సమీపమునను్న చెఱువుగట్టుమీఁద సొమ్మసిల్లుటయు, నరవింద దన్నుఁ గాపాడుటయుఁ, దాను జన్మస్థానమున స్వేచ్ఛగాఁ గొంతకాలము వెడలఁబుచ్చుటయు, స్మరణకుఁ దెచ్చికొని యరవిందను బ్రస్తుతించెను. సాయంకాలమునకు వినోదములన్నియు ముగిసెను. నరసింహారాజు పూర్ణయ్య మంత్రితో గుఱ్ఱపుబండి నెక్కి వాహ్యాళికై పోయెను. అరవిందాభూపతిరాజులు కోట యావరణములోని పూఁదోఁటలో నర్హాసనములపై నాసీనులై యుండిరి.

భూప—తల్లీ ! నిరు డీదినమున జరగినదంతయు నీకు జ్ఞప్తియున్నదా

అర—తండ్రీ ! లేకేమి ? అంతయుఁ గన్నులఁ గట్టినట్టులేయున్నది.

భూప—(నల్లని, నిగనిగ లాడుచున్న నున్నితమైన కఱ్ఱతోఁ జేయఁబడిన పెట్టె నొకదానిని జేతఁ బట్టుకొని) అమ్మా ! ఈపేటిక నెప్పుడైనఁ జూచితివా ?

అర—(ఆశ్చర్యముతో) చూచితిని. నాఁడు చంద్రమపాలెములో దీని నుండియేకదా నీవు మణులమాలికలఁదీసి నాకీయఁబోయితివి ?

భూప—కన్నతల్లీ ! అప్పుడు నిరాకరించితివి. ఇప్పుడు దీనిని బుచ్చుకొ నుటకు నీ కభ్యంతరము కలదా ? అరవింద దానిని బుచ్చుకొని యేమి పలుకవలెనో నేరక యూరకుండెను.

భూప—అమ్మా ! నీవు నాఁడు కక్కుఱితిపడి పుచ్చుకొని యుండిన, నేఁడు నేను నీకుఁ జెప్పఁదలఁచిన ఘనవిషయములు నీచెవులఁ బ డియుండవేమో ! (అని యామెను జేరఁజీరి ముద్దుపెట్టుకొని ) నా కన్నతల్లీ ! నాయనంతరమునుండి యీకోట, యీరాజ్య ము, నీవిస్తారధనసంచయము నిదగును జుమీ.

అరవింద యేమి మార్వలుకవలెనో తెలియకుండెను. సంతోష ముచేతనో, భయముచేతనో యామెశరీరము గగుర్పొడిచెను.

అర—పెదనాన్నగారూ! నాయందు మీకు నిర్హేతుకజాయమాన కటా క్షమున్నది. అందుచే నాకు మీసర్వస్వ మర్పించుచున్నారు. కాని యంతయుచ్ఛపదమునకు నేను దగను. అంతటిభాగ్యదే వతయొక్క బరువును దలపై నిడికొని మోయఁజాల. భావిస్థితి ని దలంచికొనిన నాకు భయమగుచున్నది.

భూప—అమ్మా ! నీకేమియు భయముండ నవసరములేదు. నీవు నీబు ద్ధిని ఋజుమార్గమునఁ బోనిచ్చి యించుక జాగ్రత్తతో మెలం గెదవేని నీకు భారమేమియుఁ దోఁపదు. నేను నీకిచ్చెడు ద్రవ్య ముతో నెంతెంత ఘనకార్యము లాచరింప వచ్చునో కొంచె మాలోచించుకొనుము. ఎంతమందిదారిద్ర్యదేవతాపీడితుల ను రక్షింపవచ్చును ? ఎన్నియనాథశరణాలయములఁ గట్టింప వచ్చును? ఎన్ని ధర్మౌషధశాలల నెలకొల్పవచ్చును ? ఎన్ని వి శ్వవిద్యాలయముల నిర్మింపవచ్చును ? అధోగతిపాలైన స్త్రీ విద్య నెన్నివిధముల నుద్ధరింపవచ్చును ? మూల నాశనముఁజేయఁ జూచుచున్న సంఘదురాచార కీటకముల నెన్నిరీతుల నిర్మూ

లింపవచ్చును ? తల్లీ ! ఇవన్నియు యోజించుకొనుము. నీవం టిసత్స్త్రీహస్తములఁ బడిన సాధనము సద్వినియోగపడునని యు, నాయన్యమతస్వీకారాదిదోషములు నశించుననియు, సర్వసాక్షియగు నాదినారాయణుఁడు నాకృత్యమునకు మెచ్చు ననియుఁ దలఁచి యిట్లొనర్చుచున్నాను.

అరవింద పెదతండ్రి యౌదార్యమునకును, దన యదృష్టమునకు ను మహానందమునొంది యానందబాష్పములు విడిచెను.

అర—(భూపతిరాజుపాదములమీఁదఁబడి) తండ్రీ! సర్వవిషయముల నీ యాజ్ఞానువర్తినై యుండెదను.

భూప—(ఆమెనులేవనెత్తి) నీవటులుండెదవని నాకును నమ్మకమె. నీవు మాత్రము ముందు సౌఖ్యములుచేకూరవని భయపడకుము. నీ కు సర్వసౌఖ్యము లలవడును. బిడ్డా! నీవొక్కదానింగూర్చి వా గ్దానము చేయవలెను. చేసెదవా?

అర—జనకా! చేయనా? నీవేదిచెప్పిన నామంచికే చెప్పెదవు. కావున నీయాంపతిఁ దలఁదాల్చి యాచరించెదను.

భూప—ఇదే చిన్న యెఱ్ఱనిపెట్టె నిచ్చుచున్నాను. దీనిని భద్రముగా దాఁచుకొనుము. నీకుఁ బదునెన్మిదేండ్లు నిండఁగానే దీనిని దెఱ చిచూచుకొనుము. అంతవఱకుఁ దెఱవకుము. నీతండ్రికిని జూ పింపకుము. నీయొద్ద నట్టిపేటికకలదని నీజనకునకుఁ దెలియనీయ నేవద్దు. అందేమున్నదో చూడవలెనని నడుమనడుమ బుద్ధిపుట్టు చుండును. ఆబుద్ధిని జయింపుము. అని యందమైనపెట్టె నొ కటి యామెచేతికిచ్చి 'బిడ్డా ! ఇఁక లోనికరిగి దీనిని భద్రపఱచికొను ము. పొమ్ము.' అని యొకముద్దుపెట్టుకొని పంపెను. ఆమె నగలపెట్టె యుఁ గొత్తపెట్టెయుఁ బట్టుకొని యంచలనడబెడంగుతోఁ గోటలోని కరిగెను.

ఈయాఱునెలలలోఁ గామేశ్వరరావుగారు వెంకటపతినిగూర్చి తఱచు కమ్మలు వ్రాయుచునేయుండెను. అతనియందుఁ గ్రమముగా మార్పుకలిగినట్లును, సొమ్మును బాడుచేసికొనక వృద్ధిపఱచుకొనుచుండి నట్లు నతఁడు వ్రాసెను. భూపతిరాజు సంతసించి మరలఁ బదివేల రూపాయలను వానికిఁబంపి, తాను రహస్యముగా వానిప్రవర్తన మర యుచున్నట్లు తెలియనీయవలదని కామేశ్వరరావుపేర జాబువ్రాసెను. అతఁడిట్లు 'జవాబు' వ్రాసెను.

అయ్యా! మీ వెంకటపతికిఁ దాము పంపిన పదివేలరూపాయల నిచ్చుటకు వానికడకేగితిని. తనకిదివఱలో నిచ్చినమొత్తము చాలునని యు, దానివలన నతనికి గౌరవముగా దినము గడచిపోవుచున్నదనియు, సీధన మవసరములేదనియు మొదటవచించి నిరాకరించెను. ఇంకను వర్త కమును వృద్ధిఁజేసికొనుమని మీమామగారు పంపినారనియుఁ బుచ్చుకొనక తప్పదనియు నేను బలవంతపెట్టఁగాఁ దుదకు వల్లెయని కైకొనెను. తన యుచ్చస్థితినిగూర్చి తమపేర లేఖవ్రాయవలెనని తనకుఁ గోరిక యున్నట్లు తెలిపెను. కాని నేను వలదంటిని. నేనే తెలిపెదనంటిని. అ తఁడు మంచివారినే పోవుచున్నాఁడు. వానివిషయములోఁ దమరాందో ళితమానసులు కానక్కఱలేదు." ఈలేఖను భూపతిరాజు తమ్మునకుఁ జూపెను. అతఁడు దానినిజదివి ముదమంది "అగ్రజా! మీరు మరణ శాసనమువ్రాసి యూఱుమాసములాయెఁగదా. వెంకటపతినిగుఱించి యెప్పటికప్పుడు మంచివార్తలే మీనోటినుండి వినుచున్నను, మీచే నాజ్ఞప్తుఁడనౌటచే వానిపక్షమున నెన్నఁడును మాటలాడలేకుంటిని. నే నిప్పుడు మీయనుమతి నతిక్రమించి వానిఁగూర్చి కొంచెము చెప్పఁబోవు చున్నాను. క్షమింపుఁడు. మన తల్లికన్నసంతానమునకు జనించినవారి లో నతఁ డొకఁడే మగబిడ్డ. వాఁడిదివఱకుఁ జెడిన నిప్పుడు సన్మార్గవర్తి యై యున్నాఁడు. కావున రాజ్యమవశ్యముగా వానికే యిచ్చుటమేల

ని నాయభిప్రాయము. మీరు నాకిచ్చినధనము నాకు నరవిందకు సమృద్ధిగాఁజాలును."—అని యనెను భూపతిరాజు "నరసింహా! అందునుగురించి యొక్కమాటయైన నాతోఁ జెప్పవలదు. వానినడతను శోధించుట కాఱుమాసముల కాలము చాలదు. కొన్ని సంవత్సరములు వాఁడిట్లుండిన నప్పుడు కొంచెము నమ్మవచ్చునేమో? నాకు వానియం దనుమానము పోలేదు. వాఁడు నాదయను సంపాదించుటకే యిట్లు సద్వర్తనము నటించుచున్నాఁడని నాయుద్దేశము. 'మీ సెలవుప్రకారము ప్రత్యక్షరమును గొనసాగఁజూచెద' నని నీవు మాట యిచ్చియున్నావు. అన్నమాట తప్ప రాదుసుమా! నేను నేఁడు పరమపదమునకుఁ జనినను నీవు నాయాజ్ఞను నెఱవేర్చుటకు సిద్ధముగానుండవలెను." అని బదులుచెప్పెను.

నరసింహరా జాపలుకులువిని నోరెత్తలేకపోయెను. వెంకటపతికి సాయముచేయుటకై యుపాయాంతరమును రోయుచుండెను.

అరవిందా నరసింహరాజులు భూపతివలన సెలవుఁగైకొని చంద్రమపాలెము వెడలిరి. వారు వచ్చి వారము దినములు మాత్రమే యైనది. ఆనాఁడు రాత్రి రెండు యామములకు కెవ్వఁడో "నరసింహరాజుగారూ! నరసింహరాజుగారూ!" అని పిలుపుమీఁదఁ బిలుపుగాఁ దలుపును గుద్దుచుఁ గేకలువైచెను. నరసింహరాజప్పు డన్నమీఁదఁ బాఱుకలఁగనుచుఁ గలఁతనిద్దురయందుండి యాకేక వినఁబడఁగానే యులికిపడిలేచెను. అరవిందయు మేల్కాంచెను. సేవకుఁడు తలుపుతెఱచెను. ఒకయాశ్వికుఁడువచ్చి 'అయ్యా! ప్రభువుగారు చాల జబ్బుగానున్నారు. జీవితాశ లేదని మంత్రిగారు మొదలగువారు చెప్పుచున్నారు. మిమ్ము ను వెంటనే బయలుదేఱిరమ్మని చెప్పుచున్నారు. ఇదే సందేశము. అని నమస్కరించి వెంటనే మరలిపోయెను.

---

## ప దు నే డ వ ప్ర క ర ణ ము.



### మ ర ణ ము.



నరసింహారాజు త్వరితముగఁ బ్రయాణసన్నాహముం జేసికొని కొమార్తెతో బయలుదేఱి మఱునాఁ డుదయమున రెండుగడియల ప్రొద్దెక్కునరికిఁ గాండ్రేగులఁ జేరెను. అతఁడు దారిలో నెదురుపడినవారినెల్ల నన్ననుగూర్చి పృచ్ఛచేయుచునేయుండెను. కొంచెము నిమ్మళముగా నున్నదని యొకరు చెప్పిరి. కోటలోఁ బ్రవేశించి భూపతిరాజు పరుండియున్న గదిలోని శాత్రముతోఁ బోయిరి. భూపతిరాజునకింకను స్మృతితప్పలేదు. తమ్ముఁడును గూఁతురును సమీపింప వారినను రాగముతో నతఁడు కౌఁగిలించి యాయాసముతో 'తమ్ముఁడా! నన్నీలోకమును విడిచిపెట్టుమని దైవాజ్ఞయైనది. నేను జేసిన పాపకార్యములకు భగవంతుఁడు నన్ను క్షమించినటుల నాహృదయాంతరాళమున నేదోవచించినట్లు నాకుఁ దోఁచుచున్నది' అని మెల్లగననెను. నరసింహరాజునకు నోటినుండి మాట రాలేదు. అన్న చేతిని బట్టుకొని కండ్లనుండి బొటబొట నీరు రాల్చుచుండెను. అరవింద దుఃఖమును బట్టఁజాలక వెక్కి వెక్కి యేడువసాగెను. భూపతిరాజామె యాక్రందనమును విని యించుక కంటఁదడిపెట్టి 'అమ్మా! ఏడిచి నా మనసుఁ గలఁతపెట్టకుము. నేను శాంతచిత్తముతో జగత్పితను ధ్యానించు పవిత్రసమయమిది' యని చెప్పెను. ఆమె యామాటలువిని లోలోనఁ గుందుచుండెను. ఇద్దఱు వైద్యశిఖామణులు రోగికడ సదా కనిపెట్టుకొనియుండిరి. వారు 'ఏలినవారేదైన సోదరునితోఁ జెప్పవలసియున్నఁ జెప్పవచ్చును. తమసెలవైన నవతలకుఁబోయెద' మనిరి. వారి

పలుకులనుబట్టి భూపతి తనకుఁ గాలముసమీపించుచున్నదని తెలిసికొని వారి నావలకుఁబొమ్మని సన్నఁజేసెను. వారట్లుచేసిరి. తమ్మునిఁ గూఁతును దనకు మఱియుదగ్గరకురమ్మని యతఁడుచెప్పెను.

భూప—తమ్ముఁడా! దుఃఖింపకుము. అరవిందా! వాపోవకుము. నే నీరాజ్యపదమును మీకు విడిచిపెట్టి యింతకంటె నుత్కృష్టమైన పదమును బొందఁబోవుచున్నాను. నాయనా! నిన్నుఁ బ్రస్తుతము కొంతకాలముమాత్రమే వదలిపెట్టెదను. నిన్ను భగవత్సాన్నిధ్యమున మరలఁ గలసికొందునులెమ్ము.

నర—అన్నా! ఇన్నాళ్ళకు నిన్ను జూడఁగల్గినందులకు నీతోఁ బట్టుమని పచేండ్లయిన సుఖానఁ గూడియుండుభాగ్యము నాకుఁ దటస్థింపలేదు. నేను దురదృష్టవంతుఁడను. (అని యొకింతసేపూరకుండి) సోదరా ! నీ వొక్క విషయమున న్యాయమాచరింపవేఁడెదను.

భూప—న్యాయమా! నే నెన్నఁడు న్యాయవిరుద్ధమైనది చేయలేదే?— ఓహో! గ్రహించితిని. గ్రహించితిని.

నర—అన్నా! అవును. నీవు గ్రహించినయంశమే. వెంకటపతి మనకుటుంబవృక్షమునకుఁగాసిన యొక్క పురుషఫలము. వానికే నీ యైశ్వర్యములో విశేషభాగమునిమ్ము. అరవిందయు నేను నందున కేకీభవించి సమ్మతించెదము. వానితప్పులు కుప్పలుగా నున్నవని నే నెఱుఁగుదును. కాని వాఁడు నిశ్చయముైనయనుతాపమొందుచున్నాఁడు. వానినడతయు మార్పొందినది. కావున రాజ్యము వానికిచ్చుటన్యాయము. నాకిచ్చిన నేఁజిరకాలమే యుండఁబోను. నీవెంబడి నేనును వచ్చువాఁడనే. అరవింద యబల. అది యీబరువు మోయఁజాలదు.

అర—తండ్రీ! నిజము. నిజము. రాజ్యభారము వహింపఁజాల. బావకే

దానినిచ్చి నన్ను సుఖవంతురాలనుగఁ జేయుము. నేను ఇంద్రమహాలయములో సనాగరికులమధ్యనేయున్న సౌఖ్యవతినగుదును. భావదోషముల కందఱు క్షమించుచున్నపుడు నీవుకూడ క్షమించుట పాడియగును నాకు ఘనైశ్వర్యకాంక్ష లేదు.

భూపతి కన్నులుమూసికొనెను అతనియధరము కదలుచుండెను. మనంబు చలించుచుండెను. మునుపటి చిత్తస్థైర్యముపోయెను. వారిమాటలకు లోబడిపోయెను.

భూప—నరసింహా! ఏమికోరుచున్నావురా?—అని పదపడి కన్నులు మూసికొనియెను. పూర్వపుస్థిరచిత్తమేయున్న నమాయకులగువారి మాటలు పాటింపకుండును. ఏకీభవించి వారుభయులును జేసిన ప్రార్థన మతనిహృదయమును గదల్చినది.

నర—మరణశాసనమందు మార్పుచేయింపఁగోరుచున్నాను. అయ్యో! దానిని ఇంద్రమహాలయములో మఱచిపోయివచ్చితినే! వచ్చునప్పుడు తోడలెఱుఁగకుంటిని. ఇప్పుడైననేమి? మఱియొకటి వ్రాయవచ్చును. దానియందు రాజ్యముమాత్రమైన వెంకటపతికిచ్చునట్లు వ్రాయింపఁబ్రార్థించెదను.

భూప—ఏమి? నాయనుంగుబిడ్డకిచ్చిన యాస్తియంతయు మరలఁ బుచ్చుకొనుమందువా?

అర—పెద్దనాన్నగారూ! పుచ్చుకొనిన నాకేమియు దుఃఖముకలుగదు. నేను మనసార వచించుచున్నాను. వానికిచ్చి నన్నుఁ దేలిక పఱుపుఁడు.

నర—అన్నా! మా కీకడపటివర మనుగ్రహింపుము.

భూప—సరియే. అటులనేకానిండు. రాజ్యముమాత్రమే వానికిచ్చెదను. మిగిలినరొక్క మరవిందకే చెల్లవలెను.

నర—అందునకైన సమ్మతించెదను. వాఁడు నిజముగాఁ బశ్చాత్తప్తుఁ

డై నాఁడు. వాఁడు నీయాస్తిని దప్పక చక్కఁబఱచుకొనును.

భూప—తరువాత వాఁడనర్హుఁడై సొమ్ము వమ్ముచేసిన నాయాత్మ మిగుల వేదనపడునుజుమా! నీవు నాయాత్మశాంతికి భంగము దెచ్చిన వాఁడ వగుదువుసుమా ?

నర—అట్లు తటస్థింపదు. మీకాభయ మక్కఱలేదు.

భూప—అట్లైనఁ గానిండు. పూర్ణయ్యామంత్రిని గాగితములు కలము మొదలగుపరికరములు పట్టుకొనిరమ్మనుము.

ఐదునిమేషములకుఁ బూర్ణయ్యామంత్రి వచ్చెను. భూపతిరాజు ననుజ్ఞపై నతఁడు చిరునామవ్రాసి తాఁడుచెప్పునది వ్రాయుటకు సిద్ధముగానుండెను.

భూప—"నారాయణరాజుకూఁతుల కొక్కొక్కరికిఁ బదివేలరూపాయలును, కృష్ణమరాజుకూఁతుల కొక్కొక్కరికి లక్షరూపాయలును నీయవలెను. ఆద్రవ్యవిషయమున నామేనగోడండ్రితండ్రులు జోక్యము కలుగఁజేసికొనరాదు. నరసింహరాజునకుఁ బదిలక్షల రూపాయల నీయవలెను. అరవిందకు మిగిలిన బండ్రెండులక్షల రొక్కము నీయవలయును. కాండ్రేగులకోటయు దానికి సంబంధించిన గ్రామములును నామేనల్లుఁడు వెంకటపతిరాజు పొందవలెను. ఇది బుద్ధిపూర్వకముగా వ్రాయించియిచ్చిన మరణశాసనము." అని వచించి తమ్మునివంకఁదిరిగి 'ఇంకేమైన వ్రాయవలసినదున్నదా?' యని యడిగెను.

నర—అన్నా! చాలును. నాకుఁ దృప్తియైనది. నీవు ధన్యుఁడవైతివి.

భూప—పూర్ణయామాత్యా! మఱొక్కవాక్యమును వ్రాయుము. 'వెంకటపతి యట్టి యుచ్ఛస్థితికిఁ దగక నాయాస్తికనర్హుఁడైన మహాన్యాయదక్షుఁడగు భగవంతుఁడే చూచి తగినశిక్షను వానికి విధించుఁగాక' యనియు వ్రాయుము.

దానినిచ్చి నన్ను సుఖవంతురాలనుగఁ జేయుము. నేను జంద్రి మహాలెములో సనాగరికులమధ్యనేయున్న సౌఖ్యవతినగుదును. భావదోషముల కందఱు క్షమించుచున్నపుడు నీవుకూడ క్షమించుట పాడియగును నాకు ఘనైశ్వర్యకాంక్ష లేదు.

భూపతి కన్నులుమూసికొనెను అతనియధరము కదలుచుండెను. మనంబు చలించుచుండెను. మునుపటి చిత్తస్థైర్యముపోయెను. వారిమాటలకు లోబడిపోయెను.

భూప—నరసింహా! ఏమికోరుచున్నావు?—అని పదపడి కన్నులు మూసికొనియెను. పూర్వపుస్థిరచిత్తమేయున్న నమాయకులగువారి మాటలు పాటింపకుండును. ఏకీభవించి వారుభయులును జేసిన ప్రార్థన మతనిహృదయమును గదల్చినది.

నర—మరణశాసనమందు మార్పుచేయింపఁగోరుచున్నాను. అయ్యో! దానిని జంద్రిమహాలెములో మఱచిపోయివచ్చితినే! వచ్చినప్పుడు తోడలెఱుఁగకుంటిని. ఇప్పుడైననేమి? మఱియొకటి వ్రాయవచ్చును. దానియందు రాజ్యముమాత్రమైన వెంకటపతికిచ్చునట్లు వ్రాయింపఁబ్రార్థించెదను.

భూప—ఏమి? నాయనుంగుబిడ్డకిచ్చిన యాస్తియంతయు మరలఁ బుచ్చుకొనుమందువా?

అర—పెద్దనాన్నగారూ! పుచ్చుకొనిన నాకేమియు దుఃఖముకలుగదు. నేను మనసార నంగీకరించుచున్నాను. వానికిచ్చి నన్నుఁ దేలికపఱుపుఁడు.

నర—అన్నా! మాకీకడపటివర మనుగ్రహింపుము.

భూప—సరియే. అటులనేకానిండు. రాజ్యముమాత్రమే వానికిచ్చెదను. మిగిలినసొక్కు మరవిందకే చెల్లవలెను.

నర—అందునకైన సమ్మతించెదను. వాఁడు నిజముగాఁ బశ్చాత్తప్తుఁ

డైనాఁడు. వాఁడు నీయాస్తిని దప్పక చక్కఁబఱచుకొనును.

భూప—తరువాత వాఁడనర్హుఁడై సొమ్ము వమ్ముచేసిన నాయాత్మ మిగుల వేదనపడును జుమా! నీవు నాయాత్మశాంతికి భంగము దెచ్చిన వాఁడ వగుదువుసుమా ?

నర—అట్లు తటస్థింపదు. మీకాభయ మక్కఱలేదు.

భూప—అటులైనఁ గానిండు. పూర్ణయ్యమంత్రిని గాగితములు కలము మొదలగుపరికరములు పట్టుకొనిరమ్మనుము.

ఐదునిమేషములకుఁ బూర్ణయ్యమంత్రి వచ్చెను. భూపతిరాజు ననుజ్ఞపై నతఁడు చిరునామవ్రాసి తాఁడుచెప్పునది వ్రాయుటకు సిద్ధముగానుండెను.

భూప—"నారాయణరాజుకూఁతుల కొక్కొకరి కేఁబదివేలరూపాయలును, కృష్ణమరాజుకూఁతుల కొక్కొకరికి లక్షరూపాయలును నీయవలెను. ఆద్రివ్యవిషయమున నామేనగోడండ్రితండ్రులు జోక్యము కలుగఁజేసికొనరాదు. నరసింహరాజునకుఁ బదిలక్షల రూపాయల నీయవలెను. అరవిందకు మిగిలిన బండ్రెండులక్షల రొక్కము నీయవలయును. కాండ్రేగులకోటయు దానికి సంబంధించిన గ్రామములును నామేనల్లుఁడు వెంకటపతిరాజు పొందవలెను. ఇది బుద్ధిపూర్వకముగా వ్రాయించియిచ్చిన మరణశాసనము." అని వచించి తమ్మునివంకఁదిరిగి 'ఇంకేమైన వ్రాయవలసినదున్నదా?' యని యడిగెను,

నర—అన్నా! చాలును. నాకుఁ దృప్తియైనది. నీవు ధన్యుఁడవైతివి.

భూప—పూర్ణయామాత్యా! మఱొక్కవాక్యమును వ్రాయుము. 'వెంకటపతి యట్టి యుచ్ఛస్థితికిఁ దగక నాయాస్తికనర్హుఁడైన మహాన్యాయదక్షుఁడగు భగవంతుఁడే చూచి తగినశిక్షను వానికి విధించుఁగాక' యనియు వ్రాయుము.

పూర్ణయ్య యట్లువ్రాసెను. రోగినినరసింహరాజును బూర్ణయ్య యుఁబట్టుకొని కూర్చుండఁబెట్టిరి అతఁడు సంతకముం జేసి మరలఁబండుకొని యాయాసపడుచుండెను. భిషగ్వరులు పూర్ణయమంత్రి యున్నగువారందు సాక్షివ్రాళ్ళనుజేసి ప్రభువునాజ్ఞపై నావలకుఁబోయిరి భూపతి యరవిందతో 'అమ్మా! నీవుఁగూడఁ గొంతతడ వెడగానుందుము.' అని యామెనుఁగూడ గదివెలుపలకుఁ బంపెను. ఇప్పుడు సోదరు లిరువురే యాయగారమందుండిరి.

భూప—నామరణశాసనమును బట్టి సమస్తము నీవేపంచిపెట్టుమా! భోగరాజు కామేశ్వరరావుకూడ నీకనో యిప్పుడో వచ్చును. నాకు నాల్గుదినములక్రిందనే యస్థైర్యముతోఁచి దూరముననున్న మన ముఖ్యబంధువులు సమయమునకువచ్చుట మేలని, యానాఁడే యొకగుఱ్ఱపురౌతును గామేశ్వరరావుగారికడ కంపితిని. ఆయన మనవారినందఱిని వెంటఁబెట్టుకొనివచ్చును. నీవు కామేశ్వరరావుగారితో నాలోచించి నాయుపరకర్మ యధికముగా వ్యయపఱుపకుండ జరగనిమ్ము.

నర—సోదరా! నీపలుకులు నాహృదయమును బగిలించుచున్నవి. నీవియోగమును భరింపఁజాల.

భూప—నాయనా! భరింపకతప్పదు. విధిచెయిదములమీఱుట మనశక్యమా? నీవును జిరకాల మోర్చియుండనక్కఱలేదు.

నర—(మొగమున గుడ్డవైచికొని యేడువసాగెను. తరువాత) ఓలోకపితా! అకల్మషహృదయుఁడు, మహోదయాస్వభావుఁడు, ఆమరణాంతబ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠుఁడు, భవత్పదజలజన్యస్తమానసవిలోలుఁడు, నాసోదరుఁడు నీయాజ్ఞచే నీసాన్నిధ్యమునకు వచ్చుచున్నవాఁడు. అతనియాత్మకుఁ బరమశాంతినిమ్ము.

భూప—తమ్ముఁడా! ఇప్పుడు నాశాసఁదమ గానున్నది. అట్లు నీవును

నరవిందయు నాకడఁగూర్చుండి భగవన్నామస్మరణమును జేయు
చుండుఁడు. స్మృతియుండునంతదాఁక నేనును జేయుచుందును.
మీరు భుజించిరండు.

నరసింహరాజు—చిత్తమని కొమరితతో నావలకుఁ జని
కొంచె మాహారము భుజించెను. వారికన్నము నోటికిఁబోలేదు. కాని
యెట్టియిక్కట్టులప్పుడైన క్షుద్బాధ నివారింప నశక్యము గావున నేదో
యింతయెంగిలిపడివచ్చి రోగియొద్దఁ గూర్చుండిరి. వారికి నిముసమొక్క
యుగమువలెఁ గడచుచుండెను. కోటయంతయు నిశ్శబ్దముగా నుండెను.
ఈమహాపురుషుఁడు రాజ్యమునకువచ్చి యొకవత్సరము మాత్రమే యై
నను బ్రజలెల్లరు నేదోవిధమున నితనివలన నుపకృతులఁ బొందియే
యుండిరి. అందఱ కితఁడిష్టుఁడే. ఆనాఁడు గోవులు, నశ్వములు, పెం
పుఁడు జంతువులు, భటులు ఆహారింపలేదనవచ్చును. ప్రతిహృదయము
లో నామహాత్మునిఁగూర్చి చింతయే. ప్రతిగేహమునం దతని గుణకీ
ర్తనమే. ప్రతివాడయుం దాతని చల్లనియేలుబడిని గుఱించి పొగడ్తయే.
సాయంకాల మాసన్నమగుచుండెను. భూపతిరాజువలెనే సూర్యుఁడంత
కంతకుఁ దేజోవిహీనుఁడగుచుండెను. విరహానల సంతప్తులగు కాంతాజ
నమునేఁచురాజు రాఁబోవుచున్నాఁడని యెఱిఁగి యరవింద వికాసముఁ
దప్పియుండెను. నరసింహరాజును గూఁతురును గలసి నారాయణ నా
రాయణ యనుచు బిగ్గఱగా భూపతిరాజు చెవులలోఁ బలుకుచుండిరి.
సచివులు మున్నగువారును వారి ననుసరించుచుండిరి. అట్టి సమయమున
నరవిందాముఖవికాసకరుఁడగు లోకబాంధవుఁ డస్తమించెను. భూపతి
రాజు కీర్తిశేషుఁడయ్యెను. నరసింహరా జన్నమృతకళేబరముపైఁ బడి
"హా! అన్నా! సకలసద్గుణసంపన్నా! తమ్మునివీడి దివికేగితే. ఇంత
కాలమునకు నిన్నుఁజూచు భాగ్యము మరలఁ గండ్లకుఁ గల్గినదని యెం
తోసంతసించితిని. ఒక్కయేఁడాదితోనే యానయానందము ముగిసెనో

నే నేమియు నెఱుఁగని గ్రామ్యుఁడనే. నీయొద్ద నెన్నియో నూతనవిషయములఁ దెలిసికొనవలెనని తలఁచుచుంటి. ఇంతలోనే మనలను జూచి దైవ మోర్వలేకపోయెనే. అరవింద యిఁక నెట్లు కాలము వెడలఁబుచ్చఁగలదు. ఆమెకు సద్బోధచేయువారెవ్వరు ?" అని పరిపరివిధముల నతని గుణాదులను దలఁచికొని వగచెను. అరవింద 'హా! పెదతండ్రీ! ఎన్నెన్నిసంగతులు నీవలన నేర్చికొంటిని! ఎంతగారాబముతో నన్నుఁ జూచితివి! అజ్ఞానసాగరమందుఁ బడియుండ నన్నెన్నిసారు లుద్ధరించితివి! నీనిరుపమాన గుణముల నెట్లు మఱవఁగలను! ఇంక నాకుఁ గాలక్షేపమెట్లు? నాకెవ్వరు హితోపదేశ మొనరింతురు?' అని విలపించెను. పూర్ణయామాత్యప్రముఖులు 'హా! మహారాజా! మాకేది దిక్కు? మామాట యేమిటికిఁ జెప్పితివి. ఇందఱు నృపాలురఁ జూచితిమిగాని నీవంటి నరవరోత్తము నెచ్చటఁ జూడలేదు. శౌండుని మించినదానము, సముద్రమునుమించిన దయయుఁ గల నీవంటి రాజవతంసమును మాకు మరల లభించునా? మేము నిర్భాగ్యులము. నీవంటి మహారాజు మాకేల దక్కును?' అని పరిదేవనముసేసిరి.

జామురాత్రి యగునప్పటికిఁ గామేశ్వరరావుగారు నారాయణరాజాదులతో వచ్చిరి. ఆ ఘోరవార్త విని పెద్దపెట్టున రోదనముం జేసిరి. కామేశ్వరరావు నెయ్యునిమరణమువిని రాపడిపోయి తర్వాత నతని గుణోన్నతిని బ్రస్తుతించుచు వాచారెను. వెంకటపతిరాజు శవముపైఁబడి 'ఓమామా! నామాట యేమిచెప్పితివి? నాకు దిక్కెవ్వరు? నాకుఁ దలిదండ్రులు లేని వెలితిఁదీర్చితివే. ఇప్పుడు నేను గోదావరిలోఁ బడవలసినదే? నాయవివేకమును సహించి నన్నుఁ గడుపులోఁ బెట్టుకొనువారిఁక నెవ్వరున్నారు? నాదుష్టత్వ మంతయు నొక నెలలో మాన్పఁగల్గితివే! ఏమినీసామర్థ్యము! ఏమి నీనేర్పు! ఏమి నీదయాశీలత! నీవులేనిప్రపంచము నాకేల? నేనును నీతోవచ్చెదను. కొనిపో

మ్ము'. అని యాఁడుదానికంటె నెక్కువగా నేడువ మొదలుపెట్టెను. బాలకుఁ డడలిపోయెనని యెంచి నరసింహరాజు 'నాయనా! ఊరకొనుము. పోయినమామ విలపించిన మఱలవచ్చునా? గుండె పగులును జుమీ. అతఁడు ధన్యుఁడు మనము దురదృష్టవంతులముగాని యతని కేమి?' యని యూరడించెను. వెంకటపతి 'మామా! ఎటులూరకొనఁగలను. నన్నెన్నివిధములఁ గనిపెట్టుచున్నాఁడనుకొన్నావు? నన్నుఁగన్నవానికైన నామీఁద నింతప్రేముడి యుండలేదు. అట్టిమహాత్ము నెట్లు మఱవఁగలను. నేనిఁక బ్రతుకఁజాల' నని గుండెలు బాఁదుకొనియు దొరలియు వాపోవఁజొచ్చెను. నరసింహరాజు కసరిన నూరకొనునేమో యని యెంచి 'వెంకటపతీ! ఏమి యీవెఱ్ఱి? అదేపనియా? చాలు' నని లేవఁదీసి దగ్గఱకుఁజేరి 'బాబూ! ఇట్లేడ్చిన నేలాగున రాజ్యమేలఁగలవు? నీకే రాజ్యమంతయు నిచ్చినాఁడుసుమా. ఇఁక రాజ్యలక్ష్మినిజేపట్టి నేల యేలవలయును ఊరకొనుము.' అని మెల్లగాఁ జెవిలోఁజెప్పెను. 'నాకు రాజ్యమెందులకు మామా? పెద్దమామ పోయినతరువాతఁ గులుకుచు రాజ్యమేలుదుననుకొంటివా? నాకేమియు నక్కఱలేదు. సన్న్యాసమును స్వీకరించి యేయడవులలోనికో పోయెదను. నేనాతని వియోగమును భరింపఁజాల' నని మెల్లగ నాక్రందించుచుండెను. నారాయణరాజాదు లిదివినలేదు.

కామేశ్వరరావు నరసింహరాజును బిలిచి మఱియొకమందిరంబునకుఁ దీసికొనిపోయి తదనంతరకర్తవ్యమునుగూర్చి సంభాషించెను. అతఁడు మొదటిమరణశాసనము రద్దుపఱుపఁబడుటయు, వెంకటపతి రాజునకు రాజ్యమిచ్చునట్లును దక్కుంగలవారికి రొక్కము పంచిపెట్టునట్లును మరల మరణశాసనము వ్రాయఁబడుటయు నంతయుఁ జెప్పెను. వెంకటపతి ప్రచ్ఛన్నముగా వారివెనుకనేపోయి యొక గోడమూల దాఁగియుండి వారి సంభాషణము నంతయు నాలకించెను. కామేశ్వరరా

వు నరసింహరాజు చెప్పినదంతయువిని ముఖ్యాంశము లొక కాగితము మీఁద వ్రాసికొని ' అయ్యా ! తమరా శాసనము నెచ్చట నుంచితిరి ? అని యడిగెను. అతఁడు ' బహుభద్రముగా దాఁచితిని. మా యన్న గారు చనిపోయిన గదిలో నొక పేటికయందునిచి తాళము వైచితిని. ఈట్టిపత్రము జాగరూకతతో దాఁపవలెనని యెఱుఁగనా ? ' యని మాఱ్పలికెను. వెంకటపతి వినవలసినమాట లన్నియు వినియుండుటచే వెంటనే యావలకు జాఱెను. నరసింహరాజు ' నాయనా ! నీకే రాజ్యమంతయు నిచ్చినాఁడనుసుమా ' యని యోదార్పుమాటలతో వచించినప్పుడే భరింపరాని యానందము తోఁచెను. ఇప్పుడు మరణశాసనమందలి యంశములన్నియుఁ బూర్ణముగా వినినపిమ్మట ననిర్వాచ్యసంతోషముం బొందెను. కోటబురుజుపై నెత్తుగా నుంపఁబడిన దివ్వెచేఁ గోటయంతయు జక్కఁగాఁ గాన్పించుచుండెను. అతఁడొక్కసారి యంతయుఁ గలయఁ జూచెను.

అహా ! ఈవిశాల రమ్యభవనము లన్నియు నావే కాఁబోలు ! ఆపుష్పవనములన్నియు నావే ? ఈరథగజ తురగంబులు నా స్వాధీనములోనుండునవే ? ఈభటవర్గమంతయు నాకు సేవచేయునదే ? ఈ యారామములందు నేను ప్రియసఖులతో నెట్లువిహరించిన నన్నుఁ బ్రశ్నించువారుండరు. వేడుకలకు వినోదములకు నెంతధనము వెచ్చించిన నన్ననువారెవరు ? మామాలతిభాగ్యము పండినది. పువ్వుల వెంకటరత్నమును బంగారపుఁబువ్వులచేఁ గప్పిపుచ్చవచ్చును ఈ కమలాగారముందు నేను శ్రీకృష్ణునివలె నిరంతరమును నాచెలికత్తెయలతో జలక్రీడలు సలుపవచ్చును. వెంకటపతీ ! ఇన్నాళ్ళకురా నీయదృష్టము బయలుపడినది ! " అని తనయొడలు తానెఱుఁగకుండ మాటలాడుకొనుచుండెను. సురాపాన మొనర్చినట్లున్నాఁడు. సురయా ? —అదియైన నింతమత్తును గల్గింపదు. " ఈ యైదాఱు మాసములయందియుఁ జేతు

లార వ్యయము చేయుటకు ధనము లేకపోయెనే ? పంచప్రాణములును బిగియఁబట్టి, యెక్కడ కామేశ్వరరావు నన్నుఁ బట్టుకొనునో, నాదుర్నీతినిగూర్చి వారలఁదెలిసిన మునలిముండకొడుకు నాకూఁటిలో మన్నుపోసి యేమిచేయునో యని భయపడుచుఁ జచ్చినవానివలె నేఁటివఱకుఁబడియుంటిని. ఇఁక మనకేమిభయము ? కామేశ్వరరావేమిచేయఁగలఁడు? నాపన్నుగడలన్నియు బాగుగా నుపయోగపడినవి. వృద్ధుఁడు చచ్చువఱకే మనకపటవర్తనము. ఇఁక నెందులకు ? ఇప్పుడు స్వేచ్ఛగా రాజపురుషోచితములగు నా సాహసౌదార్యాదులఁ జూపింపవచ్చును." అని యతఁ డనుకొనుచు నొక చంద్రకాంత శిలాతలంబునఁ గూరుచుండియుండెను. హార్షమును బట్టలేక రెండుచంకలు వైచుకొనెను. రెండుపాదములతో నగుచుచుఁ బార్శ్వమందలి పూఁదోఁటలోనికిఁ బరువెత్తెను. తుదకాయాసముతోఁచి 'నాకన్నులకుఁ గాన్పించునదంతయు నాదే !' యని యొకచోఁ గూలఁబడెను. కొంతవడికిఁ దెలివితెచ్చుకొని "ఒక్కదమ్మిడియైన నారాయణరాజున కీయనక్కఱలేదు. ఒక్క గుడ్డిగవ్వయైనఁ గృష్ణమరాజున కీయవలసినపనిలేదు. వహ్వా ! వహ్వా ! మిగుల బాగుగజరగెను. నేను సింహాసన మధిష్ఠించు నాఁడు వారలమొగము లెట్లుండునో ? ఆర్పిన దివ్వెకంబములవలె నుండును. అప్పుడుగదా నాకుఁ గన్నులపండువు ! (అంత యోచనాదృష్టితో) నారాయణరాజు తనయులకు లక్ష, కృష్ణమరాజు కూఁతులకు రెండులక్షలు, నరసింహరాజునకుఁ బ-ది-ల-క్ష-లు, అరవిందకుఁ బం-డ్రెం-డు-ల-క్ష-లు—అమ్మయొయ్యో !—రొక్క మీయవలసినదే ? నే ననుభవింపఁదగిన ధనమంతయు నిట్లు వ్యర్థముగాఁ బోవలసినదే ? ఇంత ద్రవ్య మీపచ్చిగాండ్రపాలుకావలసినదే ?—(తలపంకించి రెండు నిముసము లాలోచించి) వలదు. వలదు. అంతయు నేనే పొందెదను. ఒక చిల్లిగవ్వయైన వారిచేతులలోఁ బడనీయ" నని పలికి మనమునందు

స్ఫురించిన యాలోచనకు సంతసించుచు భూపతి కళేబరమున్ను గదికిఁ బోయెను. వానిచూపులు యథాప్రకారముగానే యుండెను. వాఁడు ‘ పక్కా ’ టక్కరి. మరలఁ కండ్లు తుడిచికొనుచు ‘ అయ్యో ! మామా ! నాకేమిగతిచెప్పితివి ? నన్నాదరించువారెవరు ? ’ అని దుఃఖించుచుండెను.

## పదునెనిమిదవప్రకరణము.



### మరణమందిరము.

రాత్రి రెండుయామములైనది. ఊరంతయు మాటుమణిఁగెను. భూపతిరాజు మరణమువలెనే జగమంతయు భయావహముగనుండెను. క్రుంకెడు నక్షత్రములు క్రుంకుచుండెను. ఉచ్ఛస్థానమునకు లేచెడు నుడుగణములు లేచుచుండెను. ఏతాపత్రయములు లేనివారు గాఢనిద్రయందు సుఖించుచుండిరి. మన నరసింహరాజాదులవంటి దుఃఖాయత్తులు భవిష్యచ్చింతానిమగ్నమానసులై మేలుకొనియేయుండిరి. ఖేదము నొందుచున్నవారేకాక మహామోదమొందుచున్న వెంకటపతిరాజువంటి వారికిని గంటికిఁ గూర్కు లేకుండెను. జారచోరకులును జాగ్రదవస్థయందేయుండిరి. ఈరాత్రి జగమంతయు నంధకారమయమైనటులేయుండెను. అరవిందా నరసింహరాజాదుల హృదయములు దుఃఖాంధకారపూరితములై యుండెను. నారాయణరాజాదులయెడద లవివేకాంధకారపరీతములై యుండెను. దురాశాతమోగ్రహపీడితమైన వెంకటపతిరాజు మనస్సు గర్వాంధకారాక్రాంతమైయుండెను. చిమ్మచీకటియు నెల్లెడలనిండి నిబిడీకృతమైయుండుటచే జగమంతయు నంధకారమయమగుట యతిశయోక్తి గాదు.

పెద్దపెట్టున నేడ్చుచున్న వెంకటపతి నీవలకులాగి, నరసింహ రాజు శవమున్నగదితలుపులు దగ్గఱఁబెట్టించి, సేవకులను గావలియుం డనియమించి, యందఱను గొండొకతడవైనఁ బండుకొనుఁడనిచెప్పి, వారికిఁ దగుచోటులఁ జూపించి, తానుగూడ నించుక విశ్రమింపనెంచి యొకగదిలో నొకవాల్గురిచీమీఁద వ్రాలెను. వెంకటపతి నారాయణ కృష్ణమరాజు లొకగదియందును, అరవింద, రత్నమ్మయున్నగుస్త్రీ లొక గదియందును భూపతిరాజునుగూర్చి తగురీతిఁ జెప్పుకొనుచు శయనించి రి. నరసింహరాజు 'ఏమి!-మాయ? కురూపియై, కుచేలములనుగట్టిన శోభనాద్రిరాజు మహైశ్వర్యసంయుతుఁడై, మానవలోకమందారము గు భూపతిరాజుగ మాఱుటేమి? మాటెఱఁబో. ఇంతలోనే మృత్యువా సన్నముకావలెనా? మొన్నమొన్ననేకదా యతఁడు క్రమ్మఱ జన్మస్థాన మునకువచ్చి నాతోఁ బరమమైత్రిమై చరించినాఁడు! అట్టివాఁ డింతలో మాయమయ్యెనా? ఇంతరాజ్యమునుగొని వత్సరదశకమైన ననుభవింప లేకపోయెఁగదా! ముప్పదియాఱేండ్లు చెమటలూడ్చి సంపాదించిన విత్త మంతయుఁ బరహస్తములలోఁబెట్టి తనదారిని దాను బోవుచున్నాఁడు గదా! ఆమహాపురుషుఁ డనుమానించినట్లు వెంకటపతి బోలెఁడాస్తియు బొగ్గులుచేయఁడుగద? చేయఁడని నాకు నమ్మికగలదు." అని పలుతెఱం గులఁ జింతనఁజేయుచుఁ గన్నులు తెఱచికొనియేయుండెను. పాపము! అతనికి లోకమునుగూర్చి యేమియుఁ దెలియదు. వెంకటపతివంటి మూ ర్ఖులమూర్ఖత మాన్పనశక్యమని యతఁడెఱుఁగఁడు. అట్టివానికి ధనసంప దలిచ్చుట. పామునకుఁ బాలువోసిపెంచుటని యతనికిఁ దెలియదు. ఇట్టి చింతలో నతఁడు మునిఁగియుండి కొంచెముసేపటికి నిద్దురకును మెలఁకు వకును మధ్యమైన యవస్థయందుండెను. అతఁడన్నకు సేవచేయుచున్న ట్లును, రోగ మధికముగానుండినట్లును, వైద్యు లౌషధప్రయోగము చేయుచున్నట్లును మరణశాసనమును మార్పుచేయుమని తానన్నను

బతిమాలుచున్నట్లును గలఁ గనుచుండెను. అట్టిసమయమున నేదో చప్పుడు వినఁబడెను. తుల్లిపడి లేచెను. ఒక మనుష్యాకృతి మెల్లగ నడచిపోవుచున్నట్లతనికిఁ దోఁచెను. మఱింతభయము కలిగెను కాని యావెఱపు రెండునిముసములవఱకే. అతఁడు కుర్చీమీఁదనుండి లేచి నల్దిక్కులఁ గలయఁజూచెను. ఆవలఁ గటికచీఁకటి. అంతయు నిశ్శబ్దముగానుండెను. మరల నేమియు గోచరింపలేదు. చీఁకటిరంగుతో సమానమైన వర్ణముగల కొయ్యవస్తువులుమాత్రమే యతనికగపడెను. అంతయుఁ జిత్తభ్రమయేయని నమ్మి భగవన్నామస్మరణముం జేసికొనుచ మరల నిద్రింపయత్నించెను.

ఈపర్యాయ మతని నిద్రాదేవత బాగుగ నావహించెను. కొంచెముసేపు మైమఱచిననిద్దుర పట్టెను. మరల నేదియో ధ్వనియగుటచే మెలఁకువ వచ్చెను. వెనుకటితడవ నడుగులచప్పుడుమాత్రమే వినిపించెను. ఇప్పుడు తలుపుఁజేరవైచినట్టులు కిఱ్ఱుమను సద్దుకూడ విననయ్యెను. తిరుగ లేచికూర్చుండెను. ఈతూరి భ్రమకాదని నిశ్చయించెను. మనస్సు పరిపరివిధములఁబోయెను. పిశాచములయందు నమ్మకములేనివాఁడయ్యు నిప్పుడు తన నిద్రాభంగముఁగావించిన దొకదయ్యమేమోయని శంకఁబొందెను. “ప్రపంచములో దయ్యములు లేనేలేవు ఒకవేళనుండిన దురాశాపాశములచేఁ దవుల్కొనినవారే కాని నాయన్నవంటి నిర్మలహృదయులు దయ్యములుకారని యందురు. సరే. ఏదో నేనఱుఁగని కారణముచే నాయగ్రజుఁడు పిశాచమయ్యెననియే యనుకొందము. అతనికి నేను ప్రియసహోదరుఁడనుగదా యేల యిట్లువచ్చి నన్ను భయపెట్టును? అతనికేమియకార్యమొనర్చితిని? అతఁడు మహాశాంతచిత్తముతోఁ బ్రాణములు వదలెనే. వానికేమియాసలుకలవు? నేను నమ్మను. పిశాచము గాదు. మఱియొకటియై యుండవలెను. ఏదియో చూచి వత్తును.” అని తనలోఁ దాను వాదించుకొని చెప్పులజోడును దొడిగికొ

ని యొకకఱ్ఱఁ జేతఁబట్టుకొని బయలుదేఱెను. అయిదారడుగులువైచి దారిలో నేదైనఁ గనఁబడునేమో, యేమైన వినఁబడునేమో యని చూచుచుండెను. ఏమియుఁ జూపట్టలేదు. ఎక్కడను జీమచిటుక్కుమనుటయైన లేదు. మెల్లగ దండముతో నేలమీఁదఁగొట్టుచు నన్న మృతినొందినగది యొద్దికిఁజని కవాటముఁదెఱచెను. మున్నచట దీపముండెడిది. అది యిప్పుడు మలుపఁబడెను. నరసింహరాజు శరీరమంతయు భయోద్రేకముచే గగుర్పొడిచెను. ఎవరో చప్పుచప్పున నడచి తటాలున నొకచో నాగి నట్లతనికి గోచరించెను. అతనిదేహమునకుఁ గంపముదయించెను. పిశాచములయం దెంతయువిశ్వాసమున్నను మరలమరల భయము కలుగుచునే యుండెను. తుదకు గుండెనిబ్బరముచేసికొని శవము దగ్గఱెను. భూశయ్యను బవ్వళించియున్న భూపతియొక్క భౌతికదేహముప్రక్క మోఁకాళించి యెవ్వఁడోయుండినట్లతనికిఁ బొడఁగట్టెను. వాఁడు మెల్లగ 'అయ్యో! మామా! నన్ను క్షమింపవా? నేను మహాపరాధిని. పాపిని. నీవుగతించిన నాకు దిక్కెవరు?' అని విలపించుచుండెను. వాఁడు వెంకటపతియే యని నరసింహరాజు కనిపెట్టెను. వానిప్రవర్తనమంతయు సత్యమైనదే యని నమ్మి 'బాబూ! వెంకటపతీ! ఇక్కడనే యుంటివా? ఏమినీవెఱ్ఱి? వగచిన లాభమేమికలదు? ఒక్కకడుపునఁబుట్టిన వానికి నాకుమాత్రము దుఃఖము లేదనుకొన్నావా? మనముచేయునది లేదు. భగవదేచ్ఛయట్లున్నది. ఇప్పుడు మన మతనికి సద్గతులుగల్గుటకై స్వామికిఁ బ్రార్థనముసలిపెదము రమ్ము.' అని యనెను. వెంకటపతి 'మామా! ఇంతకంటెనా? పెద్దమామకొఱకు శరీరమును గోసియిమ్మనిన నిచ్చెదను.' అని చెప్పి చిన్నమేనమామతోఁ గూడి ప్రార్థనమునకు సిద్ధమయ్యెను. ఇరువురును జేతులనుజోడించి యూర్ధ్వముఖులై ప్రార్థింపనారంభించిరి. ఒకఁడు పవిత్రహృదయముతోఁ కేవలసోదరవిషయికప్రేమతో వేఁడుచుండె. రెండవవాఁడు కపటశీలియై కల్మషమనస్కుఁడై గంగెద్దు

వలె నతని ననుసరించుచుండెను వానిమనసులోఁ గాపట్యముతప్ప వే రొండులేదు. కొంతవడికి నరసింహరాజు లేచెను. వెంకటపతి యొక్కువ శ్రద్ధతో నర్థించు వానిభంగి నింకను లేవకుండెను. మఱియొకనిముసము లకుఁ దానును లేచి మేనమామతో నావలికిఁ జనెను. నరసింహరాజు మే నల్లునితోఁ దనగదికిఁ బోయెను. చెఱియొకకురిచీమీఁదను గూర్చుండిరి.

నర—నాయనా ! నీకుఁ బెద్దమామపై నింతప్రేమ యున్నదని నే నెఱుఁగను.

వెంక—మామా! అతనిఋణము నే నేమిచేసినఁదీఱును? నాచర్మమొలిచి చెప్పులుకుట్టి యతనిపేరుమీఁదనొకరికిచ్చినఁ దీఱునా? తీఱదు.

నర—అవును. అతని యుపకృతి యట్టిదే. నీవును దదనుగుణముగానే వర్తించుచున్నావు. (అని మరల చింతదనుక వినఁబడినచప్పుడు స్మృతికిరాఁగా) అబ్బాయి! నీవు దారిఁదప్పి యొకగడియకిందనిక్కడకువచ్చితివా?

వెంక—(ఆశ్చర్యముతో) లేదు, మామా ! ఏల యట్లడుగుచున్నావు? ఏమిజరగెను?

నర—ఏమియునులేదు. ఏమియునులేదు—(అని యస్పష్టముగా) అదంతయు నాభ్రాంతియే యైయుండనోపు.

వెంక—ఆఁ ఇప్పుడు జ్ఞప్తికివచ్చినది. నేను బండుకొన్నగదినుండి (గద్గద స్వరముతో) మామపోయినగదిలోనికిఁ బోవుచు నిద్దురమత్తుచే నించుకతూలి యాతలుపుమీఁదఁ బడితిని.

నర—అద్దాని యేకాఁబోలు నన్ను భ్రమపెట్టినది? మొదటినాదము కేవలచిత్తభ్రాంతియే.

వెంక—మామా ! ప్రభాతము కావచ్చుచున్నది ? ఒక్క కూర్కు నొందుము.

నర—మన సీతమహాకల్లోలములతో నిండియుండ నెట్లునిద్రపట్టును ? కాని, బాబూ ! నీవు రాజ్యమునుబొందఁబోవునట్లు నారాయణ రాజాదులకింకను దెలుపకుము. రేపు దహనాదికర్మములు ముగిసినపిమ్మట నంతయు వెల్లడించెదము. ఈలోపున నల్లరియొందులకు ?

వెంక—అలాగుననే! నాకేమియు రాజ్యకాంక్షలేదు. కృష్ణమరాజాదులకు దానియం దంతకోరికయున్న వారి నేల యనుభవింపనీయరాదు? నేను విరాగినై యెచ్చటికైనఁ బోదమనియున్నది.

నర—వెఱ్ఱివాఁడవుగాని వైరాగ్యముఁబొందిన నీకేమిలాభము ? పెద్దవాఁడను. నేను జెప్పినట్లుచేయుము. పోయి కొంచెమునేపు పరుండుము.

వెంక—సరే. యని తనగదిలోనికేగెను.

నరసింహరాజు వానిమాటలయందుఁ బూర్ణవిశ్వాసముంచెను. వానికి నిజమైన వైరాగ్యమే యుదయించెననుకొనెను. కైతవవర్తనుల యభిప్రాయము లమాయికుల కెట్లుతెలియఁగలవు?

తెలతెలవాఱుచుండెను. జాగరజాతరాగనయనములతో నరసింహరాజు గదివెలుపలికివచ్చెను. చెలువుగులుకు పులుఁగులపలుకులు నేఁడతనిచెవులకు ములుకులయ్యెను. సౌరభసమ్మిళితంబులగు మందమలయానిలంబు లాతని త్వగింద్రియమున కేమియు హాయినిగూర్పకుండెను. బ్రహ్మతేజ ముట్టిపడు సహస్రకరబింబ మాతనినేత్రముల కేమియు నానందముం గల్గింపకుండెను. పుష్పలావికలయొక్కయు, మారిషాదిశాకవిక్రయికులయొక్కయుఁ గేకలు విలాపములవలెనే యతనికిఁ దోఁచెను. బ్రహ్మజ్ఞానార్జనార్హమై, వినిర్మలమైయుండవలసిన యాతని మనస్సీప్రాతస్సంధ్యాసమయమున మిగుల గలఁకఁబాఱియుండెను. అతఁడు కాల్యంబులఁదీర్చి తదనంతరకర్తవ్యము నూహించి యాలోచించుచుండెను

అత్తఱిఁ గామేశ్వరరావు తానును సర్వమును దీర్చికొనినవాఁడై యతనిక డకువచ్చెను.

కామే—నరసింహరాజుగారూ! ఇఁకమనము దమనప్రయత్నములు సలుపవలెను. కావలసినవస్తువులఁ దెచ్చుటకై భటుల నియమించితిని మఱియు నొకయాశ్వికునిఁ జంద్రమపాలెమునకుఁ బంపి మీరు భద్రముగా దాఁచియుంచిన మొదటిమరణశాసనమును గూడఁ దెప్పింపవలయును.

నర—దాని యుపయోగమిప్పుడు మన కేమికలదు?

కామే—ప్రస్తుతము కనుపింపకపోవచ్చును. కాని యెందునకైనను నుంచిదే. అదియునుంగాక రెండవశాసనములో ముఖ్యాంశములు మాత్రమే సంగ్రహముగ వ్రాయఁబడియున్నవి. మహామేధావంతుఁడగుతేఁ డేయే కారణములచే నవరెవరి కెంతెంతధనమిచ్చెనో మొదటిశాసనమువలన నందఱెఱుంగఁగలరు.

నర—కారణము లెఱిఁగింపకపోయిన నెవరు సాహసించి యాక్షేపింపఁగలరు?

కామే—తమ కేమియు నీయఁబడలేదని తెలిసినప్పుడు దురాశాపరులగు కృష్ణమరాజ నారాయణరాజులూరకొందురా? తెగువతో వారేదైనఁబల్కిన మన మాశాసనమును జూపి వారినోరులఁ గట్టింపవచ్చును. రెండవశాసనమే మన కిప్పు డుపయోగించునదైన నయ్యది కూడ నుండుట మంచిదని నా యుద్దేశము.

నర—సరియే. అటులైనచోఁ దెప్పించెదను. అని యొక యాశ్వికుని బిలిచి చంద్రమపాలెములోఁ దన పడకగదియందుంచిన చందుగుపెట్టెను దేనాజ్ఞాపించి వానిచేతి కింటి తాళముల నిచ్చెను. తాళములు దగ్గఱనుండి తీయుండుఁడనియుఁ, పెట్టెను బదిలముగాఁ దీసియుండవలెనియు

నొకస్నేహితుని పేరఁ గమ్మ వ్రాసి యాఁరొతు చేతి కిచ్చి పంపెను.

కామేశ్వరరావుగారూ ! ఎంతయో యవసరము తటస్థించినఁ గాని దానిని బైకిఁ దేసీయరాదుసుడీ ? ఏలయన నేను గాని మా యమ్మాయి గాని వెంకటపతికిఁ గలుగఁబోవు రాజ్యప్రాప్తికి భంగము తెచ్చుటకు సమ్మతింపము.

కామే—ఆసంగతి నాకుమాత్రము తెలియదా ? మీకు, నాకు, మీ కొమార్తెకుఁ దప్పఁ దక్కఁగలవారి కెవ్వరి కామరణశాసనమును గూర్చి తెలియదు. మీరేమియు సందేహింపనక్కఱలేదు. అంతయు ననుకూలముగా నేజరుగును.

అంత వారుభయులును గలసి భూపతిరాజుగది-లోనికిఁ బోయిరి. రాజపురోహితులువచ్చి శాస్త్రోక్తపద్ధతిని శవమునకుఁ జేయు సంస్కారములఁ జేయించి బంగారుపల్లకియందుఁ బెట్టించి యొకపట్టుబట్ట దానిపైఁ గప్పించిరి. స్నాతులైన క్షత్రియశ్రేష్ఠులు పల్లకిని మోవసిద్ధముగానుండిరి. నరసింహరాజు కూడ సుస్నాతుఁడై యగ్నిహోత్రమును హస్తమునందుఁ దాల్చి నిలచెను. కోటవాకిలిముంగిట నేనుంగులు, గుఱ్ఱములు వరుసలుగా నిలిపియు, దత్సమయోచితవేదభాగములఁ బఠియింపఁగలవేదవేత్తలగువిప్రుల నొక శ్రేణియం దునిచియు, రాజబంధువులును రాజకీయోద్యోగులును బారలుగట్టి యెడనెడ నిలువఁబడునట్లు చేసియుఁ గామేశ్వరరాయ పూర్ణయామాత్యులు కాలోచిత పరిధానముల ధరించి మొగములు వంచి నిలువఁబడియుండిరి. దిశలు బోరుకలఁగం జేయఁబడిన నారాయణనామస్మరణముతోఁ బల్లకి నెత్తిరి. అరవిందాద్యంతఃపుర కాంతాజనము గొంతెత్తి యాక్రందనము సేయఁదొడఁగెను. వెంకటపతి కోటయంతయుఁ బ్రతిధ్వనులీనునట్లు బిగ్గఱగా రోదనముచేయుచుండెను. అతని రోదనధ్వనిలో నితరుల యాక్రందనధ్వనులు మునిఁగిపోయినవి. నరసింహరాజు పొరలిపొరలివ

చ్చుచున్న దుఃఖమును దిగమ్రింగుచుఁ, గంట్లుదుడిచికొనుచుఁ బల్లకిముం దు నడచుచుండెను. వారందఱును బ్రధానద్వారమును దాఁటి రాజ మార్గముఁ బడి మెల్లగఁబోవుచుండిరి. ఘోటకఖురతాడనటకటకధ్వ నులును, భూసురోత్తములచేఁ బఠింపఁబడు వేదఘోషలునుదక్క మఱే శబ్దమునులేదు. ప్రతియింటివారును నీవలకువచ్చి కడపటిసారి రాజము ఖసందర్శముంజేసి కన్నీరే కానుకలుగానర్పించి లోని కరుగుచుండిరి. " ఆహా ! ఎట్టిమహారాజు ! ఎంతస్వల్పకాలము రాజ్యమును జేసిననే మి ? అజరామరమైనకీర్తిని సంపాదించిపోయెఁగదా. అట్టివాని బ్రతు కొక్కయేఁడైనఁ జాలదే. కాకి నూఱేండ్లు బ్రతికిన నేమిలాభము ? అది స్వోదరపోషణముందక్క నుఱేమిచేయఁగలదు ? వెనుకటిరా జంత కాలము నేలయేలె నెవరి కేయుపకృతి యొనర్చినాఁడు ? విషయలంప టుఁడై యెల్లరకు రోఁతయే కల్గించెఁగదా ! లోకములో మృతజీవులు, జీవన్మృతులను రెండుతెఱఁగులవా రుందురు. వారిలో మృతజీవివర్గమం దు భూపతిరా జగ్రగణ్యుఁడుకదా ! " అని యందఱును జెప్పుకొనసా గిరి. కొంతసేపటి కాపీనుంగు పితృవనమునకుఁ గొంపోఁబడి మంచిగంధ పుఁజెక్కలచేఁ బేర్పఁబడినచితిపై నుంపఁబడెను. నరసింహరాజు దుఃఖో ద్రేకము చే నొడలెఱుఁగక పురోహితులుచేయుమన్నదిమాత్ర మొటు లో చేయుచుండెను. భూపతి కగ్నిసంస్కారము కావింపఁబడెను. మూఁడునాల్గుగడియల కామహనీయుని పవిత్రదేహము పరమపవిత్రుఁ డైన యగ్నిహోత్రునిచే భస్మపటలముగాఁ జేయఁబడెను. ఎవరిదారిని వారిండ్లకుఁబోయిరి. నరసింహరాజు కోటకు మరల వచ్చుసరి కరవిందా దులు స్నానములాచరించి చిన్నవోయిన మోములతోఁ గూర్చుండి యుండిరి. వెంకటపతిమాత్రము నాఁటికర్మమును ముగించివచ్చిన మేన మామను కౌఁగిలించుకొని పెద్దపెట్టున నేడ్వసాగెను. అచ్చటనున్నవా రెల్లరు [illegible] నోదార్చిరి.

మధ్యాహ్న మందఱును భోజనములుచేసి సభాస్థానమందుఁ గూర్చుండిరి. అరవిందాదివనిత లొక తెఱచాటునఁ దివాసిపై నాసీనులై యుండిరి. ఆ తెఱనుండి వారు పురుషులను జూడఁగలరు. పురుషులు మాత్రము వారిని జూడఁజాలరు. కామేశ్వరరావు పూర్ణయామాత్యాది ప్రథానోద్యోగస్థులను గొందఱిని వెంటఁబెట్టుకొనివచ్చి వారినెల్ల నర్హాసనాసీనులం జేసి తానును దగు పీఠముపైఁ గూరుచుండె. గద్దెకు సమీపమందుంపఁబడిన పైఁడికురిచీమీఁద నరసింహరాజు సుఖాసీనుఁడయ్యె. అప్పుడు చంద్రమపాలెమున కేగిన యాశ్వికుఁడు మందసనుబట్టుకొనివచ్చి నరసింహరాజు కురిచీయొద్దనుండి యతని కింటితాళముల నిచ్చి వైచెను. అంతఁ గామేశ్వరరావులేచి యిట్లుచెప్పెను. "మహనీయులగు రాజబంధువులారా! రాజకార్యవిశారదులగు పౌరశ్రేష్ఠులార ! శ్రీభూపతిరాజుగారికిఁ గాండ్రేగులసంస్థానమేకాక యిరువదియైదులక్షల రొక్కమునుంగలదు. అతఁడు శాశ్వతబ్రహ్మచర్యనిష్ఠుఁడై పరలోకమున కేగెను. తనయాస్తియంతయు బందుగులకుఁ బంచిపెట్టుచు నొకమరణశాసన మాయుదారపురుషుఁడు వ్రాయించియున్నాఁడు. అయ్యది దాయనగదిలో నొకపెట్టెయందు జాగ్రత్తగానుంపఁబడెను. దానితాళము నరసింహరాజుగారియొద్దనేయున్నది. ఎవరైన నాయనతో నేగి దానిని దెప్పింపవచ్చును." నరసింహరాజిదే తాళము. నేనును సిద్ధముగా నున్నాఁడ' ననిపలికెను. నారాయణకృష్ణమరాజు లొకరివంక నొకరుచూచుచుఁ దామాఱునెలలకిందనంత నేర్పుతో భూపతిరాజునకుఁ జేసిన యుపదేశము పనికివచ్చెనోలేదో, తమయంచన సరిపోవునోలేదో యని మిక్కిలి యాత్రముతో నుండిరి. రాగమ్మసుబ్బమ్మగారు లటులే యేదో యాతురతతో నున్నటులే కాన్పించుచుండిరి. కాని వారు స్త్రీలగుటచే నంతగాఁ దమయభిప్రాయములను గన్పడనీయకుండిరి. రత్నమ్మ లక్ష్మీనరసమ్మగారు లేచింతయులేక తిలకించుచుండిరి. అరవింద శిరమువంచి దైన్య మానస

నన్నుఁ బదిమందిలో మిగుల నిందించితివి. నిన్నుఁజూచి యీగర్వపుఁ
బోఁతులుగూడ నన్ననరానిమాటలనిరి. నోరుక్రొవ్వి మీరేమియన్నను
నాకు భయములేదు. నేనుమాత్రము సహించియూరకొనువాఁడనుగాను.
నేనామరణశాసనమునుగూర్చి యేమియు నెఱుఁగనిమాట సత్యము. నీ
వు నీనోటితోఁ బెదనూమ రాజ్యమంతయు నాకే వ్రాసియిచ్చెనని
పలికియుంటివి. అన్నమాట తప్పనివాఁడవు. సత్యవాక్యధురంధరుఁడవు.
పూర్ణయామాత్యాదు లామరణశాసనమందు సాక్షులై వ్రాళ్ళుజేసి
రని చెప్పితివి. కావున నాకు రాజ్యము దత్తమయ్యెననుటకు వారు నీవు
నుగూడ సాక్షులే. ఈనిమిషమునుండి యీకోటయంతయునాదే. మీ
రు నాయింట నోరెత్త వలసినపని లేదు. (కామేశ్వరరావు వైపుతిరిగి) అ
య్యా! నీవు న్యాయశాస్త్రదక్షుఁడవు. ఎవరెవరి కేమేమిరావలసియు
న్నదో మరణశాసనమునుజూపి పట్టుకొనిపొమ్మనుము. దానిని దేలేని
చో వెంటనే నాకోటనువిడిచి యావలకుఁ బొమ్మనుము." అని నిష్ఠుర
ముగాఁ బలికెను. ఈవాక్యములువిని నరసింహరాజు మ్రాన్పడెను.
ఆవలఁ దెలిసి "ఎట్టిచుట్టమైన న్యాయపథమును విడిచియున్నప్పుడు
శత్రులమైయుండియు నూరకొనరాదు. వానిని శిక్షింపకుండిన లోకములో
నవినీతి పెరిఁగిపోవును. న్యాయముగాఁ గాఁదలఁచినది కాకమానదు. ఆ
సంకల్పసిద్ధునివాక్కులు నెఱవేరకతప్పదు. (అని తనపీఠముచెంతనున్న
చందుగుపెట్టెను దెఱచి) ఇదే మరణశాసనము. దీనినిబట్టి నాకొమరతయే
రాజ్యంపుహక్కు నొందవలెను." అని యొకబల్లపై దానిని బాఱవైచె
ను. వెంకటపతి వేవేగ దానిని దీయఁబోయెను. కాని చప్పునఁ గామే
శ్వరరావు దానినెత్తి గట్టిగాఁ బట్టుకొనెను.

# పందొమ్మిదవ ప్రకరణము.

## మరణశాసనమును జదువుట.

అకస్మాత్తుగా నొకక్రొత్త మరణశాసనమును బైకిఁదీయుట, అరవిందయే యీసంస్థానమునకు దేవేరియని తెల్పుట, వెంకటపతి యాపత్రమును సంగ్రహింపయత్నించుట కామేశ్వరరావు వానిహస్తములలోఁబడకుండ దానిని జాగ్రత్తపెట్టుట, చూచి కృష్ణమనారాయణరాజులు నివ్వెఱపాటునుఁజెందిరి. పెండతండ్రి పోయినతోడనే యిట్టి యల్లకల్లోలములు బయలుదేఱునేయని మనకథానాయిక వందురుచుండెను. కామేశ్వరరావుచేతనున్న నూతనపత్రమునుజూచి వెంకటపతి కొంతవడి పిడుగుమొత్తినవానికైవడి రాపడియుండెను. మొగమందేమియు జీవకళలేదు. అగ్నిపర్వతమునుండి పైకుబుకు నగ్నిమయపదార్థమునలెఁ గోపాతిశయముచే మైమఱచియున్న యాతనినుండి తీక్ష్ణకోపము పైకిఁ బొంగుచుండెను. అది వాని ప్రతిపరమును గాల్చివైచుచుండెను. వానివైఖరిఁజూచి యించుక సందేహించుచున్న నరసింహారాజకామేశ్వరగారాయలమనస్సు లతఁడే దోషియని స్థిరపఱిచినవి. ఆనిర్భాగ్యుఁడు రెండవశాసనమును దగులఁబెట్టి వ్యర్థముగా నష్టముఁదెచ్చికొన్నాఁడు. దురాశ దుఃఖమునకుఁ గారణముకదా!

నరసింహారాజు వెంకటపతియొక్క దుర్నీతికి వగచుచుఁ గురిచీమీఁదఁ గూలఁబడెను. 'భగవత్సాన్నిధ్యమును బొందియున్నసోదరా! అవివేకుఁడనై నీయంతరంగంబెఱుఁగఁజాలక, వెంకటపతి బాహ్యాడంబరవర్తనమునునమ్మి, నీచే నిష్టములేనిపనిఁ జేయించినందునకు నన్ను క్షమింపుము. మృగరాజు మృతినొందఁగా వంచకమృగములునయిత మాధిపత్యమును సంపాదించుటకుఁ బ్రయత్నములుచేయుచుఁ దక్కుంగలవా

నితోఁ గలహమునకు డీకొనునట్లు నీవు స్వర్గమును జూచుకొనిన వెంటనే యీవంచకులు నీరాజ్యమును జూచుకొనయత్నించుచున్నారు. కావున నే నించుక నన్నమాటదప్పితి. క్షమింపుము !' అని యన్నయాత్మను సంబోధించుచు నతఁడు పలికెను.

కామే—నరసింహరాజుగారూ ! మీరు నిందించుకొనఁబనిలేదు. మీరు చేయువలసినట్లు చేసితిరి. అంతకంటె వేఱొంకుమార్గము లేదే !

వెంక—అయ్యా ! ఇందు నన్ను మీరెల్లరుఁగూడి మోసముచేయుచున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. నేను మీఁదియధికారులయొద్దికిఁబోయి మీపై నభియోగముందెచ్చి నాహక్కును స్థిరపఱచుకొనఁగలను.

కామే—(కోపముతో) అయ్యా! ఇచ్చట నధికప్రసంగము చేయువలదు. ఈశాసనమును నెఱవేఱుచుటలో నేను, నరసింహరాజుగారును మధ్యవర్తులముగా నామహానుభావునిచే నేర్పఱుపఁబడినవారము గాన, నీవు గట్టిగామాటలాడిన నిన్ను వెంటనే కోటనుండి వెడలనడచెదము. మాకు సర్వాధికారమీయఁబడెను.

వెంక—నీవు నన్నేమియునను జేయఁజాలవు. మాపెద్దమామ యభీప్సితము సిద్ధింపక తప్పదు. దానినే నెఱుఁగుదును. నీవును మాచిన్నమామయుఁ జాటుగనుండి సంభాషించుకొనిన మాటల నేను వింటిని. రెండవశాసనమందలి సారాంశమును నీవొకకరపత్రిమందు వ్రాసికొంటివిగదా ?

కామే—అవును. నీ వాద్వితీయశాసనమును దెచ్చెదవేని దానినిబట్టియే సర్వము నెఱపెదము. లేనిచో దీనినిబట్టియే పోయెదము.

నారాయణరాజుచిత్త మడఁగియుండకుండెను. అతఁడు లేవఁబోవుచుండఁ గృష్ణమరాజు జావుముడెను. కృష్ణమరాజు మధ్దనునిచెవి

లో « తమ్ముఁడా ! వేగిరపడకుము. మఱింత విషమముగును. న్యాయ వాదిని ప్రథమ శాసనమును ద్వితీయశాసనములోని సారాంశములును జదువుమందము. వానిని విని కర్తవ్య మాలోచింతము. ” అని చెప్పఁగా నతఁడు ‘ సరే ’ యని తలయూఁచి స్వస్థానమునఁ గూర్చుండెను. వెంక టపతినిగూడఁ గృష్ణమరా జటులే కూర్చుండఁజేసెను. కాని యిప్పుడు వెంకట పతి మనోవైకల్యమును వర్ణించుచువ్రాయ నాలేఖనికి సమర్థతచాలదు. అతఁడు భూలోకనరక మనుభవించుచున్నాఁడు. ఆనరక బాధయేదనఁ ద నహృదయమునకుఁ దాను చేసిన పాపకార్యములు స్మరణకువచ్చి యవి వృశ్చికములవలెఁ గుట్టుచున్నవి. మెదడును రామబంధుపక్షులు పొడిచి కొని తినుచున్నట్లుండెను. కృష్ణమరాజు కామేశ్వరరావును రెండు పత్రి ములను జదువుమనికోరెను. మరల నంతయు నిశ్శబ్దముగా నుండెను. కా మేశ్వరరావు పీఁటనుండిలేచి నిలిచి కాగితములను విప్పి ‘ మహాత్ములా రా ! ఈకాగితములను గౌరవనీయులగు భూపతిరాజుగారి యనుజ్ఞమీఁ ద నాఱునెలలక్రింద నేనే వ్రాసితిని. ఇందు మరియాదతోఁ గాలముఁగ డపుఘను లిరువురు పాత్రులై యున్నారు. ఇందలి యంశములప్పటినుండి నేఁటివఱకు రహస్యముగానే యుంపఁబడినవి. ఇచ్చటఁ గూడియున్న మ హనీయులలోఁ గొందఱిగుణాదులనుగుఱించి యిందుఁ గొంత వ్రాయఁ బడియున్నది. ఆవ్రాఁత వారికిఁ గష్టముగాఁ దోఁచిన నేనుత్తరవాదిని గాను. ’ అని మొదటఁజెప్పి శాసనమును జదువ నారంభించెను. అందుఁ బ్రప్రథమముననే నారాయణకృష్ణమరాజుల కేమియు నీయఁబడనటుల వ్రాయఁబడెఁగదా ! అది వినినపిమ్మట వారిముఖవిలాసము లెటులు న్నవని వచింతును ? కృష్ణమరాజు మొగమున నెత్తురు లేదు. ఇంచుక త డవైనతర్వాత నది క్రోధజనితారుణ్యమును జూపెను. నారాయణరాజు గడియగడియకు లేచుచుండి మరలఁ గూలఁబడుచుండెను. తమ యవగు ణము లట్లువెల్లడింపఁబడినప్పుడు వారెట్లు సహింపఁగలరు? సుకుత్రియ

లు. అభిమానవంతులు. కాని యేమిచేయఁగలరు ? తమ కోపములను జంపుకొని యూరకొన్నారు. తండ్రులవైఖరులనుజూచి వారి సుతలును బరితాపమొందిరి. నారాయణరాజు కూఁతులు కోపదృష్టులతోఁ జూచిరి. అతఁడు తన స్వయంకృతాపరాధముచేతనే గొప్పనష్టమును దెచ్చికొన్నాఁడని నిందించుచున్నట్టు లాచూపులుండె. కృష్ణమరాజు తనయలు వినమ్రవదనలై జనకుని నడతకుఁ గుందుచుఁ గూరుచుండిరి. అరవింద యెప్పుడిట్టిగడబిడల నెఱిఁగినదికాదు. ఆమె యిదంతయుఁ జూడలేకపోయినది. పెడమొగముఁబెట్టుకొని కూర్చున్నది—కామేశ్వరరా వవలరాగగమ్మ సుబ్బమ్మగారులనుగుఱించి చదివి వారలకొక్కొకరి కేఁబదివేలరూపాయలీయఁబడెనని చెప్పెను. తమ జనకుని ప్రవర్తనము మంచిదిగాదనుటకుఁ దమ యభిరుచులు సరసములైనవి గావనుటకుఁ, దమయందు లోపములు పెక్కులున్నవనుటకు వారోర్వలేకపోయిరి. కాని యొక్కొకరి కేఁబదివేల ధనమిచ్చుటచేఁ గిమ్మనక యూరకుండిరి. నూఱులిట్టులైన నొక్కబొబ్బట్టుముక్కతోఁ దుల్యములుగావని వారు తలంచిరి. ఈద్రవ్యవిషయమునఁ దనప్రీతి యుండరాదనియు నందు వ్రాయఁబడియుండుటచే నారాయణరాజు మఱియుఁ గినిసెను. కినిసి చేయునదేమున్నది? నోరుమూసికొనవలసినదే.

తరువాత లక్ష్మీనరసమ్మరత్నమ్మలఁగూర్చి చదువఁబడెను. తండ్రిచేఁ గ్రమశిక్షయందుంపఁబడకపోవుట తప్ప వారియందేలోటు లున్నటుల వచింపఁబడలేదు. తనపై దోషారోపణమునకుఁ గృష్ణమరాజేమియు ననుకొనలేదు. తన తనూజలకుఁ దప్పక యధికముగా లభించునని యతఁడు నమ్మెను. ఒక్కొక్కరి కొకలక్ష యీయఁబడెనని తెలిసినప్పుడు కేవలమ్ము[illegible] దీసిపోలేదని సంతసించెను. కాని తనకాసొమ్మునందు హక్కు లేదని ఖక్కాణింపఁబడుటచే నించుక మొగము ముడుచుకొనెను.

పిమ్మట వెంకటపతిరాజునుగుఱించి చదువఁబడెను. తన పేరిమీఁద లపెట్టినతోడనే యులికిపడి ముందునకు వంగి వీనులొగ్గి ‘ వకీలు ’ ముఖమునుండి యేమివచ్చునోయని కడుశ్రద్ధతో నతఁడు వేచియుండెను. తన దుర్గుణములన్నియు సోదాహరణంబుగఁ దెలుపఁబడుచుండెను. వానికీర్ష్య, క్రోధము, నిర్వేదము, విచారము మఱియు నేవేవో జనించినవి. కాని యావంతైనఁ బశ్చాత్తాపముదయింపలేదు. అరవిందయుఁ దానా దుర్మార్గునిపైఁ గొంతకాల మనురాగ మొందియుండినటులఁ బదిమందికిని దెలియుటచేఁ గ్లేశపడెను అవివేకముచేఁ దటస్థించిన వెనుకటి సంగతులు మరలజ్ఞప్తికిఁ దెచ్చుకొనుట కామె కిష్టములేదు. కాని యవి రాకమానవు. తన కేఁబదివేలరూప్యములుమాత్రమే యొసంగఁబడెనని విన్నతరువాత నతఁడు కొయ్యబొమ్మవలెఁ జైతన్యములేనివాఁడై కొంత వడియుండి “ దుర్మార్గులారా ! కుట్రలుచేసి నా నోటిలో మన్నుగొట్టితిరా ” యని యఱచెను.

కడపట నరవిందా నరసింహరాజులనుగూర్చి లిఖింపఁబడిన వాక్యములు చదువఁబడెను. నరసింహరాజునుగుఱించి స్వల్పముగానే వ్రాయఁబడినను, అతని సత్ప్రవర్తనమందలి ముఖ్యాంశములు తేటతెల్లముగాఁ దెలుపఁబడెను. వాని నతఁడు విని కన్నులనుండి పొటపొట నీరురాల్చెను. అరవిందనుగూర్చి సవిస్తరముగ లిఖియింపఁబడెను. భూపతిరాజు చంద్రమపాలెము వచ్చినదిమొద లామె యెట్లుప్రవర్తించెనో, యామెకున్న స్వల్పలోపముల నెట్లుసవరించుకొనెనో యందు విస్పష్టముగాఁ జెప్పఁబడెను. ఆమె సుగుణమణులు హారముగాగ్రుచ్చి యందుఁ బెట్టఁబడినట్లుండె. తనయెడలఁ బితృవ్యున కంతఘనాభిప్రాయముండుట విని యామె యతనిని దలఁచుకొని బాష్పములువిడిచెను. తనవిషయమైన యీలేఖనమునుగూర్చి యామె యింతవిపులముగా వినియుండలేదు. ఆవలఁ గాండ్రేగులసంస్థానము, పండ్రెండులక్షల రొక్కముతో నామె

కీయఁబడెనని కామేశ్వరరా వుచ్చైస్స్వనముతోఁ జదివెను. వెంకటపతి పెదవిఁ గఱచికొని శిరముఁ బంకించుచు నూరకుండెను. వృద్ధు లిరువురు తెల్లఁబోయిరి. నారాయణరాజతనూజులు తమయీసును దమవదన దర్పణములందు వ్యక్తపఱిచిరి. లక్ష్మీనరసమ్మ రాగమ్మలు తమ మేనమామ కొమరితయుఁ, గాండ్రేగులరాజ్యంపుదేవియునగు నరవిందాదేవిని బరిష్వంగముం జేసికొని తమ నిష్కళంకానందముం దెలిపిరి. అరవిందగాని, నరసింహరాజుగాని, కారుణ్యముచే నీయాస్తిలో నేమియు బందుగులకు మరల నీయరాదను నంశము తెలుపఁబడెను. నారాయణకృష్ణమరాజులకీఁక నేమియు నాశ లేదు. మంచిమాటలచే బతిమాలి కొంతలంకించుకొనిపోవచ్చునని యూహించుచుండిరి. కాని యీకట్టకడపటిమాటలతో నిస్పృహులై తమస్థానములనువిడిచి చివచివ నావలకుఁ జనుచుండిరి. కాని కామేశ్వరరావు 'అయ్యా ! తాళుఁడు. రెండవశాసనమందలి సారాంశంబులును దెల్పెద' ననెను. దానిఁగూడ వినియేపోదమని వారు నిలిచిరి. అంత ''అయ్యా ! శ్రీనరసింహరాజుగారును, మహౌదార్యసంపన్నురాలగు నరవిందామహాదేవియుఁ దమకేమియు నక్కఱలేదనియు నంతయు వెంకటపతికే వ్రాసియీవలసినదనియుఁ బ్రభువువారి ప్రాణావసానసమయందు మొఱవెట్టఁగా నాయన యస్థిరబుద్ధితోఁ దమ్ముని ప్రార్థనకు సమ్మతించి యనిష్టమైనపని కొడఁబడెను. అప్పుడు రెండవశాసనము వ్రాయఁబడెను. అందలి విషయములివి.

| | |
|---|---|
| రాగమ్మ సుబ్బమ్మగారులకు | రు 100,000 |
| లక్ష్మీనరసమ్మ రత్నమ్మగారులకు | 200,000 |
| నరసింహరాజుగారికి | 1,000,000 |
| అరవిందాదేవిగారికి | 1,200,000 |
| వెంకటపతిరాజుగారికి | కాండ్రేగులసంస్థానము. |

ఒకగడియ క్రిందవఱకు వారిశాసనమునందలి ప్రత్యక్షరమును నెఱవేర్పనెంచియేయుండిరి. కాని దుర్బుద్ధితో, దురాశతో, దుష్టత్వము తో వెంకటపతిరాజు దానిని నాశనముంజేసియున్నాఁడు. కావున మొదటిశాసన ముపయోగములోనికిఁ దేవలసివచ్చెను. ఎవరికిరావలసిన సొమ్ము వారికీయాశౌచదినములు గడచినపిమ్మట నిచ్చివైతుము. నేటి నుండియే యరవిందామహాదేవిగారిపేరు కాండ్రిగులసంస్థానపులెక్కల లోఁ గనఁబడును. " అని కామేశ్వరరావుచెప్పి ముగించెను. సభ ముగిసెను. తమకోమార్తెలవిషయమై రెంటియందు నొక్కరీతినే వ్రాయఁబడుటచేఁ దోడియల్లుండ్రకేమియు విషాదముగాని సంతోషము గాని కలుగలేదు. వెంకటపతిమాత్రము చేతఁబడినలిబ్బి తప్పిపోయెనని మిగుల వగచెను. నలుగురియెదుట నుండఁజాలక యెక్కడికోపోయెను. నిన్నరాత్రియేకదా 'నాకన్నులకుఁ గాన్పించునదంతయు నాదే' యని యతఁడు మురిసెను. ఇంతలో నాగర్వమంతయుఁ గ్రుంకెనుగదా! గర్విష్ఠులకుఁ బతనముతప్ప మఱేమున్నది?

చదువరులారా! వెంకటపతి తనకబ్బనిలిబ్బి చేతఁబడునని తెలిసినతోనే మొదలుమఱచెను. వాని స్వగతవాక్యములను మీరు వినియే యుంటిరికదా! నరసింహరాజునొద్ద మఱియొకశాసనము, పూర్వము వ్రాయఁబడినది యున్నదని వాఁడెఱుఁగఁడు. అతఁడు సత్యకాలపువాఁడగుటచే నిఁక మాఱుమాటాడక తనకురాజ్యము చేతిలోఁ బెట్టిపోవునని నమ్మెను. కాని యిరువదియైదులక్షలధనము వ్యర్థముగాఁ బరహస్తము లఁబడుట కతఁడోర్వలేక యొకింతసేపాలోచించెను. వాని కొకకుతంత్ర మున్ఫురించెను. అదేమన, తాను పత్రమును దగ్ధముగావించినఁ దనవారలకీయవలసిన యిరువదైదులక్షల నెగఁగొట్టవచ్చుననియు, వారు ప్రమాణములేనిదే తనపైనభియోగమయినఁ దెచ్చుటకు వలనుపడదని యుఁ గావున నెట్టులయినఁ బత్త్రమును సంగ్రహించుట లెస్సయని యు నత

నికిఁ బోఁచెను. వెంటనే యాకాగితమును జోర్యపత్రికయుచే సంపాదించె
ను. దానిని దహింపఁజేసెను. కాని యధర్మమెన్నఁడైన జయమొందు
నా? భూపతిరాజు సంకల్పసిద్ధుఁడుకాఁడా? ఇట్టివాఁడు సంస్థానాధిపతి
యైనఁ బట్టపగలు చుక్కలురాలవా! కావున ధర్మమే జయముఁగాం
చెను. అరవిందయే దేవేరియయ్యెను. ప్రజలే యదృష్టవంతులైరి.



## ఇరువదవప్రకరణము.



## ప్రమదావనము.

ఆశౌచదినములు పండ్రెండును గడచినవి. నరసింహరాజు జన్న
యాజ్ఞానుసార మాడంబరవ్యయములుసేయక యథావిధిగ సర్వకర్మము
లునెఱపెను. అరవిందాదేవి రాజ్యమునుబొందెనని చెన్నపురియందలి
యాంగ్లేయదొరతనమువారికిఁ దెలియఁజేసిరి. ఆమెపేరు ముద్రపైఁ
జెక్కఁబడెను. మరణశాసనమునుబట్టి యామె కాండ్రిగులకోటలోనే
యిప్పటినుండి స్థిరముగానుండవలెను. చంద్రమపాలెమునకుఁ జుట్టపుఁ
జూపుగాఁ బోవలెఁగాని తఱచుగాఁ బోనధికారమీయఁబడలేదు. నర
సింహరాజు తనసొంతభూములనమ్మక వానిపై నొకయుద్యోగిని నియ
మించి తానిచ్చటనే కూఁతునొద్దనుండ నిశ్చయించుకొనెను. అరవింద దే
వేరియని ప్రకటింపఁబడినతోడనే యామె మేనత్తకూఁతులు మునుపటి
కంటె నాదరమును బ్రేమమును జూపిరి. కాని యామె యెప్పటికట్లయిక
తోనేయుండెను. లక్ష్మీనరసమ్మరత్నమ్మల నెక్కుడు గౌరవముతోఁ జూ
చుచుండెను. భూపతి మృతినొందిన పదునొల్గవదినమున సపరాహ్ణము
న నరవిందా నరసింహరాజు లిందిరాసుందిరమున నుండిరి.

నర—అమ్మా! రాజ్యభారము తుదకు నీమీఁదనే యుంపవలసి వచ్చెను.

అర—తండ్రీ! దానిని దప్పించుమార్గము లేదా? రాజ్యలక్ష్మి వెంకటపతిని వరించుననుకొంటిని. కాని యదివరించినను వెనుకకు మరలినదే.

నర—అవును. మరలదా? వానిదుర్గుణములను జూచి యామె సహింపలేకపోయినది. నీ చెలికారము చేయుటకే యాపె కృతనిశ్చయురాలయ్యెను. నీవు దానిని దప్పించుమార్గము లేదాయనుచుంటివేమి?

అర—వెంకటపతి యాపత్రమును నాశముచేసినమాట నిక్కమే. కావున శాస్త్రప్రకారము వానికి రాజ్యములో నేమియు రాదనుటయు నిశ్చయమే. మఱియు వాఁడుచేసినయపరాధమునకు మనమిట్లుచేసితిమని న్యాయబుద్ధిగలవారెవ్వరును మనల నిందింపరనుటయు వాస్తవమే. కాని మనమేకదా యెన్నియోవిధముల తేనికి నచ్చఁజెప్పి వానికి రాజ్యమిచ్చునట్లు వ్రాయించితిమి! అది కొనసాగఁజూచుట మనధర్మముకాదా?

‘అంత ఘోరకృత్యమొనర్చినవానియెడ నింకను దయచూపుమనుచున్నదే. ఏమికారణమో’ యని నరసింహరాజు కొంతసేపు తలపోసి ‘అమ్మా! నీకింకను వానిపై ననురాగముగలదా? దాఁపకవచింపుము.’ అని యడిగెను. మనకథానాయిక కళంకరహితమైన దృష్టులతోఁ దండ్రివంకఁజూచుచు “తండ్రీ! లేదు. లేదు. అదీ యొకస్వప్నమువలె వచ్చినది. అప్పుడేగతించినది. అది మరలరాదు.” అని వచించెను.

నర—తల్లీ! ఇప్పుడునాకు సంతోషముగానున్నది. నీపత్నివైఖరిఁజూచి నీకింకను వానియందనురాగమున్నదేమోయని భయపడితిని. చెప్పెదనువినుము. మనము మాయున్న నేలు వెంకటపతికిరాజ్య

మీఁ బ్రార్థించితిమి? అతఁడు బాగుపడినాఁడనియు నాస్తి వృద్ధిఁ జేసికొనుననియు నమ్మరాదే కదా? కాని వానినడతనుబట్టి వాని పశ్చాత్తాపమెట్టిదో బోధపడినదా? ఇంత మోసగాఁడు లోకములో నున్నాఁడా? మనస్సాక్షియనున దున్నవాఁడెవ్వఁడైన నట్టి తటినోర్చి యూరకొనఁగలఁడా? అరవిందా! నీ పెద్దతండ్రి రెండవశాసనము చివర వ్రాయించినమాటలు స్మరణకుఁ దెచ్చికొనుము. వాఁడనర్హుఁడైన భగవంతుఁడే వానికిఁ దగినశిక్ష విధించునుగాక యని వ్రాయించినాఁడుగదా! ఆమహానుభావుఁ డనుమానపడినరీతిగానే జరగినది. అతని కడపటి వాక్యములు సిద్ధింపకతప్పదు.

అర—అవును నాన్నగారూ! అవును. ఆపవిత్రవాక్కులు స్మృతికివచ్చినవి. మది కలఁతనొంది గాలివానలోవలెనుండ నానుడులు మఱచియేపోయితిని.

నర—అమ్మా! ఇప్పుడునీకుఁ దృప్తియైనదా? మనము మఱియొకవిధమున నాచరించుటకు మార్గమే లేదు.

అర—నిజము. మనము రాజ్యభారము వహింపకతప్పదు. సరియే వహింతము.

నర—నేనిప్పుడేపోయి వెంకటపతితో 'నాయనా! నీవింక నిచ్చట నుండఁబనిలేదు. నీదారిని నీవు చూచుకొనుము. నీకు కావలసినది పట్టుకొనిపొమ్ము.' అని మోమోటమునువిడిచి చెప్పెదను. వాఁడిక్కడనుండిన నీభవనమంతయు నపవిత్రమగును. ఇఁకఁ జుట్టఱికము మాట యటుంచి బాహ్యదృష్టినిఁ బరికించి వానిని సాధ్యమైనంతత్వరలో సాగనంపివచ్చెదను.

అని నరసింహరాజు వెడలిపోయెను. అరవింద యొంటరిగానుండెను. దేవేరియైనపిమ్మట నిప్పుడే తలపోఁతల కామెకుఁ గాలు చిక్కినది.

ఆమె యాలోచనాప్రవాహ మెట్లుప్రవహించుచున్నది? ఇప్పుడేకదా యామె 'మనము రాజ్యభారమును వహింపకతప్ప' దని పల్కినది. ఆవాక్యమందామెతండ్రికి స్ఫురించినయర్థముకంటె నెక్కువ యర్థమున్నది. ఎఱుకతపలుకులలో ముఖ్యాంశము నెఱవేఱినది. ఆమె రాణియైనది. దాస దాసీజనము లడిగట్టులై యున్నారు. దివ్యభవనమునందు నివాసముచేయుచున్నది. కాని యెన్నిభోగములున్నను గర్వమొందలేదు. ఆమెసాంప్రదాయ మట్టిది. సహజసద్గుణశీల. ఇఁక నెఱుకసానిచెప్పిన రెండవవిషయము సిద్ధించుట సాధ్యమగునాయని యామె చింతించుచుండెను. అది యసంభవముగాఁదోఁచెను. అప్పుడుతాను సోభనాద్రిరాజుగా నెఱిఁగిన ముసలివానిచే ముందుగాఁజెప్పఁబడినట్లై కిరాతియట్లు పలికెనేమోయని సందియమొందఁజొచ్చెను. ఐన నెఱుకులో ద్వితీయభాగము కొనసాగుటెట్లని తలపోయుచుండెను. అనఁగాఁ జిన్ననాఁటినుండియుఁ దనతోఁ బెరిఁగి, తనయనురాగము నిరాకరింపఁబడినదని యెఱిఁగి, దేశములవెంబడిఁ దిరుగుచున్న ప్రభాకరుఁడు తనకేలువట్టు టెట్లని విచారించుచుండెను. కాని యామె మునుపటివలెఁ జపలచిత్త కాదు. వెఱ్ఱివెఱ్ఱి యాలోచనలయందు మునిఁగియుండుటకుఁ గాలముచాలదు. ఆమె తలపై గొప్పబరువు క్రొత్తగాఁ బెట్టఁబడెను. దానిని జాగ్రత్తగా మోవవలసినధర్మ మున్నది. కావున వెంటనే మనమును రాచకర్జములవంకఁ ద్రిప్పుకొని లేచి వెడలిపోయెను.

ఆసమయమున నొకయువకుఁ డొకయశ్వశకటము నెక్కి యానందమందిరముకడనుండి బయలుదేఱిపోవుచున్న ట్లామెకు గోచరమయ్యెను. శకటనేమిధ్వానముకూడ వినఁబడెను. తానున్నగదికిటికీనుండి వాఁడెవ్వఁడో చూడవలెననుబుద్ధి పొడమెనుగాని యామె కేదోయంతర్వాణి యాయువకుఁడు వెంకటపతియని తెల్పుటచే మది నిలకడగానుంచుకొని యావైపునకు దృష్టిని బోనీయకుండెను. ఒకనిమిషమువఱకామె 'వాఁ

దు సూర్యుణ్ణి ఖండించి యుండిన నెంతబాగుగనుండునో?' అని యనుకొనుచు యోజించుచుండెను. కాని తరువాత నామె యాయుద్దేశమును బా లాలోచించినది. దుర్గంధపరిపూర్ణమైనవస్తువును బాఱవైచినట్టు లాతలంపును బాఱవైచినది. తత్క్షణమే యుచ్చోటువాసినది. మఱిదండ్రి యుండు స్థలమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున నామెజనకుఁడు కన్పించి "అమ్మా! వెంకటపతి తనంతటనే ప్రయాణమై యిప్పుడే వెడలిపోయెను. శాసనమునుబట్టి తనకురావలసిన మొత్తమును విశాఖపురికిఁ బంపుమని చెప్పెను. దొరతనమువారితో మనవిఁ జేసికొని యభియోగము తెచ్చుటకేమో యీపయనమని యనుమానించితిని. కాని వానికా యుద్దేశమే లేదని నాకు విశ్వాసార్హుఁడొకఁడు చెప్పియున్నాఁడు. ఇఁక నీవు నిర్భయముగాఁ బుడమిని బాలింపవచ్చును." అని చెప్పిపోయెను. అరవింద మరదండ్రితోఁ గొంతసే పిష్టగోష్ఠిని మాటలాడి, వారికిఁ గావలయువానినెల్లఁ దెప్పించియిచ్చి తానొక్కరుకయే ప్రమదావనములో నికిఁబోయెను. దారిలో నెందఱో సేవకులు, సేవకురాండ్రు మెకువంగివంగి దండములఁ బెట్టిరి. చేతులుజోడించుకొని పనులుసేయ సిద్ధముగానుండిరి. ఆమె వారివంక గర్వరాహిత్యములును, బ్రసాదసూచకంబులును సగు దృష్టులఁ బఱపి వారికి మోదముంగూర్చెను. ఆమె తిన్నగాఁ బువ్వువనములోనికిఁబోయి తనకొఱకు మఱఁదండ్రికొఱకు స్వయముగానే పూలను గోయుచుండెను. వెంకటపతిహృదయమందలి యనురాగము మితిమీఱి యటులున్న దేమోయనునట్లు సంధ్యారాగ మెల్లెడల వ్యాపించియుండెను. ప్రతివస్తువు రాగయుక్తమైయుండెను. అరవింద పూర్వమొకపర్యాయము చంద్రమపాలెములోఁ దనపెరటితోఁటయందుఁ గుందములనుగోయుచు నప్పటివలె మందహాసముఁజేయుచు గీతమును బాడుచు విలాసముగాఁబూల నిప్పుడు కోయుటలేదు. ఏదియో యాలోచించుచు మెల్ల మెల్లగ నడుగులిడుచు నొక్కొకపువ్వునే పెఱుకుచుండెను. గతించి

నవిషయములన్నియుఁ గలగా నామెకుఁ దోఁచుచుండెను. ఒకసంపెగ పొద నొక్కటియే పుష్పముండ, దానినిగోయుటకు దానిదరికిఁబోయి నిలిచెను. అప్పు డొకగలగలారావము విననయ్యెను. ఏదో దుష్టసర్పమే మోయని యామె యులికిపడెను. కాని యది సర్పము కాదు. సర్పతుల్య మగు మానవుఁడు. వాఁడు వెంకటపతిరాజు. అతఁ డానికుంజముచాటున దాఁగియున్నాఁడు, వాఁ డరవిందయెదుటనిలిచి "అరవిందా! ఒక్కమా ట. ఒక్కటియే. అంతకంటె నెక్కువవలదు. నన్ను మాటలాడనిమ్ము. నిన్ను వేఁడుచున్నాను. నేను దీనుఁడను. దురాశాపరుఁడను. నాస్వయం కృతాపరాధమే నన్నీదశకుఁ దెచ్చినది. దయతో నాకనుజ్ఞయిమ్ము." అని యడిగెను. ఆమె మొదటఁ బ్రత్యుత్తరమీయఁదలఁచుకొనలేదు. కాని యంతలో నష్టములేదనియెంచి 'సరియే. ఒక్కమాటకుమాత్రమే సెలవిచ్చితిని. అదియైనఁ గరుణచేతనే' యని బదులుచెప్పెను.

వెంక—నీవొక్కతెవె యిచ్చటికివత్తువని తలఁచియే యీపొదచాటున వేచియుంటిని. నాలోదైవమున్నాఁడు. నేననుకొన్నటులే వచ్చితివి. నన్ను నిందింపక, నాపైఁగినియక, నాప్రార్థనమాలించి, నేను బ్రాణములు నిలుపఁదగుమాట యొక్కటి—

అర—ఓయి! నీవు నాతోమాటలాడనూహించినయంశ మెయ్యదియైన నేను విన దలఁచుకొనలేదు.

వెంక—(నమ్రతతోనే) స్వవిషయమై నేను జెప్పకొనుటకు నాకు హక్కుగలదు. నీవాకర్ణింపనని నిరాకరించుట కేవలమన్యాయము. నీవంటి కరుణాహృదయచేయరానిది. వినుము. నీకు నాయందె ప్పుడైన ననురాగమున్న యెడల—

అర—(క్రోధచోదితయై) తద్విషయమై యొక్కమాటయైనఁ బలుకవల దు. నాయెదుటనుండిపొమ్ము. అని గిరుక్కున వెనుకకు మరలినది.

వెంక—అరవిందా ! అరవిందా ! ఇదే బద్ధాంజలినై వేఁడుచున్నాను. నామాటలాలకింపుము.

అర—(ముకుళితవదనసరోజయై) విననుఁ. పొమ్ము. ధూర్తుఁడా !

వెంక—నీవొకప్పుడు నీహృదయమునందు నాపై నొందిన యనురాగ మింక నెప్పుడు బ్రతుకఁజాలనిరీతిఁగా మృతినొందినదా ? ఒక్క పలుకుతోఁ బ్రత్యుత్తరమిమ్ము. అంతియేచాలును.

అర—ఔఁ చచ్చినది. ఎప్పటికిబ్రతుకదు. అని యానిముసమందే తడవుకొనకుండ, నిశ్చయబుద్ధితో మార్వలికెను.

వెంక—(కఠినస్వరముతో) అట్లైన నిదివఱకెంతస్నేహితురాలవో, యిప్పుడంత విరోధురాలవై తివని యెఱుంగుము. నీవు నేను జె ప్పఁబోవునదంతయు విని మఱి కదలవలెను.

అర—చాలు నధికప్రసంగము చేయకుము.

వెంక—నీవంతయువిని యీస్థలమువిడువుము. అంతవఱకు నిన్నుఁ గద లనీయను. (అని వడివడి ముందునకడుగిడి యామెకరమును బట్టు కొనెను. ఆమె విదళించుకొనఁబోయెను) నీకంటె బలీయుఁడనని నీకుఁదెలియునా? గింజుకొనుటవలన ఫలములేదు. (అరవిందయొ క్క కేకవైచెను) నీకేకలువినువారెవ్వరియ్యెడలేరు. నీకంఠధ్వని యెవ్వరికిని వినఁబడనేరదు.

అర—(కోపముచేఁ గన్నులనుండి విస్ఫులింగములు రాల) ఓరీ ! చండాలుఁ డా! నన్ను విడుతువా ; లేదా?

వెంక—విడువను. విడువను. నిన్నుఁ గదలనీయను. ఇంకను గింజుకొనె దవేని దెబ్బలుతినఁగలవు.

అరవింద భయోద్రేకముచే నొక్కయఱుపఱచెను. తనయావ చ్ఛక్తియు వినియోగించి చేతిపట్టును విడిపించుకొనయత్నించుచు జాఱి నేలఁబడెను. పడినతోడనే మూర్ఛనొందెను. ఆనిమేషమునందే యొక

పురుషపుంగవుఁ డచ్చటగాన్పించి యమోదాదండసంకాశమగు తనహస్తముతో నొకగుద్దుగుద్ది వెంకటపతిని నేలఁగూల్చెను. అరవింద స్మృతిఁదప్పియే యుండెను. క్రొత్తమనుజుఁ డామెను మెల్లగా నంతఃపురమువైపునకుఁ దీసికొనిపోయెను.

మెలఁకువవచ్చినప్పటి కామె తనగదియందు మెత్తనిపాన్పుపైఁ బండుకొనియుండెను. తండ్రి, మఱఁదండ్రు, మేనత్తలమగలు, గామేశ్వరరావు మున్నగువా రామెను బరివేష్టించియుండిరి. లక్ష్మీనరసమ్మ రత్నమ్మ లామెకు శైత్యోపచారములఁజేసియు, లేపనములఁజేసియు, సేవచేయుచుండిరి. నరసింహారావు జాత్రిముఖో నామె మోమువంకఁ జూచుచుఁ దెలివివచ్చెనని తెలిసినతోడనే "అమ్మా! అరవిందా! ఏమితల్లీ! ఎట్లున్నదమ్మా" యని యడిగెను. ప్రియుముంగూర్చు మఱఁదండ్రిసేయు శైత్యోపచారములచే నించుక సేదఁదీఱినదై యామె యిట్లుపలికెను. "నాకు సులువుగానున్నది. నే నొకటిరెండుగడియలకుఁ బూర్వమునఁ బూలఁగోసికొనుటకై యుద్యానమునకుఁ బోయితిని. ఒకనికుంజమున నొక్కచంపకపుష్పమే కాన్పించినది. దానిఁగోయఁ జూచుచుండ వెంకటపతి యెదురుపడి నన్నుఁ బరుషవాక్యములాడి నాఁడు. నన్నుఁ గఠినముగాఁ బట్టుకొన్నాఁడు. నేను సొమ్మసిల్లితిని. ఆపైన నేమిజరిగెనో నాకుఁదెలియదు. ఇచ్చటకు నే నెట్లువచ్చితిని? నన్నెవరు కొనితెచ్చిరి?"

నర—అమ్మా! వనజాక్షీ నీకొఱ కారామములోని కెవరుగవచ్చియుండఁగా నొకయపూర్వమనుజుఁడు నిన్ను మృదులముగ నెత్తుకొనివచ్చుచు నామెతో 'అమ్మా! ఈమె నిందింపఁబడి భయమందినది. నేను గాపాడితిని. నీవీమెను జాగ్రత్తగాఁ గొనిపోయి పండుకొనఁబెట్టి తగిన యుపచారములనుజేయు' మని చెప్పి వెళ్లెనఁట. ఆమె నిన్నానవాలుపట్టి రాజలేఖను సాయముగారమ్మని

కేక వైచి నిన్నుఁ బదిలముగా నిక్కడకుఁ దీసికొనివచ్చినది. నీకుఁ
దెలివివచ్చువఱకు నాప్రాణము లఱచేతియందున్నవిసుమా !

అర—ఆమహాపురుషుఁడెవ్వఁడు ?

నర—ఎవ్వఁడో పరిచారికలు నెఱుంగరఁట. మొగము గుర్తుపట్టుటకైన నవకాశముకలుగ లేదఁట. అప్పటికే చీఁకటి యించుక క్రమ్ముకొనుటచేతను, చెట్లనీడలచే మఱింత యెదుటివస్తువు కానఁబడమిచేతను, వారతఁడెవ్వఁడో తెలిసికొనలేకపోయిరఁట. మఱియు నతఁడు వెంటనే పాణిద్వారమువైపునఁ బోవుచున్నాఁడఁట.

అరవింద కత్యాశ్చర్యముతోఁచెను. తాను రాణియైన ప్రథమ దివసముననే యిట్టియాపత్తువచ్చి దైవానుగ్రహమువలనఁ దప్పెనే! ముందెట్టియిడుములు మూఁడనున్నవో యని యామె వెఱపొందుచుండెను. దేవునిఁ బ్రార్థించుచుఁ గన్నులుమూసెను.



## ఇరువదియొకటవ ప్రకరణము.

## దంపతులు.



మనకథానాయికప్రాణములఁ గాపాడిన మహాత్ముని తీవ్రఘాతముచే వెంకటపతి మూర్ఛనొందెను. మఱిరెండునిముసములకే యతనికిఁ దెలివివచ్చెను. తన యకృత్యమును, దానికిఁ దనకు సంభవించిన పరాభవమును దలఁచుకొనెను. తనకే లజ్జతోఁచెను. ఆమెను సమాధానపఱుచుటకుమాఱుగా నామెకోపాగ్నిని మఱివదంతలు ప్రజ్వలింపఁజేసెను మినుకుమినుకు మనుచున్న వానిహృదయమందలి యాశాదీప మాఱిపోయెను. చేయునదేమియును లేక యతఁడు పడినచోటునుండి లేచి మొద

లు దులుపుకొని తూలిపడుచు మెల్లగ నావలకుఁబోయెను. అంతసాహసించి తన్నుఁ గొట్టినవాఁడెవఁడని యతఁడచ్చెరువొందుచుఁ బాణిద్వారము వెంబడినిజని యొకసందులోఁ దానువిడిచిపెట్టిన గుఱ్ఱపుబండినెక్కి పదిగడియలరాత్రికిఁ గాకినాడను జేరఁగలైను. అచ్చటఁ బ్రసిద్ధివహించిన రాజమ్మపూఁటకూళ్ళ యింటికినిజొచ్చి భుజించి యక్కడనే పడకలకుఁ గూడఁ దగినసమపాడుములు చేయఁబడుచునుండుటచేఁ బండుకొనఁబోవ సిద్ధముగనుండెను. అప్పుడు రాజమ్మవచ్చి 'అయ్యా! వెంకటపతిరాజుగారుమీరేనా?' యని యడిగెను. 'నేనే' యని యతఁడు చెప్పఁగా నామె 'కట్టకడపటిగదియందొకవనితారత్నమున్నది. ఆమెకు మీతో నేదియో మాటలాడవలసిన పనియున్నదఁట. మిమ్ము నుబంపుమన్న' దని చెప్పెను. వానిగుండెలోఁ గభుక్కుమనెను. 'మాలతికాదుగద' యని యనుకొనుచు 'ఇదె వచ్చుచున్నాను. నన్నచటికిఁగొంపొమ్ము.' అని రాజమ్మ వెంటనరిగెను. ఒకగదిలో నొకమంచముమీఁద బొంతవైచుకొని యందొక స్త్రీ పండుకొనియున్నది. ఆమె నిద్రఁబోవుటలేదు. కుడిమోచేతిని బక్కమీఁదనూని యఱచేతియందుఁ దలనుంచుకొని యెత్తిగిలి విలాసముగాఁ బరుండియున్నది. ఆమె పాఠకులకుఁ బరిచితయే. ఆమెయిప్పుడు వెంకటపతిరాజువంటిసరసు నాకర్షించునంతయందముగాలేదు. బీదతనమెుక్కబట్టలలో మాత్రమామెకున్నట్లు కాన్పించుచున్నది. ఆమె మోమునందుఁ బరిహాసనూచకమైనచిఱునవ్వొలసెను. వెంకటపతిని జూచినతోడనే లేచికూర్చుండి 'దయచేయుఁడు. ఈమంచముమీఁదనే యాసీనులుకండ' ని చెప్పెను. అతఁడట్లుచేసెను. రాజమ్మ తనపనిఁ జూచుకొనుటకు వెడలిపోయెను.

స్త్రీ—తుదకు మీయత్నము లడుగంటినవా? మీయుపాకాశహర్మ్యములు కూలిపోయినవా? పాపము—

వెంక—(భార్యపై మోమునందు దేవఁగనఁబఱచుచు) మాలతీ! నాయ

త్నము లనుగంటినప్పుడు నీకు సంతసముగానున్నదా? అంగువల న నాకేకాకుండ నీకుఁగూడ నష్టమని యెఱుఁగవా ?

మాల—నాకా? నష్టమా? (నవ్వుచు) ఏమివెఱ్ఱి! మీసత్తువ నే నెఱుఁగనా? నేర్పుతోఁజేయవలసినపని యేదివచ్చినను మీరు వప్పులో నడుగువై చెదరని నేననుకొనియేయున్నాను.

వెంక—(అసహ్యనునుజూపుచు) సరియే. నీకుఁ దోఁచినట్లులనుము. ఇప్పుడు నాదినములు మంచివికావు. పడవలసినప్పుడు పడకతప్పదు. నిజము. నక్కజిత్తులచే నితరులను మోసముచేయవలసినప్పుడు నీకుఁగలనేర్పు నాకులేదు. ఈయనవసరప్రసంగమేల ? నన్నెందులకుఁ బిలిపించితివి ?

మాల—నాసంగతి యించుక మనవిఁజేసికొనవలెనని. నేను నాఁడులోకప్రసిద్ధమైనమృతినిఁ బొందినప్పటినుండియు నీయూరనేయుంటిని. మీచర్యలన్నియుఁ గనిపెట్టుచుంటిని. మీమామ చనిపోయిన మూఁడవనాఁడే శాంద్రీగులసాలెవాఁడొకఁడు బట్టలమ్ముకొనుట కీయూరువచ్చి మీవృత్తాంతమంతయుఁ జెప్పెను దుర్వార్తలు దురముగా వ్యాపించునను నానుడి నిక్కువము. వాఁడే యరవింద దేవేరియయ్యెననియు మీయుందఱకుఁ గొంతధనము పోరడఁచుట కీయఁబడుననియు నందులో మీకు మిగులఁ జిన్నమొత్త మిత్తురనియుఁ జెప్పెను. కట్టుకొనుటకు బొత్తుగ బట్టలులేక పోవుటచే వానియొద్ద నొకచీరనుగొని మరల నచ్చటివార్తలఁ దెలిసికొనివచ్చిన నింకొకచీరఁగొందునని యాశపెట్టితిని. నేఁడే మీరు బయలుదేఱుటకు బండిని గుమ్మముకడ నుంచుకొనిరనియు నిఁకనో యిప్పుడో వత్తురనియు నీపూఁటకూళ్ళయింటనే బసచేయుదురనియుఁ జెప్పిపోయినాఁడు ఈరాజమ్మతో నాకుఁ బరిచయముగలదు. కావున నామెనడిగి యొకగదినిఁబుచ్చుకొని

మీకొఱకే యిక్కడఁ గాచుకొనియుంటిని. మీప్రయత్నములన్ని
యు విఫలములయినవి కావున నిఁక నేను మరల బ్రతుకవచ్చునా?
వెంక—అవును. అవి విఫలములైనవి. మాలతీ! నీవు నన్నుఁ బరిహా
సము లాడుచునే నిందించుచున్నావు. నాకుఁ గోపము వచ్చె
నేని యొడలు తెలియక నీ కపాయమును గల్గింతును జుమీ!
మాల—(పెద్ద నవ్వునవ్వి) అపాయమే? బాబో! భయమగుచున్నది.
ఆ బెదరింపుల కేమిగాని, మన మెన్ని యోదినములు కలసి మెలసి
యున్నఁట నేకీభవించి మెలఁగితిమే; మనకిప్ప డీశత్రుత్వ మేల?
పూర్వపు భార్యాభర్తృకసంబంధము మనకుఁ గలుగదని నే న
ఱుంగుదును. కాని మనము సాధారణపుఁ బరిచయులవలె స్నే
హముతో నుండవచ్చునుగదా! మీ రెన్నియవమానములపా
లైనను గేవల నైరాశ్యహేతులు గానక్కఱలేదనియు, నేను
గొలఁదిగనైన సాయముచేయఁ గలననియు మీమనమునకుఁ
దట్టెనా?
వెంకటపతి యుమ్మి వైచుకొనుటకై లేచినవానివలె లేచి ఇ
టునటు పరిచారము చేసెను. ఏదియో యాలోచించుకొనియెను. మరల
మంచముమీఁదఁ గూర్చుండి 'సరియే. మనము స్నేహితులుగా నుం
డుట కేమియభ్యంతర మున్నది?' అని యనెను.
మాల—(నవ్వుమాని సహజమైనచూడ్కులతోఁ జూచుచు) మనము
కలసికొని కొన్నిపద్ధతు లేర్పఱుచుకొని యెనిమిది మాసములు
పైఁగా నైనది. మీకు జ్ఞప్తి యున్నదో లేదోకాని రెండుపద్ధ
తుల నియమించుకొంటిమి. మొదటిది చంద్రమహాలెమందు
మీమామ పెరటిలో ననుకొంటిమి. మీ రరవిందను వివాహ
మాడువిషయములోఁ జేయు ప్రయత్నములలో నే నడ్డంకిగా
నుండనని యప్పు డొప్పుకొంటిని. కాని మీజతనములు వ్యర్థ

యున్నారు. పిమ్మట మనము విశాఖపురిలోఁ గలిసికొంటిమి గ
దా. అప్పుడు మరలఁ గొన్ని పద్ధతుల నేర్పఱిచికొని విడిపోయి
తిమి. వానిసబట్టియే, నా యునికికి మిగుల వగచుచున్న మీ
మేనమామకు నేను జచ్చిపోయితినని తెలిసిన సంతసము గల్గున
నియు మీకు విస్తారధనసంచయము లొడఁగూడు ననియుఁ ద
లఁచి, నేను మరణించితినని మీరు వెల్లడించుటకు సమ్మతించి
తిని. మీ పెద్దమేనమామ మిమ్మును నమ్మి యధికద్రవ్య మీ
యకపోయినను, అరవిందవైన మిమ్ముఁ బరిణయమాడుట క
ష్టము చెప్పదని యెంచి యందుల కియ్యకొంటిని. ఆరీతిని మీ రే
మిచేయుమనిన దానిఁ జేసితిని. నేను గాపుర మున్నయింటి యొ
మొకును వాసుదేవయ్య యను వైద్యునకును మీరు లంచముగా
నిమ్మని యిచ్చిన వేయిరూపాయలలో నొక్క దమ్మిడివైన నే
ను పుచ్చుకొనలేదు గదా! కామేశ్వరరావుగారు శోధనకువచ్చి
నప్పుడు మరల వారికాళ్ళను గమపులును బట్టుకొని నా చావు
మాట నిజ మనిపించితినే!

వెంక—నిజమే. ఏల వానిని మరలమరలఁ ద్రవ్విపోసెదవు?

మాల—ఎందునకా? మీకు నాయందు నమ్మిక లేదు. నన్నుఁ జూచిన
నసహ్యము. ఇన్నివిధముల మీకొఱకు మానప్రాణము లర్పిం
చినను మీకు విశ్వాసము లేకపోయెనే యని విచారముకలిగి
పగపడి యంతయుఁ దలఁపునకుఁ దెచ్చుచున్నాను. అంతియే.

వెంక—సరియే. చెప్పుము. నీ సోదె యేకరువుపెట్టుము.

మాల—మీ కేమనినఁ జెప్పకమానను. మీకు రెండాశ లుండెడివి.
కాండ్రిగులరాజ్యము మీకే మీమామ యిచ్చునని యొకటి.
అటు లీయకపోయిన నరవిందను పెండ్లియాడి యామెమూలమునైన
సా రాజ్యాధికారము గలుగునని యొకటి. మొదటిది నియం

దు మీరు గెలుపొందితిరేని నన్ను బహిరంగముగా భార్యగా స్వీకరించి పట్టపుదేవికిఁ గల్గుహక్కుల నా కిచ్చుటకును, రెండవ దానియందు జయముఁగాంచిన నేను జచ్చినటులేయుండి మీ వలన సంవత్సరమునకు రెండువేలరూపాయలను భరణముగాఁ బొందుటకును మన మేర్పాటుఁ జేసికొంటిమి. నా మరణవార్త ప్రకటింపఁ బడకపూర్వము నా కైదువందల రూపాయలుమా త్రమే మీ రిచ్చియున్నారు. నేఁటివఱకు కాసామ్ములోనే, మా అుపేరు పెట్టుకొని, యీ గ్రామములో నిట్టి ప్రాఁతగుడ్డలను గట్టుకొని, దేవుఁడా నాకీగతిఁ దెచ్చిపెట్టితివా యని యేడ్చుచుఁ గాలక్షేపముఁ జేయుచున్నాను. ఎవరికైన నాసత్యస్థితిఁగూర్చి తెలియునేమో కనుఁగొనుఁడు. ఇన్నివితముల గుట్టునకుఁ బడి యెవ రుండఁగలరు ? అవన్ని యటుండనిండు. ప్రస్తుతవిషయములకుఁ బోదము. అరవిందకు సంస్థాన మిచ్చిరిగదా. మీ కేమి యీఁ దలఁచిరి ? మీరు బండిదిగి లోపలికివచ్చు నప్పుడే మీ ముఖారవిందమును గనుఁగొని, మీపని సున్నయైనదని తెలిసి కొంటిని.

వెంక—(కొంచెము పరధ్యానముగానుండి) ఆసాలీఁడు మత్తేవైనఁ దొందరలు జరగెనని చెప్పెనా ?

మాల—లేదు. అంతవఱకు వాని కెట్లు తెలియఁగలదు ?

వెంక—(తనలో) నరసింహరాజు గడుసువాఁడు. కుటుంబ మర్యాదను గాపాడుకొనుట కట్టివిషయములు పొక్కనిచ్చునా ? (ప్రకాశముగా) సరియే. నీతో నంతయుఁ జెప్పెదను. మంచిచెడ్డ లాలోచించి కర్తవ్యమును జెప్పుము. నే నవివేకుఁడను గానియెడల, నిప్పుడు కాంటో్రగులకోటలో నిందిరమందిరమున నమూల్య పరిధానములం దాల్చి నీతో సుఖముగా విహరించుచుందును

గదా! (యోజించుచుఁ దలయూఁచి) అవును. నీతోఁ జెప్పక తప్పదు. జరిగినదానిని స్మరణకుఁ దెచ్చికొనిన నాకే సిగ్గుగాను న్నది. నే నచ్చట మతిపోయి వర్తించితిని. నా మేనమామ రాజ్యమును నాకే మరణశాసనమందు వ్రాసి యిచ్చెను. కాని నిర్భాగ్యుఁడనై — దరిద్రదేవత నెత్తిమీఁదఁ దన్నుటచేత — పురాకృతకర్మవశమున — దానినిదగులఁబెట్టితి.

మాల—(అత్యాశ్చర్యముతో) ఏమీ? తగులఁ బెట్టుటయే?

వెంక—అవును. తగులఁ బెట్టితిని. మంటఁ బెట్టితిని. అసూయాపిశాచము న న్నావహించినది. మరణశాసనమునుబట్టి కొంతరొక్కము నరసింహరాజాదుల కీయవలెను. ఆసొమ్మీయకుండ నెగఁ గొట్టుదుర్బుద్ధిపుట్టి, చేతులలోఁ బడిన రాజ్యమును బోఁగొట్టుకొంటిని. మఱియొక మరణశాసనము పైకిఁ దేఁబడెను. దానిని బట్టి నాకేఁబదివేలరూపాయలుమాత్రమే చేతిలోఁ బడును. నే నంతియే పెట్టిపుట్టితిని.

మాల—(చులుకఁజూపుల నతనివంకఁ జూచుచు) బో-ధ-ప-డి-న-ది.

వెంక—మాలతీ! వృథాగా దగ్ధముచేసితిని. నన్నెవ్వరిశిక్షఁజేసినఁ బాపము లేదు. నాగతి యింతవఱకు వచ్చెనని తెలిసినపిమ్మట నొకయే కాంతస్థలమునకుఁ బోయి గోడను దలఁ బగులఁ గొట్టుకొంటి. నన్ను నిందించుకొంటి. భగవంతుఁడా యేపిడుగైనఁ బంపి నన్నుఁ దీసికొనిపొమ్మని దేవునకు మొఱవెట్టితి. నా దంతయు నరణ్యరోదన మయ్యె. ఏమిచేయుదు? సగముచచ్చి యున్నాను.

మాల—ఏమిచేసిన లాభమున్నది? చేతులుగాలిన పిమ్మట నాకులు పట్టుకొనినఁ బ్రయోజన మేమి? మంచి నిర్వాహకుఁడవయ్యె! అరవిందాకరగ్రహణముమాట యేమైనది?

వెంక—అందును బిచ్చిగానే చరించితిని. ఆమెను బతిమాలి దయను

సంపాదించుటకు మాఱు మఱింతకోప మామెకుఁ గల్గించితిని. అగ్నిహోత్రమునం దాద్యముఁ బోసినట్లు చేసితిని. అప్పు డేమి జరిగె ననుకొన్నావు? ఎవఁడో వచ్చి నన్నుఁ జావమోఁది మూర్ఛ నొందునట్లుచేసి, యరవిందను లోనికిఁ గొంపోయెను. ఆమెయు నేనును మాటలాడుకొనినమాట లన్నియు నాతఁడు చాటుననుండి వినియుండును.

మాల—వాఁ డెవఁడు?

వెంక—ఎవఁడో చూచినదాఁక వాఁ డాగెనా? వెంటనే పోయినాఁడు. నేను మూర్ఛనుండి తేఱిచూచుసరి కెవ్వరును గానరారైరి. అట్టి యవస్థలోనుండి తత్క్షణమే బయలుదేఱి యిచ్చటి కరుదెంచితిని. అంతయు వింటివికదా? నాయంతటి నిర్భాగ్యశిరోమణి లోకములో నుండఁడని యెఱుఁగుదువుకదా! కావున నిప్పుడు కర్తవ్య మేమియో తెలుపుము. నా కేమియుఁ దోఁపకుండెను. నీయుపదేశము ననుసరించి తప్పక వర్తింతును. చెప్పుము.

మాల—(వెంకటపతి ముఖమువైపు నిశ్చలదృష్టులతోఁ జూచుచుఁ గొంతవడి యాలోచించి) ఏఁబదివేలరూపాయలుగదా మీకిచ్చుట కేర్పాటు కావింపఁబడెను? అదిమీ కెప్పుడు చేతిలోఁబడును?

వెంక—రెండుమూఁడు వారములు పట్టును. మామామ కామేశ్వరరావుతోఁ గలసి లెక్కలన్నియుఁ దేల్చుసరి కామాత్రముఁ గాలము పట్టకపోదు. ఇప్పుడున్న మరణశాసనము తప్పని, దొరతనమువారియొద్ద నభియోగము దేఁ బ్రయత్నములు చేసితినిగాని, యవి నెగ్గవని యందఱును జెప్పుచున్నారు. కావున మన మాయత్నముఁ జేయనక్కఱ లేదు.

మాల—అందునుగూర్చి మీరు చెప్పనక్కఱ లేదు. నాకుం దెలియును. విశాఖపురములో మీ కర్తక మేమిచేయఁ దలఁచిరి?

వెంక—వర్తకమునిన నాకుఁ గిట్టదు. విధిలేక కొంతకాల మెటులోఁ గంష్టమూసికొని చేసితిని. మఱియు దానియం దంతలాభ ము న్నట్లు కాన్పింపదు. నేను విశాఖపురము వెడలినంతోడనే ధాన్య మును దెగనమ్మి యాసొమ్మును మఱియొకదానియం దుపయో గించుకొందును. కాని, నేను నిరాశనొందఁ బనిలేదనియు, నీ వు తగినసాయముఁ జేసెదవనియుఁ జెప్పితివిగదా ? ఏమిసాయ మొనర్తువు ? ఎట్లు ? నీబుద్ధికి గోచరమగు తెఱఁ గంతయుఁ దె లుపుము.

మాల—నా శక్తివంచనలేకుండ సాహాయ్యమును జేసెదను. కాని గె లుపొందఁగలనని యెట్లు నిర్ధారితముగాఁ జెప్పఁగలను ? మీ మామయు నరవిందయు నెట్టివారలో యించుక వర్ణించి చెప్పఁ డు. వారికీర్తిని వింటినిగావున నాకును వారినిగూర్చి కొంచెము తెలియును. కాని మీరు వారికుటుంబములోనివారు గనుక మర్మము లన్నియు నెఱఁగియుందురని యిట్లడుగుచున్నాను.

వెంక—నా మేనమామ నరసింహరాజు సత్యసంధుఁడు. ఉదారుఁడు. అమాయకుఁడు. ఒకరియందు మంచినే కాని చెడ్డ నెంచువాఁడు కాఁడు. ఆడంబరరహితుఁడు. నిత్యసంతుష్టుఁడు. అరవింద చా లవఱకుఁ దండ్రిగోనములే పొందినది. వా రెంతమంచివారును గానియెడల స్వార్థములను వీడి రాజ్యమును నాకే వ్రాసియిమ్మ ని భూపతిని బురికొల్పుదురా ? నీ వేల వారిగుణములనుగుఱిం చి ప్రశ్నించితివో తెలియకున్నది. నీవు త్రొక్కఁ దలఁచుకొన్న మార్గ మేది ?

మాల—(వానిమాటలను పాటింపక) అరవింద మీయందు మోహము ను నిలిపినదని మీకు నమ్మకముకలదా ? ప్రభాకరుఁ డనువాఁ డొకఁ డుండెనని విన్నాను ? వాఁడు—

వెంక—అవును. వానినిగూర్చి మామామ మరణశాసనములోఁ గూడ వ్రాసినాఁడు. వానికేమియు ధనమీయవలసినదని వ్రాయలేదు గాని యరవింద గుణవర్ణనమునందు నొకసందర్భమున వానినిగూర్చి యించుక ముచ్చటించియున్నాఁడు. ప్రభాకరునే భావిభర్త గాఁ దలఁపుమని తండ్రి యరవింద కాజ్ఞయిచ్చినాఁడఁట. ఆమె వినయముతో నంగీకరించెనఁట. అదియే యందు వ్రాయఁబడెను. ప్రాయశః అది నేను జంద్రమపాలెమునకుఁ బోకపూర్వమే జరగియుండును. మాలతీ! అరవింద నన్నుఁ బ్రేమించినదనుట కేమియు సందేహము లేదు. అత్యంతానురాగము నాయందొందినది. నాఁడు సభలో మరణశాసనము చదువునప్పు డా కసమయమున నాకు వెఱ్ఱియాస కల్గినది.

మాల—సరియే. చాలును. ప్రభాకరునిగూర్చి మీ కింకేమైనఁ దెలియునా ?

ప్రభాకరుఁ డకస్మాత్తుగాఁ జంద్రమపాలెమును విడిచిపెట్టుటయు నొక లేఖవ్రాసి బల్లమీఁదఁ బెట్టిపోవుటయు, నందలి యంశములును సవిస్తరముగ వెంకటపతి యామెకుఁ దెల్పెను.

మాల—మంచిది. మీరు చెప్పినదంతయు నాపన్నుగడకుఁ జాల నుపయోగకారియగును. నే నేదారిఁద్రొక్కవలెనో యిప్పుడు కొంచెము నాకు బోధపడుచున్నది.

వెంక—(ఆత్రముతో) ఎట్లు? ఎట్లు? నీమనసులోనున్నది చెప్పుము.

మాల—మీరిప్పుడు నన్నేమియు నడుగవలదు. మీప్రయత్నములలో మీరు కొనసాగించుకొనలేకపోయిరి. ఇప్పుడు నావిషయమునఁ బాధచేయకుఁడు. ఇను లింకను నేనుజచ్చితినని యే భావింపవలెను. ఇంకను నేను మాఇంటిపేరితోనే మసలవలెను. ఇప్పుడు మీరునాకుఁ గొంతరొక్క మీయవలెను, మఱియు మీకొఱకు నేను

బనిఁజేయుచున్నంతకాలము నాకుఁ గావలసినధనమును గోరిన
ప్పుడెల్లఁ బంపుచుండవలెను. ఓహో ! మఱచిపోయితిని. మీ
కాయేఁబదివేలును హస్తములలోఁ బడినతోడనే మీరామొత్త
మును మోసికొని పాఱిపోయిన నాగతియేమి? నేను ముందే జా
గ్రత్తపడవలెను. అయ్యో! మీకురాఁబోవుసొమ్ములోఁ బదివేలు
నాకిచ్చిమఱిపొండు.

వెంక—మాలతీ ! పదివేలే ? ఏమి ? నాకు రాఁబోవుదానిలో నైద
వవంతే ?

మాల—సరియే. మీకంతకష్టముగానుండిన నన్నియు మీరె చక్కఁబె
ట్టుకొనుఁడు. నేనేల ?

వెంక—నీవు నాకండ్లకు గంతలఁగట్టి తీసికొనిపోవుచున్నావు. నీవెక్క
డికిఁబోవుచున్నావో, నీయభిప్రాయమేమో యించుక తెలి
సినఁగాని—

మాల—నేనేమియు నిప్పుడు చెప్పఁదలఁచికొనలేదు. నాపన్నుగడ నెఱ
వేఱునప్పటికిఁ గొంతకాలముపట్టును. అనఁగా నొకవత్సరమైనఁ
బట్టునని నాయూహ. ఏలయన నేను గడుజాగరూకతతో, జ
త్తులతో వలలనుబన్ని వేఁటవస్తువు నాకర్షింపవలసియున్నది.
సంవత్సరాంతమున నేను సఫలీకృతమనోరథనై మీకడకువచ్చి
'అయ్యా ! నాకార్యమును నెఱవేర్చితిని. మీరాయిచ్చనచ్చినచో
ప్పన ననుభవింపుఁ' డని నేననినయెడల మీరు 'అయ్యో! పది
వేలుం వ్యర్థముగా వ్యయమయ్యెనే' యని యనుకొందురా ?

వెంక—మాలతీ! మఱియొక్కవిషయమును జెప్పమఱచితి. అరవింద
పదునెనిమిదేండ్లు నిండినఁగాని వివాహమాడఁగూడదని శాసన
మునందు లిఖియింపఁబడియున్నది.

మాల—ఇప్పుడామెవయసెంత?

వెంక—పదునైదుసంవత్సరములు నిండినవనుకొనెదను.

మాల—ఇంకనేమి ? రెండేండ్లు గడవుగలదు. ఈలోపున నభఁబు తల క్రిందుగఁజేయవచ్చు. పలుపలుకులేల? మీకు సమ్మతమగునా, కాదా? పదివేలునిచ్చెదరా? ఈయరా?

వెంకటపతి వెఱ్ఱిచూపుఁజూచుచు మిన్నకుండెను. ఆతనిచూపు 'లీమెను నమ్మవచ్చునా ? నన్నుమరల మోసపుచ్చుట కీతంత్రము ను బన్నియుండదుగదా' యని యతఁడూహించుచున్నట్లు ప్రతివారి కర్థమగును.

మాల—(ఇంచుక కోపముతో) మీచూడ్కులయర్థము నాకు వ్యక్తమైనది. ఇట్టి దురాచారములకుఁ బుట్టినిల్లనియే మి మ్మంతత్రణీకృతభావముతో నందఱుఁ జూచుచుందురు. నాకును మీయందేవకల్గుట కిదియేకారణము. నాకిందుఁ బోవున దేమియునులేదు. మీయభిప్రాయమేమో తెల్పుఁడు. అంతియేచాలును. ఎంత తెలివితక్కువవాఁడవయ్యా ! మీకొఱ కిన్నివిధముల దేవులాడుదానిన గు నామాటయందే మీకునమ్మకములేదు. మీకు బీదఱికమన్న నాకుమాత్రముకాదా? మిమ్మునుచ్ఛస్థానమందుంచుటలో నేను జయముగాంచిన—

వెంక—తప్పక నీవుకోరినదానికి రెండంతలిత్తును. కావలసిన నింకను నిత్తును.

మాల—(చిఱునవ్వుతో) అయ్యో ! ఈయరా ? అబ్రమా ?

వెంక—సరియే. సరియే, సమ్మతించితిని. నీయిష్టప్రకారమేయిచ్చెదను. కాని. నీవు త్రొక్కఁదలఁచినమార్గమేదో తెల్పుము.

మాల—కొంచెమేనియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. ఒక్కటిచెప్పెదను వినుఁడు. మనము దరిద్రులమని యిచ్చటనున్నవారెవ్వరెఱుంగరు. నాభావియత్నముల కనుకూలములగు కొన్నిపనులఁ జే



య్యుటకై, ఈరీతి యీపూఁటకూళ్ళయింటిలోనే యుండవలెను. మీరుకొత్తవారిక్కడనుంటి రేని ప్రజ లనుమానింతురు. కావున నీనిముసమందే మీరు ప్రయాణమైపొండు.

వెంకటపతి వల్లెయని యీవలకువచ్చెను. భార్యమాటలవలన బొత్తిగ నెండిపోయినయతనిహృదయక్షేత్రమందు మరల నాశాంకురములు మొలకలెత్తెను. వ్యాలతిజతనము లేమయ్యెనో ముందు గమనింతము.



## రాఁబోవుగ్రంథములు.

---

అరవింద—ద్వితీయభాగము.

పంచమ ప్రచురణము (సెప్టెంబరు—అక్టోబరు)

---

ఘూర్జరతార—ద్వితీయభాగము.

షష్టమ ప్రచురణము (నవంబరు—డిశంబరు)

---

ప్రహ్లాదచరిత్రము—అనుబంధగ్రంథము.

శ్రీమాన్ కోఁగంటిలక్ష్మీనరసింహాచార్యులవారిచే వ్రాయఁబడినది.

---

శ్రీ

# సమ్మోదినీగ్రంథమాల.

## గుంటూరు.

ఆనరరి సంపాదకులు.

1. న్యాపతి నారాయణరావు, బి. ఏ., జిల్లాకోర్టు వకీలు, గుంటూరు.
2. కోగంటి లక్ష్మీనరసింహాచార్యులు, కాకినాడ, జగన్నాథపురము.
3. నారపరాజు లక్ష్మీకాంతకవి, టౌనుహైస్కూలు తెలుఁగు పండితులు, గుంటూరు.

ప్రొప్రయిటరు, అండ్ పబ్లిషరు.

4. గరికిపాటి సేతుమాధవరావు, గుంటూరు.

ఆనరరి మెంబరు.

5. చట్టి నరిసింహారావు, అగ్రహారందారు, గుంటూరు.

విజ్ఞాపన.

శ్రీ సమ్మోదినీ గ్రంథమాలకు వ్రాయు నుత్తరములు వగయిరాలకు అడ్రెసు:—గరికిపాటి సేతుమాధవరావు,
శ్రీ సమ్మోదినీ గ్రంథమాల ప్రొప్రయిటరు
గుంటూరు.

*Address:—*

**G. SETU MADHAVAROW,**
*Proprietor & Publisher,*
*Sri Sammodini Grandhamala,*
GUNTUR.

# శ్రీసన్మోదినీగ్రంథమాల.

## నియమోద్దేశములు.

1. శక్తికొలంది నాంధ్రభాష నభివృద్ధిఁజేయుటకు యత్నించుట.
2. ఆంధ్రకవీశ్వరులఁ బ్రోత్సహించి గ్రంథముల వ్రాయించుట.
3. ఆంధ్రదేశమున కుపకరించు నవలలు, నాటకములు, దేశచరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, పూర్వకవిప్రణీతములు రెండేసినెలల కొకొక్కటి చొప్పునఁ బ్రచురించుట.
4. శిథిలములగుచున్న పూర్వగ్రంథములు లభించినచో వానినిబండితులచేఁ బరిష్కరింపించి ముద్రించుట.
5. ప్రతివత్సరాంతమున నొక్కొకబహుమతి గ్రంథమును గైకొని పండితకవులఁ బ్రోత్సహించుట.
6. నడుమనడుమఁ బరమప్రయోజన కరములగు చిన్నిపొత్తములఁ జందాదారుల కుచితముగ నొసంగుట.

## చందాపద్ధతులు.

1. చందాదారు లెవ్వరును ముందుగ సొమ్మీయనక్కఱలేదు.
2. ప్రచురించిన వెంటనే ప్రతిపుస్తకము వి. పి. గాఁ బంపఁబడును.
3. పోస్టుఖర్చులుకాక నూఱేసి పుటలకు నాలుగణాలుమాత్రమే.
4. ప్రతిపుస్తకమును దీసికొనువారే చందాదారులు.
5. చందాదారులు కానివారలకు నూఱేసిపుటల కెనిమిదణాలు విలువ యేర్పఱచి వసూలుచేయఁబడును.

గరికిపాటి సేతుమాధవరావు,

గ్రంథమాలాధికారి, గుంటూరు.

# శ్రీసమ్మోదినీగ్రంథమాల.

## రాజపోషకులు.

1. శ్రీ పిల్లలమఱ్ఱి సోమయాజులు పంతులుగారు, తహశ్శీలుదారు, నర్సారావుపేట.
2. శ్రీ చిరుమామిళ్ళ నారాయణప్రసాద్‌గారు, మేజస్ట్రీటు, నర్సారావుపేట.
3. శ్రీ జొన్నలగడ్డ వేంకట గోపాలరావు పంతులుగారు, హంసవరం, తునిపోస్టు.
4. శ్రీ మోతే గంగరాజుగారు, జమీందారు, ఏలూరు.

## పోషకులు.

1. శ్రీ నల్లపాటి శేషగిరిరావుగారు, ప్లీడరు.
2. శ్రీ మేళ్ళచెర్వు వెంకట్రామయ్యగారు, కంట్రాక్టరు, కాకినాడ.
3. శ్రీ వైజర్సు అప్పారావుపంతులుగారు, మేజస్ట్రీటు, కొవ్వూరు.
4. శ్రీరాజా కంచుకూరి శివప్రసాదభూషణరావుబహద్దరుగారు, నర్సాపురం.
5. శ్రీ యస్. వెంకటేశ్వరరావు పంతులుగారు, డిప్యూటీకలెక్టరు, హనుమకొండ. (దక్కను)

## సహాయులు.

1. శ్రీ నడింపల్లి వెంకటహనుమంతరావుగారు, ప్లీడరు, నర్సారావుపేట.
2. శ్రీ దుర్భా వెంకట శివరామరాజుగారు, ప్లీడరు, కాకినాడ.
3. శ్రీ దివాన్‌బహద్దరు దురిశేటి శేషగిరిరావుపంతులుగారు, కాకినాడ.
4. శ్రీ రావుబహద్దరు కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తిగారు, కాకినాడ.
5. శ్రీ పాణంగిపల్లి వెంకట్రావుగారు, ల్యాండుహోల్డరు, పెద్దాపురం.
6. శ్రీ మంత్రిరావు వెంకటరత్నంగారు, ప్లీడరు, తణుకు.
7. శ్రీ సారంగు సోమసుందరరావుగారు, ప్లీడరు, తణుకు.
8. శ్రీ ఘట్టు లక్ష్మీనాగభూషణరావుగారు, సబురిజిస్ట్రారు, తణుకు.
9. శ్రీ మాచేపల్లి మాణిక్యంగారు, మేనేజరు, హిందూ ఐ. సి. స్కూలు, పాలకొల్లు,
10. శ్రీ చిర్రావూరి వరదరాజుపంతులుగారు, డిస్ట్రిక్టు మునసబు, నర్సాపురం,

11. శ్రీ రాయసం కృష్ణమూర్తిగారు, ప్లీడరు, నర్సాపురం.
12. శ్రీ శ్రీపాద రామమూర్తిగారు, ప్లీడరు, నర్సాపురం. [నరసాపురం.
13. శ్రీ నందూరి నరసింహాచార్యులుగారు, హెడ్ క్లర్కు డి॥ మునసబుకోర్టు,
14. శ్రీ కామరాజు వెంకటప్పయ్య పంతులుగారు, మేజస్ట్రీటు, నర్సాపురం.
15. శ్రీ పూసర రంగయ్యగారు, క్లార్కు డి॥ మునసబుకోర్టు, నర్సాపురం.
16. శ్రీ అయ్యగారి త్రియంబకంగారు, ప్లీడరు, నర్సాపురం.
17. శ్రీ బుద్ధిరాజు నరసింహంగారు, క్లార్కు, డి॥ మునసబుకోర్టు, నర్సాపురం.
18. శ్రీ వేండ్రాప్రగడ కాశీవిశ్వనాథంగారు, జగ్గంపేట.
19. శ్రీ వేథ గిరిరావుగారు, వకీలు, కమ్మమెట్టు.
20. శ్రీ ఇటుకాల రాజేశ్వరరావుగారు, వకీలు, కమ్మమెట్టు.
21. శ్రీ సద్దుదేవభట్ల జగ్గయ్యగారు వకీలు, కమ్మమెట్టు.
22. శ్రీ కలవల రాజారావుగారు, మొఖాసాదారు, కమ్మమెట్టు.
23. శ్రీ మాదిరాజు సత్యనారాయణగారు, జయంతి.
24. శ్రీ చెమిటిగంటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ప్లీడరు, తెనాలి.
25. శ్రీ నూరి వెంకటకృష్ణయ్యగారు, మునుసూరియస్టేటు, నూజివీడు.
26. శ్రీ యీమని రామేశలింగముగారు, రాజమండ్రి.
27. శ్రీ కావర్తి రంగన్నగారు, హైదరాబాదు.
28. శ్రీ మంత్రిప్రగడ వసంతరావుగారు, పోలీసు సబుయినస్పెక్టరు, దుద్దుకూరు.
29. శ్రీ పి. రంగారెడ్డిగారు, (Brother of Rani) దూబాక.
30. శ్రీ యస్. సిద్దప్పగారు, బళ్ళారి.
31. శ్రీ పి. గోపాలాచార్యులుగారు, ప్లీడరు, హైదరాబాదు.
32. శ్రీ కె. యస్. యల్. గుప్తగారు, హైదరాబాదు.
33. శ్రీ యస్. జగ్గయ్యగారు, వకీలు, కమ్మమెట్టు.
34. శ్రీ అద్దేపల్లి హరిశ్చంద్రుడుగారు, జనరల్ మర్చంటు, కాకినాడ.
35. శ్రీ పొత్తూరి ఆనందరావుగారు, పాతగుంటూరు.
36. శ్రీ గంగరాజు కామేశ్వరరావుగారు, పాతగుంటూరు.
37. శ్రీ రామరాజు రామారావుగారు, పాతగుంటూరు.



# మా గ్రంథమాలా విలేఖకులు.

మ. రా. రా.

1. శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు. శతావధానులు, శ్రీ పోలవరం జమీందారువారి యాస్థానకవులు, కాకినాక; బందరు. [ఉర్లాము.
2. శ్రీ కొండ్రి భద్రాద్రిరామశాస్త్రిగారు, ఉర్లాముజమీందారువారియాస్థానకవులు,
3. శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు, శతావధాని, కరసది.
4. శ్రీ సత్యసుబ్రహ్మణ్యేశ్వర కవులు, శతావధానులు, కలవపాముల.
5. శ్రీ శృంగారకవి సర్వారాయఁడుగారు, కళాశాలాపండితులు, కాకినాడ.
7. శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారు, కళాశాలాపండితులు, కడప.
8. శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారు, అనకాపల్లి. [మదారాసు.
6. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు, ఎడిటరు, ఆంధ్రసాహిత్యపరిషత్తు,
9. శ్రీ ద్వివేది బ్రహ్మానందశాస్త్రిగారు, శతావధాని, కళాశాలాపండితులు, తుని.
10. శ్రీ నండూరి మూర్తిరాజుగారు బి. యె. కాకినాడ.
11. శ్రీ కాశ్యకూరి సాంబశివరావుగారు బి. యె. పోలవరము.
12. శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు, విజయనగరము.
13. శ్రీ కోగంటి లక్ష్మీనరసింహాచార్యులుగారు, కాకినాడ.
14. శ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, అష్టావధాని, రాజమండ్రి.
15. శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, అష్టావధాని, పొలమూరు.
16. శ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారు, ఏలూరు,
17. శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు మేనేజరు, ఆంధ్రసాహిత్యపరిషత్తు, మదారాసు.
18. శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు, గుంటూరు.
19. శ్రీ నారపరాజు లక్ష్మీకాంతకవిగారు, గుంటూరు.
20. శ్రీ కూచి నరసింహముగారు, బి యె. పిఠాపురం.
21. శ్రీ మోచర్ల హనుమంతరావుగారు, కాకినాడ.
22. శ్రీ ఉమ్రే అలీషాకవిగారు, పిఠాపురం. [రాజావారి యాస్థానకవులు, తుని.
23. శ్రీ కవిరాజు శ్రీ వత్సవాయి వేంకటనీలాద్రిరాజుగారు, శతావధాని, శ్రీతుని
24. శ్రీ దేవగుప్తాపు సన్యాసిరాజుగారు, కాశింకోట.
25. శ్రీ భాగవతుల రామమూర్తిగారు, విజయనగరము.
26. శ్రీ రాజా వత్సవాయి రాయగజపతివర్మగారు, రాజమండ్రి.
27. శ్రీ కస్తూరి శివశంకరకవిగారు, నర్సాపురం. [స్థానకవులు, పిఠాపురం.
28. శ్రీ రామకృష్ణకవులు, శతావధానులు, పిఠాపురం రాజావారి యా
29. శ్రీ మతుకుమల్లి సరస్వతిశాస్త్రిగారు, గుంటూరు.
30. శ్రీ కొండపల్లి లక్ష్మణపెరుమాళ్ళుగారు, ముత్యాల.
31. శ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయకవిగారు, గుంటూరుజిల్లా.
32. శ్రీ వింజమూరి వెంకటలక్ష్మీనరసింహారావుగారు, కాకినాడ,

33. శ్రీ చిలుకూరి శ్రీరామనరసింహారావు గారు, ఏలూరు.
34. శ్రీ చట్టి నరసింహారావు గారు, గుంటూరు.

---

## 1915 వ వత్సరమునఁ బ్రకటింపఁబడిన గ్రంథములు.

### ప్రథమప్రచురణము. (జనవరి—ఫిబ్రవరి.)

### ఇందుముఖి—కల్పితనవల.

---

శ్రీ శృంగారకవి సర్వారాయకవి ప్రణీతము. 100 పుటలు. చందాదారులకు పోస్టు సహా 0-6-0. ఇతరులకు 0-10-0.

---

### ద్వితీయప్రచురణము. (మార్చి—ఏప్రియల్.)

### ఘూర్జరతార—మొదటిభాగము.

---

జార్జిరై నాల్డు "లీలా" యొక్క యనుకరణము.

శ్రీ కొప్పరపు సుబ్బరాయకవి ప్రణీతము. 175 పుటలు. చందాదారులకు పోస్టుసహా 0-9-0. ఇతరులకు 1-0-0.

---

### తృతీయప్రచురణము. (మెయి—జూన్)

### మైత్రేయి—సాంఘికనవల.

---

శ్రీ చట్టి నరసింహారావుగారిచేఁ దెనిఁగింపఁబడినది. 100 పుటలు. చందాదారులకు పోస్టేజికాక 0-4-0. ఇతరులకు 0-8-0.

---

### పుష్పాంజలి.

---

"బాస్కట్ ఆఫ్ ఫ్లవర్సు" యొక్క యనుకరణము.

శ్రీదేవగుప్తాపు సన్యాసిరాజు గారిచే రచింపఁబడినది. 120 పుటలు. చందాదారులకు పోస్టేజికాక 0-5-0. ఇతరులకు 0-10-0.

---

### చతుర్థప్రచురణము. (అగస్టు—సెప్టెంబరు.)

### అరవింద—మొదటిభాగము

---

జార్జి రై నాల్డు "మేమిడిల్‌టన్" యొక్క యనుకరణము.

శ్రీ వింజమూరి వెంకట లక్ష్మీనరసింహారావు గారిచే రచింపఁబడినది. 192 పుటలు. చందాదారులకు పోస్టేజిసహా 0-10-0. ఇతరులకు 1-2-0.

---